4.11.04 గురు

# వెండి వినియోగం



ప్రపంచవ్యాప్తంగా బంగారంతో పాటు వెండి కూడా ప్రముఖపాత్ర వహిస్తోంది. ఈ రజితం బహువిధాలుగా మనకు వినియోగ పడుతుంది. నిజానికి బంగారం ఉపయోగాలకన్నా, వెండి ఉపయోగాలు ఎక్కువ!

చతుర ఫీచర్

రజితంతో నగలు, నాణాలు, వివిధరకాల పాత్రలు, అద్భుతమైన కళాఖండాలు రూపొందిస్తున్నారు. అంతేకాక వెండి కొన్ని ఆహారపదార్థాల్లో, రోదసి ప్రయాణ సాధనాల్లో, విద్యుచ్ఛక్తి సాధనాల్లో తోడ్పడుతోంది. కొన్ని కొన్ని మందుల్లో సహితం రజితం అవసరం ఎంతైనా ఉంది. అనాదికాలంగా వెండి మానవజాతికి విశేషంగా తన సేవలు అందిస్తూనే ఉంది. సైన్స్ టెక్నాలజీ రంగాల్లో దీని పాత్ర అమోఘమైంది!

తొలిసారిగా ఇది ఆసియా ఖండంలోని లిడిమా అనే ప్రదేశంలో కనుగొనబడింది. అప్పట్లో ఆ దేశాన్ని క్రోయిసస్ పాలించేవాడు. (క్రీ.పూ 640లో) ఆ రాజుకు అపారమైన సంపద కలిగివున్నవానిగా ప్రపంచమంతా పేరు ప్రఖ్యాతులు ఉండేవి. గ్రీస్, తేరియన్ గనుల నుంచి ధగధగలాడే వెండిని వెలికితీయించి, వెండి నాణాలు తయారు చేయించేవారు నాటి ప్రభువులు.

అలగ్జాండర్ చక్రవర్తి తన జైత్రయాత్రలో అనేక రాజ్యాలపై విజయం సాధించాడు. అందువలన ఆయనకు ఆయా రాజ్యాలు కైవసం కావడంతోపాటు, అక్కడగల అనేక వెండిగనులు కూడా లభ్యమయ్యాయి. ఇందువలన అపార సంపదలు లభించి,





అతి పటిష్టమైన సామ్రాజ్యాన్ని ఏర్పరచగలిగాడు. అపారమైన వెండి లభించడంవలన అలగ్జాండర్ తన రాజ్యాలను అభివృద్ధి పథంలో నడిపించాడు. అంతేకాక తన రాజ్యాలకు ఆర్థిక భద్రత చేకూర్చాడు!

అజ్ టెక్, ఇంకాలలోగల వెండి గనులు అమెరికా దేశానికి లభ్యమయ్యాయి. అది ఆ దేశప్రగతికి ఎంతో తోడ్పడింది. ఆ విధంగా ఈ వెండి అనేక సామ్రాజ్యాల వైభవానికి తోడ్పడింది. పూర్వకాలంలో సహితం, ఆయా రాజ్యాల ఆర్థిక స్థితిగతులు కేవలం ఆ రాజ్యాలకున్న రజితం యొక్క నిల్వలపైన ఆధారపడి ఉండేవి! రాజుల కోశాగారాల్లో వెండి సమృద్ధిగా ఉన్నంతకాలం రాజ్యాలు వైభవోపేతంగా ఉండేవి. ఆ వెండి నిల్వలు క్రమేపీ తగ్గిపోవడంతోపాటు, క్రమేపీ ఆ రాజ్యాలు పతనమయ్యేవి.

వెండి సమృద్ధిగా రోమన్ సామ్రాజ్యంలో ఉన్నప్పుడు ఆ రాజ్యం పరిస్థితి మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉండేదని చరిత్రకారులు అన్నారు. అనేక సంవత్సరాలపాటు రోమన్ సామ్రాజ్యంలో ఏటా 1 వెయ్యి టన్నుల వెండి గనుల నుంచి తవ్వబడేది. కాలం గడిచేకొద్దీ గనులలో వెండి తగ్గిపోయింది. ఇందువలన వెండినిల్వలు లేక రోమన్ సామ్రాజ్యం కుప్పకూలింది! ఇదే పరిస్థితి మిగిలిన దేశాలకు సైహితం సంభవించింది. అనేక దేశాలలో బహుకాలం వెండినాణాలు చలామణిలో ఉండేవి. అవి క్రమేపీ మాయమయ్యాయి. ఇందుకు కారణం ప్రజలందరూ తమవద్ద వున్న వెండి నాణాలు అన్నిటినీ ఖర్చు చెయ్యకుండా భద్రంగా దాచడమే! అధిక సంఖ్యాకులు వెండి నాణాలను భూమిలో రహస్యంగా దాచేవారు!

యుద్ధాలవలన ముప్పు ఏర్పడుతుందన్న భయం కలిగినప్పుడు, దొంగలకు భయపడి - వారు రాగి, ఇత్తడి పాత్రలలో వెండి నాణాలు దాచి, భూమిలో పాతేవారు. కొందరు మూఢ నమ్మకాలతో అనేక నదులలో ఆ నాణాలను విరజిమ్మేవారు. అందువలన తమకు మేలు కలుగుతుందనీ, పంటలు బాగా పండి తాము సుఖంగా ఉండగలమనీ ప్రజలు భావించేవారు. పెద్ద ఓడలలో భారీఎత్తు వెండి దిమ్మెలు, వెండి నాణాలు - ఒక దేశం నుంచి మరొక దేశానికి చేరవేసేప్పుడు, ప్రమాదవశాత్తూ ఓడలు సముద్రంలో మునిగిపోయి, వాటిలోగల వెండి నాణాలు, దిమ్మలు సాగర గర్భంలో ఉండిపోయేవి. కొందరు వ్యాపారస్తులు - గజ ఈతగాళ్లను హెచ్చుమొత్తాలలో నియమించి, సముద్రగర్భంలో వున్న రజిత సంపదను వెలికి తీయించేవారు.

వెండితో నాణాలను క్రీ.పూ. 7వ శతాబ్దం నుంచీ రూపొందించడం ఆరంభమయింది. రోమన్లు, గ్రీకులు తమ రాజ్యాల చిహ్నాలను వాటిపై ముద్రించేవారు. అతిగొప్ప నగరం, అత్యంత శక్తివంతమైన రాజ్యం అయిన ఏథెన్స్‌కు అతిపెద్ద వెండి గనులు ఉండేవి. కాల

క్రమేణా, ఆ పెద్దరాజ్యం అవసరాల కొరకు ఆ గనులలో రజితం అంతరించిపోయింది. ఈ హేతువు చేత ఆ మహాసామ్రాజ్యం కుప్పకూలిపోయింది. మన దేశంలోని కోలార్ బంగారు గనుల్లోని బంగారం పూర్తిగా అంతరించి, ఆ గనులు మూతపడినట్లే, ఏథెన్స్‌లోని వెండి గనులు వట్టిపోయాయి!

అలగ్జాండర్ చక్రవర్తి పర్షియాపై పెద్ద ఎత్తున దండయాత్ర జరిపి, అక్కడ 2500 టన్నుల వెండిని తన సామ్రాజ్యానికి తరలించుకున్నాడు! 150 సం.రాలు గడిచేసరికి అతని అతిపెద్ద సామ్రాజ్యం నిర్వహించడానికి, అప్పటి చక్రవర్తులు భారీఎత్తున కోశాగారాలలో వున్న వెండిని ఖర్చుచేశారు. చివరికి ఆ వెండి నిల్వలు కేవలం 90 టన్నులు మాత్రమే మిగిలింది! పాలకులు చేసిన కొన్ని అవకతవక పనుల వలన కూడా వెండినిల్వ తగ్గింది.



నాగరికత వలన వివిధ దేశాలూ అభివృద్ధి పథంలో పయనించడం ప్రారంభమయ్యేసరికి వివిధ దేశాల్లో వెండినాణాలు రూపొందించడం జరిగింది! ఒక్క మనదేశంలోనే 300కు మించిన వివిధ రకాల వెండినాణాలు రూపొందించడం జరిగింది! ఈస్టిండియా కంపెనీ మనదేశంలో వ్యాపారం ఆరంభించిన సమయంలో వెండి నాణాల వాడకం హెచ్చుగా ఉండేది! నేటి నవీన యంత్రయుగంలో వెండి ఆవశ్యకత ఇబ్బడి ముబ్బడి అయింది! ఫొటోగ్రఫీ, ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్ సాధనాల తయారీలో వెండి గణనీయమైన పాత్ర వహిస్తోంది!

మన దేశంలో వెండి నిల్వలు అపారంగా ఉన్నాయి. 20వ శతాబ్దం అంతానికి భారత దేశంలో 4,500 మిలియన్ల జీన్స్‌ల వెండి ఉన్నదని రజిత రంగంలోని నిష్ణాతులైన పండితులు అన్నారు. అయితే ఆ వెండి అంతా ప్రభుత్వం వద్ద లేదు. వ్యాపారస్తుల వద్దా, ప్రజల గృహాల్లో ఉంది! ప్రపంచంలోనే వివిధ రకాల వెండి నగలు, తదితర సామగ్రి తయారు చేసే దేశాలలో మన దేశం 3వ స్థానం ఆక్రమిస్తోంది. ఈ రంగంలో అమెరికా ప్రథమ స్థానంలో ఉండగా, జపాన్ ద్వితీయ స్థానం వహిస్తోంది. పని తనంలోనే గాక, అద్భుతమైన కళా నైపుణ్యంలో వెండి నగలకు రూపకల్పన చేసే దేశాలలో భారతదేశమే ప్రముఖ స్థానం వహిస్తోంది. మన దేశంలో 1991లో 44.8 మిలియన్ల ఔన్సుల వెండి నగలు తయారయ్యేవి. 1993లో 109 మిలియన్ల ఔన్సులకు ఈ ఉత్పత్తి పెరిగింది. 1997 నాటికి 123 మిలియన్ల ఔన్సులకు పెంపొందింది. ఈ వివరాలను వాషింగ్టన్‌లో గల 'సిల్వర్ ఇన్‌స్టిట్యూట్' మరియు లండన్‌లో గల 'గోల్డ్ ఫీల్డ్స్ మినరల్ సర్వీసెస్' (జి.యఫ్.యం.ఎస్) సంస్థల వారు ప్రకటించారు.

మన దేశంలో విరివిగా వాడే వెండి వస్తువుల్లో, మగువల కాళ్ళపట్టీలు, వేళ్ళకు ధరించే మెట్లు ప్రముఖ స్థానం వహిస్తున్నాయి. మన రాష్ట్రంలోని బంజారా తెగకు సంబంధించిన మగువలకు వెండి నగల పట్ల మక్కువ ఎక్కువ. వారు వివిధ రకాల వెండి నగలను ధరిస్తూ ఉంటారు. వెండి గాజులు, వెండి



నాణాలతో చేసిన హారాలు, శిరోజాల చుట్టూ వెండి ఆభరణాలు అలంకరించుకుంటారు. నేటికీ నిజాం నవాబుకు చెందిన ప్రాచీన వెండి నాణాలు హైదరాబాద్ లోని చార్మి నార్ ప్రాంతంలో గల గుల్జార్ హౌస్‌లో అమ్ముతున్నారు.

బ్రిటిష్ ప్రభుత్వం అప్పట్లో మన దేశంలో ముద్రించిన వెండి నాణాలు, నేడు మన రాష్ట్రంలోకి కడపలో, నేటి మార్కెట్ రేటు ప్రకారం విరివిగా లభిస్తున్నాయి. కరీంన గర్, ఒరిస్సా రాష్ట్రంలోకి కటక్‌లలో వెండితో రూపకల్పన చేయబడిన 'ఫిలిగ్రీ' నగలు లభిస్తున్నాయి. ఇవి బహు సుంద రంగా ఉండి, చూపరుల మనస్సులను చూరగొంటున్నాయి. ముఖ్యంగా మహిళలు వాటి పట్ల మోజు కనబరుస్తున్నారు!

రాష్ట్రపతి భవనంలో అనేకంగా సిల్వర్ ఫిలిగ్రీ వస్తువులు భద్రపరచబడ్డాయి. నేత్రో త్సవం చేసే ఈ వస్తువులన్నీ కరీంనగర్ లోనే రూపొందించడం జరిగింది. ఆ వస్తు సామాగ్రిలో కొన్ని 17 కేజీల బరువు తూగేవి కూడా ఉన్నాయి. కరీంనగర్ లోని అత్యంత ప్రతిభావంతులైన సిల్వర్ ఫిలిగ్రీ పని వారి ప్రతిభ గుర్తించి, అమృత్‌సర్ లోని స్వర్ణ దేవాలయం నిర్వాహకులు ఆ దేవాలయం కొరకు, ఆ కళాకారులచేత, అద్భుతమైన అసంఖ్యాకమైన వెండి సామాగ్రి తయారు చేయించారు. అవి నేటికీ ఆ దేవాలయంలో అలంకరించ బడి ఉన్నాయి. అపురూపంగా రూపొందించబడిన ఓ పెద్ద వెండి సూట్‌కే స్‌ను సహితం కరీంనగర్ పనివారు తయారు చేసి ఆ దేవాలయానికి అందజేశారు.

ప్రఖ్యాతి చెందిన హైదరాబాద్ లోని సాలార్‌జంగ్ మ్యూజియంలో అతి మనో జ్ఞంగా రూపొందించబడిన వెండి నెమలి చూపరులను మంత్రముగ్ధుల్ని చేస్తూ ఉంటుంది. ఆ కళా ఖండాలను కరీంనగర్ లోని ప్రతిభా వంతులైన కళాకారులు రూప కల్పన చేశారు.

సిల్వర్ ఫిలిగ్రీ పనితనానికి అత్యంత పేరు ప్రఖ్యాతులు పొందిన నగరం కటక్. అక్కడ అతి ముచ్చట గొలిపే రోజ్ వాటర్ స్ప్రేయర్లు, క్యాండిల్ స్టాండ్‌లు చూసి పోర్చు గీస్ వ్యాపారస్తులు ముగ్ధులై వాటిని తమ దేశానికి తీసుకు వెళ్లి బహుకాలం విక్రయిం చారు. 19వ శతాబ్దం నాటికి కటక్‌లోని వెండి కళాఖండాలు ప్రపంచమంతటా ప్రఖ్యాతి చెందాయి. అనేక అంతర్జాతీయ ఎగ్జి బిషన్‌లలో ఆ మనోహరమైన వస్తువులు ప్రదర్శించబడి అందరిచేత కొనియాడబడ్డాయి.

ఫిలిగ్రీ రంగంలో అత్యంత ప్రతిభగల

అరేబియా, మాల్టా, జెనోయా దేశాలలోని కళాకారులు రూపొందించే వస్తువుల పని తనానికీ, నాణ్యతకు, కళా కౌశలానికే కటక్ కళాకారుల ప్రతిభ సరితూగుతుంది. ఒరిస్సా లోని 'కళింగ కో ఆపరేటివ్ ఫిలిగ్రీ సొసైటీ' వారు 300 మంది కళాకారులను ఫిలిగ్రీ వస్తువుల రూపకల్పనకు నియమించారు. ఆ ప్రతిభావంతులు- బ్రూచెస్, పెండెంట్స్‌లను వివిధ ఆకృతులలో వెండి ఫిలిగ్రీ సామగ్రినీ రూపొందిస్తున్నారు. వారి సేల్స్ ఎంపోరియంలు మన దేశమంతటా ఏర్పాటు చెయ్యబడ్డాయి. అవి అన్ని రాష్ట్రాలలోని ప్రజలను విశేషంగా ఆకర్షిస్తున్నాయి!

ఆ ఫిలిగ్రీ వస్తువులు జపాన్, హాంగ్‌కాంగ్, నెదల్‌లాండ్స్, జర్మనీ, ఇంగ్లాండ్, ఫిన్‌లాండ్ లకు ఎగుమతవుతున్నాయి. వివిధ రకాల క్రీడలలో విజయం సాధించిన క్రీడాకారులకు పురస్కారంగా అందజేసే ట్రోఫీలను వెండితో తయారు చేస్తారు. ఈ అపురూపమైన వెండి ఫొటోగ్రఫీకి అత్యంత ఆవశ్యకమైంది. (వెండిని ట్రాయ్ వెయిట్‌తో తూస్తారు) 32.15 ట్రాయ్ జీన్సులు 1 కిలో వెండికి సమానం. 32.15 ట్రాయ్ జీన్సులు 2 వేల ఫొటో పిక్చర్‌లకు సరిపోతుంది. ఎక్స్‌రేలు పూర్తిగా వెండిపై ఆధారపడి ఉన్నాయి.

వాతావరణ కాలుష్యం వలన మనం తాగే నీరు అత్యంత కలుషితమైంది. ఆ నీటిని శుభ్రపరిచే ప్రక్రియలో వెండి గణనీయమైన పాత్ర వహిస్తోంది. ఇది క్లోరిన్ కన్నా 10 శాతం అధికంగా జలాన్ని శుభ్రపరుస్తుంది! సూక్ష్మజీవులను అతిశీఘ్రంగా చంపుతుంది! ఒక స్పూన్ వెండి ద్రవం- 26 మిలియన్ల లీటర్ల నీటిని శుభ్రపరుస్తుంది. అందువలన ఆ జలం కలుషిత రహితమవుతుంది. ఈ కారణం చేత 11 ది నేషనల్ ఎయిరోనాటిక్ మరియు స్పేస్ ఎడ్మినిస్ట్రేషన్ (నాసా) వారు వ్యోమగాములు సంచరించే స్పేస్‌క్రాఫ్ట్‌లలో, వ్యోమగాములు తాగేనీటిని శుభ్రపరచడం కోసం వెండినే ఎన్నుకొన్నారు!

ఎలక్ట్రిసిటీలో రజితం అత్యుత్తమ కండక్టర్‌గా పనిచేస్తుంది! ఇది చిన్న హియరింగ్ ఎయిడ్ నుంచి అతి పెద్ద పవర్‌ప్లాంట్ వరకూ తన సేవలను అందజేస్తోంది. రోదసిలో ప్రయాణానికి శాస్త్రజ్ఞులు రూపొందించిన సాధనాలలో వెండి వహించిన పాత్ర అనన్య సామాన్యమైంది! రజితం లేనిదే మనిషి చంద్రునిపై అడుగులు వేసేవాడు కాదు! మనం వినియోగిస్తున్న బ్యాటరీల కన్నా, వెండిని ఉపయోగించిన బ్యాటరీలు అత్యుత్తమమైనవి. సిల్వర్ జింక్ బ్యాటరీలు, సాధారణ బ్యాటరీలకన్నా 20 రెట్లు హెచ్చు శక్తిగలవి! వీటిల్లో కొన్ని బ్యాటరీలు కేవలం 4 కేజీల బరువు మాత్రమే వుండి అద్భుతమైన సేవలు అందిస్తాయి. చంద్రునిపై తొలిసారిగా 1969వ సం॥రం జూలై నెలలో కాలుమోపిన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ ఈ బ్యాటరీలు అందజేసిన సహకారం వల్లనే, ఊపిరి తిత్తులకు ఆక్సిజన్ అంది స్పేస్ సూట్‌తో సంచరించగలిగాడు! లూనే అనే వాహనం మనుషులను తోడ్కొని చంద్రునిపై దిగగలగడానికి సిల్వర్ బ్యాటరీలే ముఖ్యం కారణం అయ్యాయి. ఆ వాహనంలో గల ప్రయాణీకులు సిల్వర్ బ్యాటరీలవల్లనే, భూమిపై గల శాస్త్రజ్ఞులతో సంభాషించగలిగారు! భూతలంపైకి టెలిపిక్చర్లు పంపగలిగారు.

అమెరికాలోని శాస్త్రజ్ఞులు'ఎనర్జీ రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ ఎడ్మినిస్ట్రేషన్' ద్వారా వెండి అద్దాలకు రూపకల్పన చేసి, తద్వారా వాతావరణ కాలుష్యం లేని పవర్‌ను అందించగలుగుతున్నారు. ఫ్రాన్స్‌లోని ఓడిఇల్లో సోలార్ ఎనర్జీలాబ్‌లో శాస్త్రజ్ఞులు సిల్వర్‌మిర్రర్‌లను వినియోగించి అనేక అద్భుతాలు సృష్టిస్తున్నారు. ఇందువలన సోలార్‌హీట్ ఉత్పత్తి అయి తద్వారా యంత్రసామగ్రికి గొప్పగా తోడ్పడుతోంది.

వెండివినియోగాల వలన బ్లాస్ ఫర్నెసెస్‌కుఅవసరమైన అల్ట్రా రిఫ్రెక్టరీ మెటీరియల్స్ రూపొందుతున్నాయి. తద్వారా



చతుర... 7



న్యూక్లియర ప్లాంట్స్, జెట్ ఇంజన్లు. రాకెట్స్ వినియోగానికి తోడ్పాటు లభిస్తోంది.

అతిపల్చటి వెండిరేకులు మన దేశంలోని వివిధ రకాల ఆహార పదార్థాలపై, ముఖ్యంగా రుచికరమైన స్వీట్లపై అత్యాధికంగా వినియోగించడం జరుగుతోంది. ఆ పదార్థాలు ఆకర్షణీయంగా కనిపించడానికి స్వీట్‌హోమ్‌వారు ఈ బహుపల్చటి రేకులు ఉపయోగిస్తున్నారు. 1999 సం॥లో ఈ వెండిరేకుల వినియోగం 200 టన్నుల వరకూ ఉండగా, ప్రస్తుతం అంతకు 14 శాతం వాడకం పెరిగింది.

మందులలో సహితం వెండివినియోగిస్తున్నారు శాస్త్రజ్ఞులు. కేవలం 1 శాతం సిల్వర్ నైట్రేట్ సొల్యూషన్, అప్పుడే పుట్టిన పసిపాప కళ్ళలో వెయ్యడంవలన, ఆ పసిపాప ఇన్‌ఫెక్షన్‌వలన అంధత్వం వచ్చే ప్రమాదానికి దూరమవుతుంది! అగ్నిప్రమాదం వలన శరీరం బాగా కాలినప్పుడు సిల్వర్ కాంపౌండ్స్ అద్భుతంగా తోడ్పడుతున్నాయి! ఆపరేషన్లలో కూడా రజితం ఆవశ్యకత ఎంతో ఉంది. ఆపరేషన్ సమయంలో కుట్లువేసేటప్పుడు సిల్వర్‌థ్రెడ్స్‌ను, డాక్టర్లు ఉపయోగిస్తున్నారు.

అదేవిధంగా ఎముకలను ఒకదానిలో ఒకటి జతచెయ్యడం కొరకు సిల్వర్ బాండులను వినియోగిస్తున్నారు! శిరస్సులోని కొన్ని భాగాలకు ప్రమాదం ఏర్పడితే ఆ ప్రదేశాలలో డాక్టర్లు వెండిప్లేట్లను ఉపయోగిస్తున్నారు. నీటి పరిశుభ్రత కొరకు సిల్వర్ అయోడ్స్ వినియోగపడుతున్నాయి. విషప్రయోగంవలన ఏర్పడే అత్యంత విపత్కర పరిస్థితిలో సిల్వర్ నైట్రేట్ ప్రాణభిక్ష పెడుతుంది.

నెపోలియన్ చక్రవర్తి వంటశాలలో గల అతి పెద్ద వెండిపళ్ళెంను కరిగించి అనేక వస్తువులు చెయ్యడం జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధసమయంలో అమెరికా దేశం ఆటమిక్ రీసెర్చ్‌ప్లాంట్‌ను నిర్మించ వలసిన ఆవశ్యకత ఏర్పడింది. అందుకొరకు 13వేల టన్నుల హెవీ ఎలక్ట్రికల్ కండక్టర్లు అవసరమయ్యాయి! అమెరికా ప్రభుత్వం తన కోశాగారం నుంచి 40 మిలియన్ల ట్రాయ్ ఔన్సుల వెండిని వెలికితీసి, ఆ కండక్టర్లకు వినియోగించారు!

ప్రపంచంలోని అతి పెద్ద వెండిగనులన్నీ ఇప్పటికే కనుమరుగయ్యాయి. వెండి ఆవశ్యకత శాస్త్రీయరంగంలోనూ, వ్యాపార రంగంలో రోజు రోజుకు ఎక్కువ అవుతోంది. అందుకు అవసరమైన వెండి నిల్వలు వివిధ దేశాల్లో తరిగిపోతున్నాయి. అమెరికాలో వెండికి రాజధాని వంటిది అయిన కోయిరెడ్‌ఎలనీ, ఇథహోలే ప్రపంచంలోనే అతి గొప్పవెండిగనులు. ప్రస్తుత స్థితిలో ఆ అతిపెద్ద గనులలో వెండి కూడా అడుగంటిపోయే స్థితిలో ఉన్నాయి! అమెరికాలోని పేరుపొందిన సన్‌షైన్ గనులలోని వెండినిల్వల స్థితి కూడా అదేరీతిలో ఉంది. 1999 సం॥లో శాస్త్రజ్ఞుల ప్రకటన ప్రకారం విశ్వవ్యాప్తంగా వెండి ఉత్పత్తి ఈవిధంగా ఉంది: మెక్సికో 33 శాతం, కెనడా 10 శాతం, ఆస్ట్రేలియా 7 శాతం, జైరీ 5 శాతం, అమెరికా 16 శాతం, పెరు 9 శాతం, బొలివియా 5 శాతం, హోండురీస్ 2 శాతం, మిగిలిన దేశాలు 13 శాతం.

మానవాళికి వెండి అందించే సేవలు చిరస్మరణీయం.

– కోడిమెల శ్రీరామమూర్తి

8 నవంబర్ 2004

# ఏరినముత్యాలు

* ప్రతి క్షణం నీ జీవితంలో భాగమే, కాలాన్ని సద్వినియోగం చేసుకో.

  – హజరత్ అలీ

* ఒక మంచి పుస్తకం ఉత్తమ స్నేహితునితో సమానం.

  – టుప్పర్

* నిశ్శబ్దం లేదా మౌనం చాలా బలమైన ఆయుధం. మనలోని కొంతమంది బలవంతులే దీనిని ఉపయోగించ గలరు.

  – స్టెర్లింగ్

* తన నాలుకను హద్దులో పెట్టుకోవడాన్ని తెలుసుకోలేని వాడు, మాట్లాడడం తెలియని వ్యక్తి అయి ఉంటాడు.

  – థామస్ ఫుల్లర్

* నా వరకు జీవితం అన్నది నేను ఏమాత్రం తెలుసుకోలేని మర్మం. భగవంతుడిచే ప్రసాదింపబడిన చాలా పవిత్రమైన బహుమతి. అతి ఉత్తమమైన జీవితాన్ని గడిపేవాడే అతి గొప్ప కళాకారుడు.

  – మహాత్మాగాంధీ

* ఆలోచించకుండా మాట్లాడడం అన్నది గురి చూడకుండా తుపాకీ పేల్చడం అవుతుంది.

  – హజ్‌లిటి

* ఒకసారి ఒక పనినే చేయండి. మొత్తం మీ జీవితం దానిపైనే ఆధారపడి ఉన్నట్లు ఆ పనిని చేయండి.

  – యుజీన్ గ్రేస్

* ఉత్తమమైన దానిని తప్ప మరోదాన్ని స్వీకరించను అని పట్టుబడితే మీరు దానిని పొందగలరు. ఇదే జీవితపు అద్భుతం.

  – సోమర్‌సెట్‌మామ్

* విప్లవాలు, నేరాలు అనేవి పేదరికం నుంచే పుట్టుకొచ్చాయి.

  – అరిస్టాటిల్

* వ్యర్థమైన మాటలు వెయ్యి చెప్పడం కన్నా శాంతిని ప్రసాదించే సార్థకమైన వచనం ఒకటి చాలు. అది చాలా గొప్పది.

  – గౌతమ బుద్ధుడు

* ధైర్యం, ప్రేమ ఇవి రెండూ తప్పనిసరిగా ఉండవలసిన ముఖ్య సుగుణాలు.

  – అరవిందుడు

* ఉపయోగపడే అబద్ధం కన్నా నష్టం కలిగించే సత్యం మేలు.

  – థామస్ మాన్

సేకరణ: దాసరి వెంకటరమణారావు

# చతుర ప్రపంచం

## రిచ్‌స్టేట్

ప్రపంచంలో అమెరికా అత్యంత ఐశ్వర్యవంతమైన దేశమైతే, అమెరికాలోనే ఐశ్వర్యవంతమైన రాష్ట్రం కాలిఫోర్నియా.

దేశం మొత్తంలోని సగం కూరగాయలు, పళ్లు, నట్స్ (జీడిపప్పు, వేరుశనగ, బాదం పప్పు) కాలిఫోర్నియా రాష్ట్రంలోనే పండుతాయి. ఇక్కడ పండే సీమబాదం పప్పు ప్రపంచంలోనే అత్యున్నత క్వాలిటీ కలది. అమెరికాలోని బాదంపప్పు



ఉత్పత్తిలో 99 శాతం!

ఇంకా కివిఫ్రూట్, ఆలివ్స్, ఫిగ్స్, డేట్స్, రెయిజెన్స్, వాల్‌నట్స్, ప్రూన్స్, పిస్టాచియోస్ ఈ రాష్ట్రంలో అధికంగా పండుతాయి. కారణం ఇక్కడ సంవత్సరం పొడవునా సూర్యుడు దర్శనమిస్తూండడమే.

చలికాలంలో సూర్యదర్శనం కాని న్యూయార్క్ లాంటి రాష్ట్రాల నుంచి ప్రతి చలికాలంలో అమెరికన్స్ కాలిఫోర్నియా రాష్ట్రానికి యాత్రకి వస్తారు. ఈ రాష్ట్ర ఆదాయంలో అధికభాగం టూరిజం నుండి కూడా లభిస్తూ ఉంటుంది. శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్‌ఏంజెలెస్, డిస్నీలాండ్, హాలీవుడ్ మొదలైనవి ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

పాల ఉత్పత్తులలో కూడా అమెరికాలో కాలిఫోర్నియా మొదటి స్థానం ఆక్రమిస్తోంది. ఇక్కడ ఆవులని ఐశ్వర్యవంతులు వ్యాపారపరంగా పెంచడం ఇందుకు కారణం. పాల ఉత్పత్తులైన ఐస్‌క్రీమ్, ఛీజ్, పెరుగు, వెన్న లాంటి అనేక ఇతర ఉత్పత్తులు కాలిఫోర్నియా నుంచి ఇతర రాష్ట్రాలకి అమ్మకానికి వెళ్తుంటాయి.

హైటెక్ సాఫ్ట్‌వేర్ వ్యాపారానికి కూడా కాలిఫోర్నియా రాష్ట్రమే కేంద్రం. ఇక్కడి సిలికాన్ వ్యాలీలో సాఫ్ట్‌వేర్ సంస్థలు కొన్ని వేలున్నాయి. ప్రపంచంలో కుబేరుడైన బిల్‌గేట్స్ కొన్న మైక్రోసాఫ్ట్ కంపెనీ ఈ రాష్ట్రంలోనే ఉంది.

విమాన పరిశ్రమలో కూడా కాలిఫోర్నియా రాష్ట్రం ప్రథమ స్థానంలోఉంది. వ్యాపారపరమైన విమాన నిర్మాణాలు ఇక్కడే జరుగుతాయి. వ్యక్తిగత ప్రయో[illegible]లకు కూడా చిన్న

విమానాలు ఈ రాష్ట్రంలోనే అధికం.

దేశ భద్రతకి ఉపయోగించే హైటెక్, ఏరో స్పేస్ ఆయుధాల ఉత్పత్తి కూడా ఇక్కడే జరుగుతోంది. కొన్ని విదేశాలకి ఎగుమతి చేస్తున్నారు. సెటిలైట్ సిస్టమ్స్, ట్రాకింగ్ సిస్టమ్స్ కూడా ఇక్కడే తయారవుతాయి.

ఏటా ఒక కోటీ డెబ్భై లక్షల గాలన్ల వైన్‌ని కాలిఫోర్నియా ఉత్పత్తి చేస్తోంది. అందుకు సరిపడా ద్రాక్ష తోటలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

అమెరికాకి చెందినవేకాక, ప్రపంచంలోని ఇతర దేశాలకి చెందిన పెద్ద కంపెనీలకి, బ్యాంకులకి కాలిఫోర్నియా రాష్ట్రంలో అనేక బ్రాంచీలున్నాయి. కాలిఫోర్నియా రాష్ట్ర ప్రజల సగటు ఆదాయం అమెరికాలో అత్యధికమైంది. (రెండో స్థానం ఫ్లోరిడాది)

అందుకే అమెరికన్‌లకి ఈ రాష్ట్రంలోకెళ్లడం మీద మోజెక్కువ. 'నేను వెస్ట్ వెడుతున్నాను' అంటే కాలిఫోర్నియా రాష్ట్రానికి వెళుతున్నాడని తూర్పు రాష్ట్రాల ప్రజలు అర్థం చేసుకుంటారు. కాలిఫోర్నియాకి శెలవులకి వెళ్లి గడపడం పెద్ద లగ్జరీగా భావిస్తారు.

---

## ఆఖరి రోజున

అమెరికాలోని వివిధ జైళ్లలోని ఉన్నతాధికారులు తరచు తాము జరిపించిన మరణశిక్ష గురించి తమ బంధుమిత్రులకి ఉత్తరాలు రాస్తుండేవారు. ఇది గొప్పతన ప్రదర్శనవల్లో లేక తాము ఇతరులతో చెప్పుకుంటే కొంత బాధ తగ్గుతుందన్న కారణంవల్లో కావచ్చు లేక ఇంకేదయినా కారణం కావచ్చు ఆ ఉత్తరాల్లో మరణశిక్షకి గురైన నేరస్తుడి ఆఖరిరోజు ప్రవర్తనని అంతా తమ ఉత్తరాల్లో తప్పనిసరిగా పేర్కొనేవారు. అలాంటి ఉత్తరాలన్నిటినీ సేకరించి ఓ సైకాలజిస్ట్ మరణశిక్షకి గురైన వారి ఆఖరిరోజు ఎలా ప్రవర్తిస్తారో తెలుసుకుని 'ఫేసింగ్ డెత్ పెనాల్టీ' అనే పుస్తకం రాశాడు. అందులోని కొంత సమాచారం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

డిసెంబరు 26, 1862లో కొందరు రెడ్ ఇండియన్స్‌ని ఉరి తీశారు. ముందురోజు వాళ్లు మొహానికి యుద్ధసమయంలో పూసుకునే రంగు పూసుకుని చావుకి సంబంధించిన పాటలు పాడుతూ గడిపారు. తమంతట తాముగానే ఉరి కంబానికి నడిచి వచ్చారు. మొహానికి నల్లటి తొడుగు వేస్తుంటే అందుకు అభ్యంతరం చెప్పారు, అది తమని అవమానించడమే అని.

అయితే చావు సమీపించినప్పుడు అంతా ఇంత నిర్భయంగా ఉండరు. ఎక్కువమంది ముందురోజు రాత్రంతా ఏడ్చి ఏడ్చి పడుకోవడం, ఉరి కంబానికి నడవడానికి నిరాకరించడం చేస్తారు. తమని బలవంతంగా తీసుకెళ్లే జైలుఅధికారులపై తిరగబడి బూతులు తిడతారు. కామ్‌గా ఉండేవారి సంఖ్య తక్కువ.

ముఖ్యంగా ఉరి తీయబడే మైనర్‌లందరి ప్రవర్తనా దాదాపు ఒకేవిధంగా ఉంటుందనీ ఈ మానసిక శాస్త్రజ్ఞుడు గమనించాడు. ఎక్కువ మంది విచారణ సమయంలో తమకి మరణ శిక్ష పడుతుందని నమ్మరు. అది పడ్డాక కూడా పెద్దగా చలనం ఉండదు. మరణశిక్ష అంటే ఏమిటో అర్థం చేసుకోవడం మొదలెట్టాక వాళ్ల ప్రవర్తనలో మార్పు వస్తుంది. తమని మరణ శిక్ష నుంచి తప్పించమని కనబడ్డ ప్రతివారినీ బతిమాలుతారు. హృదయవిదారకంగా ఏడుస్తారు. తల్లిదండ్రులకు రాసే ఉత్తరాల్లో తమని కాపాడమని కోరతారు. వాళ్ల ప్రవర్తన, చీకట్లోకి వెళ్లేపిల్లలు ఎలా తల్లిని సాయంగా తీసుకెడతారో అలా ఓ అండకోసం వెతుక్కున్నట్టుగా వుంటుంది. అతి తక్కువమంది మరణశిక్షని నిర్భీతిగా ఎదుర్కుంటారు.

మరణ శిక్షను రద్దుచేయమని అపీల్ చేసినవారి కేసు వెంటనే తేలితే అదృష్టమే. అలా కాక 5, 6 ఏళ్లు కొనసాగితే వాళ్లు ఎంతో డిప్రెషన్‌కి లోనవుతారు. ఆలస్యమయిన కొద్దీ




తమ పరిస్థితి ఏమవుతుందో అర్థంకాక ఆ ఉత్కంఠని భరించలేరు. అశాంతిగా వుంటారు. అలాంటి సమయంలో కొందరు ఆ అపీల్ ని రద్దు చేసుకుంటారు. ఇంకొందరు ఆత్మహత్యా ప్రయత్నం కూడా చేస్తారు. దగ్గరి బంధువులు అలాంటి సమయంలో వారికి ఆత్మహత్యకి పనికివచ్చే విషం, కత్తిలాంటివి సరఫరా చేయమని తమని చూడవచ్చిన బంధుమిత్రులని కోరతారు. కొందరు వాటిని అందించే ప్రయత్నం చేస్తారు కూడా. జైలుగార్డులు విజిటర్స్‌ని వెదికి అలాంటి విజిటర్స్ దగ్గర లాక్కుని పంపిస్తారు.

హంతకుని బంధువులమని చెప్పుకోడానికి సిగ్గుపడో, మరణశిక్ష పడ్డ వ్యక్తిదూరం అయ్యాడన్న వ్యథతోనో నేరస్థులకి మరణశిక్ష విధించాక వారి సంబంధీకులు కొంతమంది ఆత్మహత్య చేసుకోవడం కూడ కద్దు.

1862 నుంచి నేటి దాకా జైలు అధికారులు రాసిన అనేక ఉత్తరాలని సేకరించాక బయట పడ్డ నిజాలివి.

---

## లాగూర్డియాఫండ్

1935వ సంవత్సరంలో ఓరోజు న్యూయార్క్ మేయర్ లాగూర్డియా ఏం తోచక కోర్టుకి వెళ్లాడు. ఓ జడ్జి రాకపోవడంతో కోర్టు హాలులోని లాయర్లు ముద్దాయిలు ఆయన కోసం ఎదురు చూస్తూ ఉండటం గమనించి లాగూర్‌డియా తనే న్యాయాధిపతి స్థానాన్ని ఆక్రమించారు. ఎందుకంటే ఆయనకా అధికారం ఉంది.

కొద్ది నిమిషాల్లో మొదటి కేసు విచారణకి వచ్చింది. చిరిగిపోయిన దుస్తులు ధరించిన ఓ వృద్ధురాలు నిందితుల స్థానానికి తేబడింది. ఆమె ఓ బ్రెడ్‌ని దొంగతనం చేస్తూ పట్టుబడిందని పోలీసు అధికారి తెలిపాడు. ఆమెని "నేరం ఒప్పుకుంటావా? " అని లాగూర్డియా అడిగాడు. "అవును. నా అల్లుడు నా కూతుర్ని వదిలేశాడు. అది జబ్బుతో మంచంమీంచి లేవడంలేదు. దాని ముగ్గురు పిల్లలు రెండు రోజులనుంచీ ఆకలితో నకనకలాడుతున్నారు. నేను కూడా బీదదాన్ని కాబట్టి ఓ షాపులోకి ఏదో కొనడానికి వెళ్లినట్టు నటించి బ్రెడ్‌ని దొంగిలించి నా దుస్తుల్లో దాచుకుని తీసుకెళ్తుంటే పట్టుకున్నారు" అని నిజం చెప్పింది.

*12 నవంబర్ 2004*



జడ్జిగారితో ఇంకా ఇలా చెప్పింది. "ఒక్క నేనే కాదు ఇంకా అనేకమంది బ్రెడ్‌ని దొంగిలి స్తుంటారు. నేను నివశించే ఏరియాలో ఎవరికీ సరైన దుస్తులుగానీ, తినడానికి తిండిగానీ ఉండదు. మంచులో రోడ్డుమీద ఆగిన వాహ నాల్లో పడుకుంటాం. మాకు ఇళ్లు కూడా లేవు' ' అని చెప్పింది.

అప్పట్లో అమెరికాలోని గ్రేట్ క్రాస్ వల్ల అనేక వేలమంది ఉద్యోగాలు దొరక్క బీదవా ళ్లుగా జీవితాలని వెళ్లదీస్తున్నారని లాగూర్డి యాకు తెలుసు.

"నీవు తప్పనిసరి పరిస్థితుల్లోనే నేరం చేశా వని తెలుసు. అయినా నీకు శిక్ష విధించక తప్పదు. లేకపోతే సమాజంలో ఇంకా ఎంతో మంది- దొంగతనాలకి పాల్పడవచ్చు పదిడా లర్లు ఫైన్ కట్టు. లేదా పదిరోజులు జైలుశిక్ష అనుభవించు" అన్నాడు జడ్జి.

"పది డాలర్లుంటే బ్రెడ్ దొంగతనం ఎందుకు చేస్తాను?" అంది ఆమె

"నాకు తెలుసది" అని ఆయన తన జేబు లోంచి పది డాలర్లు తీసి ఆవిడ చేతిలో వుంచి చెప్పాడు.

"దీంతో ఫైన్ చెల్లించు. ఇంతేకాదు ఈ కోర్టు హాల్లో వున్న అందరికీ తలో అరడాలర్ చొప్పున ఫైన్ విధిస్తున్నాను. ఎందుకంటే వారు నివశించే నగరాన్ని ఓ వృద్ధురాలు తన మనమల కోసం బ్రెడ్ దొంగతనం చేసే దుర్భర స్థితిలో వుంచారు కనుక" కోర్టు క్లర్క్‌ని పిలిచి "ఆ ఫైన్‌ని అందరి దగ్గరా వసూలుచేసి ఆ వృద్ధురాలికివ్వు" అన్నాడు.

ఆయన కూడా తన జేబులోంచి అరడాలర్ ఫైన్‌తీసి క్లర్క్ చేతిలో పెట్టాడు. క్లర్క్ అక్క డందరి వద్దా డబ్బు సేకరించి వృద్ధురాలికి చ్చాడు. మర్నాడు ఈ సంగతి అన్ని దినపత్రి కల్లోనూ వార్తగా వచ్చింది. ఏ షాపునుంచి ఆమె బ్రెడ్ దొంగలించిందో కోర్టులో సాక్ష్యం చెప్పడానికి వున్న ఆ షాపు యజమాని ఎర్ర బడ్డ మొహంతో తన జేబులోంచి అరడాలర్ ఇచ్చారని, అది ఆ బ్రెడ్ ఖరీదు కన్న అధికం అనీ ఆ వార్తలో రాశారు.

దినపత్రికలన్నీ లాగూర్డియన్ చర్య సమం జసమైనదేనని రాశాయి. ఈ వార్త చదివాక చాలామంది న్యూయార్క్ ఉద్యోగస్థులు నెల నెలా తమ జీతాల్లోంచి అరడాలర్‌ని వాలంట రీగా బీదలకోసం చెల్లించడం మొదలెట్టారు. ఆ ఫండ్ ఈ రోజున న్యూయార్క్‌లో లాగూర్డి యన్ పేర ' ది లాగూర్డియన్ ఫండ్'గా కొన సాగుతూ బీదలకి సాయం చేస్తోంది.

✦

# చతుర

సంపుటి: 27

సంచిక: 10

నవంబర్ 2004

322వ సంచిక




## ఇలాగ ఎందరో...

- ఎ. అన్నపూర్ణ

వరుడు
కలవారింటి అబ్బాయి. వధువు మధ్యతరగతి
మగువ. వాళ్ల హనీమూన్‌కి స్విట్జర్లాండ్ వెళ్లడానికి టికెట్స్
బుక్ అయ్యాయి. అయినా శోభనం సంప్రదాయబద్ధంగా ఇంట్లో
జరిగితే శోభాయమానంగా వుంటుందన్న పెద్దల మాటలకి సరేనన్నారు.
శాస్త్రోక్తంగా దంపతి తాంబూలాలకి సర్వం సిద్ధం అయింది.
హఠాత్తుగా తంతు ఆపేయాల్సి వచ్చింది.
రెండో కొడుకుతో తాళి కట్టించుకున్న వధువు పెద్ద కొడుకు భార్యగా అత్తవారింట్లో
అడుగుపెట్టింది. ఇద్దరు పిల్లల తల్లి అయింది. అందరి ఆదరాభిమానాలు
చూరగొంది, అయినా మనశ్శాంతిలేదు. క్షణం క్షణం, భయం, భయం!
యౌవనంలోని తొందరపాట్లు, విచ్చలవిడితనం కుటుంబ గౌరవాలతో
ఆడపిల్లల జీవితాలతో చెలగాటమాడే తీరును ప్రత్యేక కోణంలో
పరిచయం చేసిన ఎ.అన్నపూర్ణ నవల

**ఇలాగ ఎందరో...**



"అపురూపమయిన ఈ మధుర క్షణాలు కొద్ది గంటల్లో ముగిసిపోతాయి. యధాప్రకారం నేనూ, పిల్లలూ పంజరంలో, నువ్వు దేశరక్షణ బాధ్యతల్లో..." గొంతు రుద్ధమై, దుఃఖాన్ని అదుపుచేయాలనుకున్నా ఆమె కళ్లు వర్షిస్తున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. బేలగా ఆమె అతణ్ణి హత్తుకుపోయింది.

"డోంట్ బి సిల్లీ రేఖా! ఇక కొద్దికాలం ఓర్చుకుంటే మనం హాయిగా ఒకేచోట ఉండే అవకాశం వస్తుంది. ఆ ఏర్పాట్లు చేస్తాను. నాకుమాత్రం బాధగాలేదూ? కరడుకట్టిన కాఠిన్యం కర్తవ్యదీక్షవరకే! నీ దగ్గిర మామూలు మనిషినే" అన్నాడతను ఆమె కన్నీరు తుడిచి అనునయిస్తూ.

రైల్వే స్టేషన్‌లోని రెస్టారెంట్, ఫస్ట్‌క్లాస్ ఏసి ప్రయాణీకులకు కేటాయించిన వెయిటింగ్ రూమ్‌లో వున్నారు వాళ్లిద్దరూ.

"ఇక వెడదామా రేఖా? ట్రైన్ వచ్చే టైమ్ అయింది" అన్నాడతను లేచి నిలబడుతూ.

"ఒక్క నిమిషం.. మొహం కడుక్కుని వస్తానంటూ" వెళ్లింది రేఖ. తిరిగి వచ్చేసరికి అతను మాగజైన్స్ కొంటూ హిగ్గిన్‌బాదమ్స్ దగ్గిర కనిపించాడు. అతనివైపు అడుగులు వేస్తూంటే అంతలో వెనుక నుంచి వినపడింది.

"హల్లో రేఖా" అనే పిలుపుతో క్షణం అక్కడే ఆగింది. "రేఖా... నేనూ రేణూని" రేఖ చేతులు పట్టుకుని ఆనందంతో అంది రేణూ.

"రేణూ! ఎన్నాళ్లయిందీ మనం ఇలా కలుసుకునీ..." నమ్మలేనట్టుగా అంది రేఖ.

"అవును, చాలాకాలం అయిపోయింది. ఎక్కడుంటున్నావ్? పిల్లలు...?" అడిగింది రేణూ.

"హైదరాబాద్‌లో... ఇద్దరు" ఇంకా ఏదో చెప్పబోతుంటే ట్రైన్ ఫ్లాట్‌ఫామ్ మీదకు రావడంతో దూరం నుంచి అతను రేఖను పిలిచాడు.

"ఇదిగోనే రేణూ నా ఫోన్‌నంబర్! వీలున్నప్పుడు కాల్ చెయ్. సారీ టైమ్‌లేదు. వెడతానూ" అంటూ గబగబా ఫోన్ నంబర్ రాసిచ్చి వేగంగా వెళ్లిపోయింది రేఖ.

రేఖ భుజం చుట్టూ చేయివేసి పొదివి పట్టుకుని భద్రంగా తీసుకువెడుతున్న అతన్ని చూసి 'రేఖ భర్త బాగున్నాడు ఆమెకు తగినట్టుగా' అనుకుంటూ రేఖ ఇచ్చిన స్లిప్‌ను బ్యాగ్‌లో పెట్టుకుంది రేణూ!

★ ★ ★

తల వంచుకుని రేణూ బెంచ్ పక్కన నిలబడిన ఆ అమ్మాయి "ఏమండీ మీ పక్కన కూర్చోవచ్చా?" అడిగింది బెరుగ్గా.

ఆమె వాలకం చూసి, కూర్చో కూడదు. అలా నిలబడే వుండాలి" సరదాగా అంది రేణూ.

అంతే ఆ అమ్మాయి కళ్లనుంచి బొటబొటా కన్నీళ్లు రాలిపడ్డాయి. బిక్కమొహంతో అలాగే బొమ్మలా నిలబడింది.

కరిగిపోయిన రేణూ "ఏయ్ ఏమిటా ఏడుపు? ఖాళీగా వున్న ప్లేస్‌లో కూర్చోడానికి పర్మిషన్ అడగాలా? పట్టి అమాయకురాల్లా వున్నావ్ కూర్చో" అంది చేయిపట్టి లాగి బెంచ్‌మీద కూర్చోబెట్టి.

తర్వాత పరస్పరం పరిచయాల్లో ఆ అమ్మాయి, ఆ కాలేజ్‌కే కొత్తగా ట్రాన్స్‌ఫరై వచ్చిన లెక్చరర్ ఆనందరావ్ గారమ్మాయనీ, పేరు రేఖ అనీ తెలిసింది.

"రేఖా! ఎందుకంత భయం? మీ నాన్నగారు లెక్చరర్! ధైర్యంగా ఆనందరావ్‌గారి అమ్మాయిని అని చెప్పి, మమ్మల్నే హడలకొట్టాలి కానీ ఇలా పిరికిగా వుండకూడదు" అంటూ స్నేహం కలిపింది రేణూ.

అలా ఇద్దరూ ఫ్రెండ్స్ అయిపోయారు. కానీ రేఖ ఇంట్లో అంతా చాదస్తం మనుషులు. నియమనిష్టల పట్టింపులు ఎక్కువ. ఈ కారణంగా వాళ్ల పరిచయం కాలేజీకి మాత్రమే పరిమితమైంది.

"సినిమాకి వెడదామా?" అంటే "అమ్మ

బాబోయ్, మా అన్నయ్య చంపేస్తాడు, అమ్మ, బామ్మలతోనే చూడాలి, అదీ భక్తి సినిమాలే" అనేది రేఖ.

"నీకు చూడీదార్స్, మాడ్రన్ డ్రెసెస్ బాగుంటాయ్! ముసలమ్మలా ఈ ముతక చీరలేమిటి అప్పుడే? " అంటూ మందలిస్తే,

"మా అమ్మ ఇవే కట్టుకోమంటుంది" బుద్ధిగా చెప్పేది రేఖ.

"సెలవుల్లో మా ఫ్యామ్లీ అందరమూ బెంగుళూర్, మైసూర్ ట్రిప్ వెడుతున్నాం. నువ్వు కూడా రా" అని రేణూ అన్నప్పుడు

"అయ్యబాబోయ్ మా నాన్నగారు చంపేస్తారు" అంటూ భయపడింది.

"అహ... కాలేజీలో అబ్బాయిలుంటారు. బురఖా వేసుకుని వెళ్లాలి. పొరబాటున కూడా అబ్బాయిలవైపు చూడకు, అన్లేదూ? " అంది రేణూ కోపంగా.

"అందుకేగా మా నాన్నగారు పనిచేసే కాలేజీలో చేర్పించారూ" అంటూ అమాయకంగా చెప్పే రేఖను ఏమనాలో తెలిసేది కాదు రేణూకి.

"రేఖా తప్పు చేయనప్పుడు ఎందుకు భయపడతావు? మీవాళ్లు నీ ఇష్టాన్ని తెలుసుకోరా! నచ్చిన డ్రస్ వేసుకోడం, సరదాగా సినిమాలు చూడటం, విజ్ఞానంకోసం వినోదయాత్రలు చేయడం తప్పుకాదు. ఏదో ఒక తప్పు చేసేటంత బలహీనురాల్ని కాదని ధైర్యంగా చెప్పు. ఒక్క చెల్లెలివి. అభిమానంగా చూడటం పోయి మీ అన్నయ్య కూడా నిన్ను దండించడం మరీ అన్యాయం. అనుమానించడం సిగ్గుచేటు. ఈ రోజుల్లో ఇలాంటి వారున్నారూ అంటే బాధగా వుంది" అంది రేణూ.

"నా ఇష్టాన్ని తెలియచెప్పాలని చాలా సార్లు అనుకుంటాను. కానీ ఒక్కమాట బయటకు రాదు. రేణూ నీ స్నేహం ఒక్కటే నాకు ఓదార్పు. ఇంట్లో మనుషుల నుబట్టీ పరిస్థితులనుబట్టి ఇలాగే వుండటానికి అలవాటు పడిపోయానేమో! మా వాళ్లని తప్పుపట్టడం ఎందుకులే" అంటూ నింద తనమీదనే వేసుకునే రేఖ మనస్తత్వానికి జాలిపడేది రేణూ.

మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సు పూర్తయింది. రేఖలో మార్పులేదు. కాలేజీకి వెళ్లాల్సిన అవసరం లేదు కాబట్టి రేణూ, రేఖ కలుసుకునే అవకాశం లేకుండా పోయింది. రేణూయే అప్పుడప్పుడు రేఖా వాళ్ల ఇంటికి వెళ్లేది. కాలేజీ తర్వాత రేఖని వీధి గుమ్మం దాటనివ్వని ఆనందరావుగారి కుటుంబాన్ని చూసినప్పుడే ఇలాంటి మనుషులు వుంటారని రేణూకి తెలిసి వచ్చింది.

"మా నాన్నగారికి గుంటూరు ట్రాన్స్ఫర్ అయింది రేణూ! వెళ్లిపోతున్నాం. నీతో చెప్పి వెడదామని వచ్చాను" అంటూ రేఖ వచ్చి చెప్పినప్పుడు, రేణూకి చాలా దిగులుగా అనిపించింది. కాలేజీలో ఉన్నంత సేపూ వదలకుండా అంటిపెట్టుకుని తిరిగే రేఖమీద అభిమానం వలన ఆమె దూరంగా వెడుతోందని తెలిసినప్పుడు కళ్లంట నీళ్లు వచ్చాయి. మూడేళ్ల కాలేజీ అనుబంధం, టీనేజ్‌లో దగ్గరగా వచ్చేవారు స్నేహితులు... భవిష్యత్‌కు పునాదులు వేసే లెక్చరర్స్... వారిని తిరిగి కలుసుకుంటామో లేదో తెలియదుకాని మరచిపోలేము.

"రేఖా! మీ నాన్నగారికి మా నాన్నగారి చేత చెప్పిస్తాను. నువ్వు ఇక్కడే ఎంఎస్సి చెయ్! హాస్టల్లో వుండచ్చు మీ నాన్నగారికి ట్రాన్స్ఫర్ అయితేనేం? " చివరి ఆశతో చెప్పింది రేణూ!

"నాకూ, నీ స్నేహం, చదువూ విడిచివెళ్లాలని లేదు రేణూ! మా రెండో అక్క పెళ్లి చేయాలి. అన్నయ్య స్థిరపడలేదు. తమ్ముడు ఇంజినీరింగ్ చదువుతున్నాడు. నాన్నగారికి నా ఆసరా కావాలి. అందుకే బ్యాంక్ టెస్ట్ రాసి ఉద్యోగం చేయాలంటూ నాన్నగారు చెప్పారు. ఆయన చెప్పక పోయినా నా నిర్ణయమూ అదే! నాన్నగారు నన్ను హాస్టల్లో వుంచి చదివించడం జరిగేపనికాదు" అంది ఎంతో విచారంగా.

## సచిత్ర విచిత్రం

# హాలీవుడ్ స్టార్ ఉదారత

ఎలిజబెత్ టేలర్ ఆమధ్య లాస్‌ఏంజెలెస్‌లోని చిన్న పిల్లల హాస్పిటల్‌కి వెళ్ళి అక్కడ చికిత్స పొందుతున్న అనేకమంది చిన్న పిల్లలతో మూడు గంటలు గడిపింది. వారంతా తల్లి ద్వారా పుట్టుకతోనే ఎయిడ్స్ వ్యాధి బారిన పడ్డ దురదృష్టవంతులు.

తనతోపాటు టీ.వీ.లోని కెప్టెన్ ప్లానెట్ అనే సీరియల్‌లోని ఓ పాత్ర పోషించే నటుడిని ఆ ఆహార్యంతోపాటు తీసుకెళ్ళింది. అమెరికాలోని పిల్లలంతా ఆసక్తిగా చూసే సీరియల్ అది. పిల్లలకి ఆ నటుడు చాలాసేపు వినోదం అందించాడు.



ఎయిడ్స్ రోగగ్రస్థులకి లిజ్ ఎంతో సహాయం చేస్తోంది. ఆమె మనవరాలు ఒకరు ఎయిడ్స్ వ్యాధితో మరణించడంతో కదిలిపోయిన లిజ్ ఈ కార్యక్రమం చేపట్టింది. ఇది నవంబర్ ౧, ౧౯౯౪లో జరిగిన సంఘటన.

"నీకంటే మీ అక్కకంటే పెద్ద వాడైన మీ అన్నయ్యకి నీకున్నపాటి ఆలోచన వుంటే బాగుండేది. మీ నాన్నగారు కూడా నీ చేతనే ఉద్యోగం చేయించి తన బాధ్యతను పంచా లనుకున్నారు. నువ్వొక్క దానివేనా లోకువ" కోపంగా అంది. ఇలాంటి తండ్రులు కూడా వుంటారని మరో విషయం కొత్తగా తెలిసి వచ్చింది నిస్సహాయంగా, రేఖకు వీడ్కోలు చెప్పడం తప్ప మరేమీ చేయలేకపోయింది.

ఆ తర్వాత ఎంఎస్సి, పిహెచ్డి చేసిన రేణూ చదివిన కాలేజీలోనే లెక్చరర్గా చేరింది. ఆరు సంవత్సరాలు గడిచిపో యాయి. ఉద్యోగం చేస్తూనే సివిల్ సర్వీసె స్కి ప్రిపేర్ అయింది. అప్పుడే చాలా కాలం తర్వాత అనుకోకుండా రైల్వేస్టేషన్లో రేఖ కనిపించేసరికి, ఒక్కసారి గతమంతా గుర్తు వచ్చింది.

అయ్యేఎస్ ఎగ్జామిన్ హైదరాబాద్లో రాయడానికి వెళ్లాల్సి వచ్చినప్పుడు రిజర్వే షన్ చేయించుకుని రేఖకి ఫోన్ చేసింది. నేరుగా మీ ఇంటికి వస్తున్నానని చెప్పడా నికి! కాని ఎన్నిసార్లు ఫోన్చేసినా ఎవరూ అటువైపునుంచి లిఫ్ట్ చేయలేదు. ఫోన్ అవు టాఫ్ ఆర్డరా? రేఖ ఏ ఊరైనా వెళ్లిందా? అర్థం కాలేదు. సరే హైదరాబాద్ స్టేషన్లో దిగాక మళ్లీ ఫోన్ చేస్తాను. పలికితేసరి లేకుంటే ఏ హోటల్లోనో దిగవచ్చు అను కుంది. అలాగే స్టేషన్నుంచి కాల్ చేస్తే వెంటనే రేఖ మాట్లాడింది.

"హమ్మయ్యా! ఊళ్లోనే వున్నావా! వైజాగ్ నుంచి బయలుదేరబోయే ముందు ఎన్ని సార్లు ఫోన్ చేసినా రెస్పాన్స్ లేకపోతే లేవ నుకున్నాను" అంది.

"అవును రేణూ, పిల్లలకు సెలవులు కదాని ఎటో వెళ్లాం. ఇప్పుడు ఇక ఏ డవు టూలేదు. తిన్నగా ఇంటికి వచ్చెయ్" అంటూ వివరంగా అడ్రస్ చెప్పింది రేఖ.

ఈసారి కూడా రేఖను మిస్ అవనుకదా! అని దిగులుపడిన రేణూ రేఖ చెప్పిన అడ్రస్ ప్రకారం ఆటోలో బయలుదేరింది.

రేఖ ఇంటిముందు ఆటో దిగి పరిశీలనగా చూసింది. ఇండిపెండెంట్ హవుస్. చాలా పెద్దది. ఇంటిముందు ఆటో ఆగిన అలికిడికి తలుపు తెరచి బయటికి వచ్చింది రేఖ. రేణూని చూడగానే ఆమె ముఖంలో ఆనందం కనిపించింది.

"అడ్రస్ సులువుగా తెలిసిందా? ప్రయాణం బాగా జరిగిందా? బ్రష్ చేసు కుంటే కాఫీ తీసుకువస్తాను. ఇదిగో నీ రూమ్" అంటూ హడావిడిగా రేణూని లోప లికి తీసుకువెళ్లింది.

రేణూ ఏకంగా స్నానం కూడా చేసేసి డ్రస్ చేసుకుని వచ్చేసరికి రేఖ కాఫీ కప్పుతో ఎదురుగా నిలబడి ఉంది.

రేఖ చేతిలో కప్పు అందుకున్న రేణూ అక్కడే ఉన్న కుర్చీలో కూర్చుని "ఉదయం అంతా నీకు బిజీ! మోహన్ ఆఫీస్కి వెళ్లా లేమో! నీకు ట్రబుల్ ఇచ్చానా? ఏదో కొత్త వాళ్లకు చేసినట్టు ఈ మర్యాదలు ఏమిటీ? నేనే డైనింగ్ టేబుల్ దగ్గరకి వచ్చేదాన్నిగా" అంది రేణూ.

"అలాగే టిఫిన్ చేయడానికి వద్దువుగాని. నువ్వు న్యూస్పేపర్ చూస్తూండు టిఫిన్ రెడీ చేసి పిలుస్తాను" అంటూ మెరుపు వేగంతో మాయమయింది రేఖ.

ఇల్లంతా చాలా బాగుంది. కానీ ఏ వస్తువూ వుండాల్సిన చోట లేదు. న్యూస్పే పర్ పేజీలు విడివిడిగా నేలమీద పడివు న్నాయి. కాఫీ టేబుల్ నిండా లెటర్స్, మాగ జైన్స్, సిగరెట్ పీకలతో నిండిన యాష్ట్రే, కీ చెయిన్స్తోనూ నానా కంగాళీగా వుంది.

నాకు కేటాయించిన ఈ రూమ్ మాత్రం నీట్గా సర్దిపెట్టింది. రేఖకి పిల్లలున్నారా? పనివాళ్లు లేరా? ఇంత పెద్ద ఇల్లు చూస్తే రేఖ భర్త పెద్ద ఉద్యోగస్థుడు అనిపిస్తోంది. లేదా కలవారబ్బాయి అయివుండాలనిపి స్తోంది. ఇంట్లో పనంతా రేఖ స్వయంగా

చేసుకోవాల్సి రావడంతో ఇల్లు ఇలా అస్తవ్య స్తంగా వుందా? కనీసం ఒక్క పనిమనిషి అయినా వుంటుంది కదా? అయినా పిల్ల లున్న ఇల్లు మరెలా వుంటుందీ అను కుంటూ రేఖ ఇచ్చిన న్యూస్‌పేపర్ తిరగేయ సాగింది రేణూ.

"రేఖా! నీకసలు బుద్ధుందా? నేను రాత్రి చెప్పిన పన్లు ఒక్కటీ చేయలేదు. ఉదయం నేను లేచేసరికి వర్కంతా చేసి పేపర్స్ రెడీగా వుంచాలని చెప్పానా లేదా? నువ్వ సలు వాటిని ముట్టుకోనే లేదు. నీకు నా మాటంటే అస్సలు లక్ష్యం లేకుండా పోయింది" చేతిలో వస్తువేదో విసిరికొట్టిన ట్టున్నాడు. అది గోడకు కొట్టుకుని భళ్లున పగిలిన శబ్దం వినబడింది.

రేణూ ఒక్కసారి అదిరిపడింది. ఆ అరు పులు రేఖ భర్తవా? కోపం ఎక్కువేమో! మరి ఆరోజు నేను చూసినప్పుడు అంత ఆదరంగా, ప్రేమగా కనిపించాడు. ఇంటిద గ్గర అసలు స్వరూపం ఇదన్నమాట.

"ఈ కాఫీ ఏమిటే ఇలా ఏడిసిందీ ఎప్పుడో పది రోజుల డికాషన్‌లా ఉంది. ఛీ రోజురోజుకీ నిన్ను భరించడం కష్టంగా వుంది" మళ్లీ కాఫీ కప్పు విసిరికొట్టాడు.

రేణూ ఇక భరించలేకపోయింది. ఒక్క వుదుటున లేచి హాల్లోకి వెళ్లింది. అంతే! అంతదాకా నోటికొచ్చినట్టు తిడుతూ శివాలె త్తిపోయిన అతను రేణూని చూసి కూల్‌గా అయిపోయాడు.

"మీరు... మీరు రేణూయా?" నమ్మలే నట్టు, ఆశ్చర్యంగా చూస్తూ, సౌమ్యంగా మారి పోయాడు.

ఇతనికి నేను రేణూనని ఎలా తెలి సింది? ఇతనెవరు? రేఖ భర్తకాదే! ఎందు కంటే ఆ రోజు రేఖతో చూసింది ఇతణ్ణి కాదు. మరి మరిదా బావగారా? వాళ్ల యినా మరీ ఇంత హీనంగా ప్రవర్తిస్తారా? మామగారా అంటే అంత వయసులేదు.



రేఖతో ఇతడి బంధుత్వం ఏమిటో? అర్థం కాని రేణూ స్థాణువులా అయోమయంగా చూస్తుండిపోయింది.

"అదేమిటండీ, అలా వింతగా చూస్తారు? మిమ్మల్ని ఫొటో ఆల్బమ్‌లో చూశాన్లెండి. మీరు మా మారేజ్‌కి రాలేదుకదూ? నేను కృష్ణమోహన్‌ని. రేఖ భర్తని, కాదు రేఖ నా భార్య" అన్నాడు చొరవగా మాట్లాడుతూ.

రేణూకి తల తిరిగిపోయింది. రాయిలా బిగుసుకుపోయింది.

ఇతనే రేఖ భర్త అయితే ఆ రోజు స్టేష న్‌లో కనిపించిన వ్యక్తి ఎవరు? అంటే రేఖకి ఎవరితోనో సంబంధం వుందా? ఏమీ అర్థంకాక అలా చూస్తుండిపోయింది.

కానీ మోహన్ రేణూ వైపు చాలా ఉత్సా హంగా చూస్తూ "మీరేం చేస్తున్నారు? ఇలా కూర్చోండి. ఇంతకుముందు పరిచయం లేదు కదాని మొహమాటం వద్దు. ఫ్రీగా వుండండి. ఫొటోలో కంటే మీరు చాలా అందంగా వున్నారండీ. పెళ్లయినట్టు లేదు. అందుకే ఫ్రెష్‌గా కనిపిస్తున్నారు" ఆమెను తినేసేలా చూస్తూ అసహ్యంగా మాట్లాడసాగాడు.

రేణూకి అతడి ధోరణి వెగటుగా వుంది. బుద్ధితక్కువై వచ్చానా? అనుకుంది. అంతలో రేఖ టిఫిన్‌కి పిలవడంతో అయిం దనిపించి చెప్పులేసుకుని

"రేఖా! నేను సాయంకాలం లేట్‌గా వస్తాను. నాకోసం వెయిట్ చేయకు. వస్తాను" అంటూ ఎటు వెడుతోందో చెప్పి బయల్దేరింది.

"అయ్యో! అలా పరుగు పెడతారేమి టండీ! నేనూ అటువైపే వెళ్లాలి. మిమ్మల్ని డ్రాప్ చేస్తాను. ఒక్కక్షణం ఆగండి. డ్రస్ ఛేంజ్ చేసుకుని వస్తాను" అన్నాడు మోహన్.

"వద్దండీ! నాకు హైదరాబాద్ అలవాటే. బస్‌లోనో, ఆటోలోనో వెళ్లగలను" అంటూ వేగంగా ఇంటినుంచి బయటపడింది రేణూ.

సాయంకాలం ఇంటికి వచ్చేసరికి, పిల్లలిద్ద రితో ఫ్రీగా కనబడింది రేఖ. మోహన్

ఇంట్లో లేడు. హాయిగా అనిపించింది రేణుకి.

ఇప్పటికి ఇద్దరూ మాట్లాడుకునే అవకాశం వచ్చింది.

"రేణూ! వీళ్లిద్దరూ నా కూతుళ్లు, ట్విన్స్. రోజా, పూజాలు" అంది పిల్లలను చూపిస్తూ.

"అయ్యో వట్టి చేతుల్తో వచ్చాను. వివరాలు తెలుసుకునే అవకాశమే లేకపోయింది" అంటూ గిల్టీగా ఫీలైంది రేణూ.

మాట్లాడుకుంటూ ఇద్దరూ వంట పూర్తి చేసేసరికి మోహన్ వచ్చాడు. అంతే, మళ్లీ అతను వాగుడు మొదలుపెట్టాడు. చిరాకు కలిగినా, చేసేదిలేక భరించాల్సి వచ్చింది రేణుకి.

భోజనాలదగ్గిర, వండిన ప్రతీ అయిటమ్‌కీ పేరు పెట్టాడు. "చూడండి రేణూ! రాకరాక వచ్చారు. శ్రద్ధపెట్టి వంట చేయాలనే ధ్యాసలేదు మీ ఫ్రెండ్‌కి. మీరివాళ పస్తులుండాల్సిందే" అన్నాడు.

"ఏమోనండీ! మీకెందుకు నచ్చలేదోకానీ, చాలా బాగున్నాయ్ పదార్థాలు" కావాలని పేరుపేరునా మెచ్చుకుంది రేణూ.

అతను ఎన్ని అన్నా, ఎంత చీదరించుకున్నా పట్టించుకోలేదు రేఖ. మౌనంగా తన పనేదో పూర్తి చేస్తోంది. రోజా, పూజాలు కూడా అల్లరి చేయకుండా, బుద్ధిగా వున్నారు. వాళ్లకి తండ్రి దగ్గిర చనువులేదో, అతను చేరదీయడో మరి! మోహన్ ఇంట్లో వున్నప్పుడు వాతావరణానికీ, లేనప్పటి వాతావరణానికీ చాలా తేడా వుంటుందని రేణుకి అర్థమైంది.

వంటగదిలో పని పూర్తి చేసుకుని డాబా మీద కూర్చుని చాలా మాట్లాడుకోవాలని రేణూ రెండు కుర్చీలు తీసుకుని పైకి వెళ్లింది. కుర్చీలు సర్ది వెనక్కి తిరిగి రేఖని పిలవాలనుకునేలోగా మోహన్ ప్రత్యక్షమయ్యాడు.

"ఏం టేస్ట్ అండీ మీది. చల్లని గాలి, పున్నమి వెన్నెల, ఓహ్! పరవశింపచేసే వాతావరణం. మీరేమిటో ప్రతి విషయంలోనూ ప్రత్యేకంగా కనిపిస్తారు. ఇన్నేళ్లుగా మీతో పరిచయం కలగకపోవడం దురదృష్టం" అంటూ అక్కడే కుర్చీలో బైఠాయించాడు.

"ఈ కుర్చీలు వేసింది మీతో కబుర్లు చెప్పడానికి కాదండీ. నేనూ రేఖా మాట్లాడుకోవాలని. మీరిలా ఆటంకం కలిగించడం న్యాయమా? " అందామనుకుని తమాయించుకుని "మరో కుర్చీ తీసుకురండి. రేఖ కూడా వస్తుంది" అంది రేణూ.

మోహన్ ఏమీ పట్టించుకోకుండా తన ధోరణిలో ఏదో వ్యర్థప్రసంగం మొదలుపెట్టాడు. కొద్దిసేపు భరించిన రేణూ ఆవలించినట్టు అభినయించి "నాకు నిద్రవస్తోందండీ. ఈరోజు చాలా టైర్ అయిపోయాను" అంటూ చివాల్న లేచి కిందకు వచ్చేసింది.

చాలాసేపు బెడ్‌మీద మసలుతూనే వుంది. ఎంతకీ నిద్ర పట్టనేలేదు. ఏమిటో ఈ రేఖ కాపురం వింతగా వుంది. భార్యాభర్తలు మాట్లాడుకోవడంలేదు. పాపలను మోహన్ ఒక్కసారి కూడా చేరదీయలేదు.

యంత్రంలా తనపనేదో చేసుకోవడం తప్పితే, ఒకే ఇంట్లో భార్యాభర్తలు నివశిస్తున్నట్టు లేనేలేదు, వాల్తేర్‌లో రేఖతో బాటు కనిపించిన ఆ వ్యక్తి ఎవరు? రేఖ కాలేజీలో చదివే రోజుల్లోనే అబ్బాయిలతో మాట్లాడేదికాదు. అటువంటిది మోహన్‌తో కాకుండా, మరెవరితోనో కనిపించడంలో అర్థం ఏమిటి? అతను ఇంట్లో వున్నంతసేపూ నాతో కూడా అభిమానంగా మాట్లాడదు.

మోహన్ బుద్ధి సరియైనదికాదని అనుకున్నా, పెళ్ళయ్యాక భర్తతో సర్దుకుపోవలసిందేకదా? అందులోనూ రేఖది, ఎవరికీ వ్యతిరేకంగా నడుచుకొనే తత్వంకాదు. మరి ఇదేమిటి?

మోహన్‌కి ఆడవాళ్ళతో పూసుకుని తిరగడం, వల్గర్‌గా మాట్లాడటం అలవాటని అర్థం అవుతోంది. ఈ కారణంగానే రేఖ

భర్తతో మాట్లాడదా? మరి మోహన్ అంటే ఇష్టం లేదేమో అనుకుందామంటే ఇద్దరు పిల్లలున్నారే? హుం... పిల్లలకేముందీ... ఇదీ యాంత్రికంగా వంట చేసినట్టు, భోజనం చేసినట్టూ... అయివుంటుంది.

నేను అనుకున్నంతా అయింది. ఇది కావాలని కోరుకోని రేఖ జీవితం, ఈ రేఖ జీవితంలో సుఖపడగలదా అనుకున్నాను. అలాగే జరిగిందా? ఏదో చదువు విషయం లోనో, కట్టుకునే డ్రస్ విషయంలోనో మరొకటని తలవంచుకుని సర్దుకుపోవచ్చు ఇష్టం లేకపోయినా రాజీపడిపోవచ్చు అతి ముఖ్యమైన జీవితభాగస్వామి విషయంలో కూడా తలవంచుకుని తాళి కట్టించేసుకుందా? చూసి జాలిపడాలా, ఇంకా అమాయకత్వంతో మనసులేని మరబొమ్మలా వున్నందుకు చిరాకుపడాలా? ఈ మిస్టరీ ఏమిటో అర్థంకాక తల తిరిగిపోతోంది.

అయ్యో పిచ్చిరేఖా! చదువు ఎవరికోసమో చదివావు. ఉద్యోగం ఎవరికోసమో చేశావ్. పెళ్ళి, కాపురం అయినా నీకోసమే నిర్ణయించుకోవాలని గ్రహించుకోలేదా. నీ గురించి ఎన్నో అనుకున్నాను. కనీసం పెళ్ళయి, నిన్ను అర్థంచేసుకోగల భర్త లభించి, సుఖపడతావని ఆశపడ్డాను. పెళ్ళి అయ్యాక మరింత కష్టాల్లో పడ్డావని అర్థం అయింది. నిన్నారోజు నేను చూడకపోయినా బాగుండేది. పలకరించకుండా వూరుకున్నా సరిపోయేది. ఎక్కడో సుఖంగా సంసారం చేసుకుంటున్నావనే తృప్తివుండేది. తీరా కలిసి, నేను ఇక్కడకు వచ్చి ఇవన్నీ చూడాల్సిరావడం బాధగావుంది. రేపే ఇక్కణ్ణించి వెళ్ళాలి' అనుకుంది రేణూ తనలో.

అప్పుడు టైమ్ ఎంతయిందోకానీ రేఖ వేరే బెడ్ తెచ్చుకుని రేణూ పక్కనే వేసుకుంది. ఇంకా నిద్రపోని రేణూని చూసి, "రేణూ,. నిద్రపట్టలేదా? కబుర్లు చెప్పుకుందామా? " అంది.

రేణు లేచి కూర్చుని, "అవును రేఖా! నిద్ర పట్టడంలేదు. నువ్వు... ఇదేమిటీ? " బెడ్ వైపు చూపిస్తూ, సంశయంగా అడిగింది.

"నా బెడ్‌రూమ్ ఇదే! నువ్వు పడుకున్న బెడ్ నాదే..." తాపీగా చెప్పింది రేఖ.

ఇంకెలా మాట్లాడాలో తెలియక, "రేఖా, రేపు ఉదయం ట్రైన్‌కి వెడతాను" అంది.

"ఏం బోర్‌గా వుంది కదూ? నాకు తెలుసు. కాని, నీరాక నాకు చెప్పలేనంత ఆనందం కలిగించింది. మనం మనసారా మాట్లాడుకోలేదు. నిజమే! కానీ నా మనసుకి ఊరటగా వుంది" అంది రేఖ.

"ఏమిటో రేఖా! నిన్ను చూశాక కొన్ని విషయాలు బోధపడ్డాయి. మరికొన్ని తెలియలేదు. నువ్వు...సుఖంగా వున్నావా... లేవు"

"అవున్నిజమే! నేను కొన్నాళ్ళు చాలా సుఖంగా వుంటాను. మరి కొన్నాళ్ళు చాలా దుఃఖపడతాను. ఈ విషయాలు నీకు చెప్పాలనే వుంది. నాకోసం మరో రెండురోజులు వుండాలి" అంది రేఖ.

"వుండీ... ఏంచేయాలి? మోహన్ కబుర్లు వినాలా? అతడ్ని భరించాలా? నాతరంకాదు. నేను వచ్చింది నీకోసమే! ఈమాత్రం ఆశ్రయం, భోజనం హోటల్లో వుండదూ? నేను నీ గురించి ఎన్నో అనుకున్నాను. నీ సుఖాన్ని ఆశించాను. కన్నవారింట్లో కష్టంతీరి, భర్త దగ్గర స్వర్గసుఖాలు అనుభవిస్తున్నావని భావించాను" దిగులుగా చెప్పింది రేణూ.

"నువ్వనుకున్నది సగం నిజం, సగం కాదు, అని చెప్పానుగా. జీవితంలో వెన్నెలా, చీకటీ వుంటాయి కదూ రేణూ! అలాగన్న మాట. రెండురోజులు ఆగితే నీకు చాలా విషయాలు తెలుస్తాయి. నువ్వు ఆనందంతోనే ఇంటికి వెడతావ్"

"నాకంతా పజిల్‌లా వుంది నీ విషయం. కొన్నాళ్ళు ఆనందం, కొన్నాళ్ళు విషాదం అంటున్నావ్. మోహన్‌ని చూస్తే మాత్రం ఆనందానికి చోటుందా అనిపిస్తోంది. ఇన్నేళ్ళు మోహన్‌ని ఎలా భరించావ్?

# ఏరినముత్యాలు

* నిజమైన ఆనందం కోసం ఎంత దూరమైనా వెళ్ళు.

– పంచతంత్ర

* పరిస్థితులు బలహీనులకు అవరోధాలు, కార్య సాధకులకు ఆచరణాలు.

– అలెన్

* నిరంతరం నేర్చుకుంటే తప్ప ఉపాధ్యాయుడనేవాడు నిజంగా మరొకరికి విద్య నేర్పలేడు.

– రవీంద్రనాథ్ టాగూర్

* ఒక వ్యక్తిని అణగదొక్కడం అన్నది మంచిది కాదు. అది అభివృద్ధిని ఆపు చేస్తుంది. వ్యక్తిగత వాదానికి పూర్తిగా మద్దతు ఇవ్వడం అన్నది అరాచకత్వాన్ని ప్రోత్సహించడం అవుతుంది.

– జవహర్‌లాల్ నెహ్రూ

* కోపపు సమయంలో సహనాన్ని పాటించగలిగితే నూరు రోజుల బాధ నుండి మీరు తప్పించుకోగలరు.

– చైనీస్ సామెత

* అవకాశం తనను వరించినప్పుడు ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకునేందుకు తయారుగా ఉండడంలోనే జీవిత విజయ రహస్యం దాగున్నది.

– బెంజిమిన్ డిస్రేలి

* గట్టిగా ప్రజల కోసం ఫిర్యాదు చేసే వారే ప్రజల సంక్షేమం కోసం పాటుపడే వారుగా ఉంటారన్నది సామాన్యంగా జన బాహుళ్యంలో ప్రచారంలో ఉన్న అపోహ.

– బర్క్

* మనకు కొంత తెలిసినప్పుడు మాత్రమే మనం సరిగ్గా తెలుసుకున్న వారము అవుతాము. ఎక్కువగా తెలుసుకోవడంలో సందేహాలు మొలకెత్తుతాయి.

– గోథే

* చదువుల గమ్యం భగవంతుడిని తెలుసుకోవడమే. ఆ తెలుసుకోవడం నుండి ప్రేమించడం, భగవంతుడిని అనుకరించే గుణం అలవడుతుంది.

– మిల్టన్

* మీ తప్పులను, మీ చెడు పనులను ఒప్పుకొనే ధైర్యాన్ని కలిగి ఉండండి. మీ తప్పును లేదా ఓటమిని కప్పిపుచ్చుకోవడం రెండింతలు అపరాధం అవుతుంది.

– కూరత్ ఆళ్వార్

* మన జీవితాన్ని పణంగా పెట్టి దానిని కూడా వదులుకోవడానికి మనల్ని సంసిద్ధులుగా చేయగల ఆదర్శాన్ని ఎన్నుకోవడం అన్నదే జీవితంలో అతి ముఖ్యమైన ఎన్నిక అవుతుంది.

– స్వామి చిన్మయానంద

సేకరణ: దాసరి వెంకటరమణారావు

ఎలా పిల్లల్ని కన్నావ్? నీకు మోహన్ అంటే ఇష్టంలేదు. అయినా ఎవరికోసం అతనితో కలిసి వుంటున్నావ్? ఈ జీవితంమీద నీకు విసుగు రావడంలేదా? కనీసం ఉద్యోగమన్నా చేయడంలేదు. బయటకు వెళ్ళినప్పుడైనా మనశ్శాంతి వుండేది. ఎందుకు వదులుకున్నావ్? మోహన్ చాలా భాగ్యవంతుడని తెలుస్తోంది. అతను మీ నాన్నగారికి ఏమైనా ఆర్థికసాయం చేశాడా? ఏమాశించి ఇతన్ని పెళ్ళిచేసుకోడానికి సిద్ధపడ్డావ్? " వేదనగా అంది రేణూ.

"అన్నిటికీ సమాధానాలు తెలుస్తాయి. నీ వేదనా తీరుతుంది. నీకు నామీద ఎంతటి అభిమానమో నాకు తెలుసు. అందుకే నీతో అన్నీ చెప్పాలనీ, నా జీవితాన్ని చూడాలనీ, నువ్వు స్టేషన్‌నుంచి ఫోన్ చేసినప్పుడు మా ఇంటికే రమ్మని చెప్పాను. అంతకుముందు ఫోన్ చేసినపుడు మోహన్ లిఫ్ట్ చేశాడు. నీతో ఫోన్‌లోనే వల్గర్‌గా మాట్లాడతాడని అటునుంచి రెండో ఫోన్‌లో నువ్వని తెలుసుకున్నప్పుడు కట్ చేశాను. అతడి ధోరణి తెలిస్తే, మా ఇంటికి రావేమోనని భయపడ్డాను" అంది రేఖ.

"మరి, మరి... నువ్వు నా రూమ్‌లో పడుకుంటే, మోహన్ కోపగించుకోడా? మరింత గొడవలు జరగవా? " అసలైన అనుమానం వ్యక్తంచేసింది రేణూ.

"ఈ ప్రశ్నకు సమాధానం ఇప్పుడుకాదు, తర్వాత చెబుతాను. మిగిలిన విషయాల్లో దుర్మార్గుడేకానీ, ఈ విషయంలో నా ఇష్టప్రకారం జరుగుతుంది" చెప్పింది రేఖ.

"ఏమో రేఖా! నీ జీవితం చాలా వింతగా వుంది.. మీరిద్దరూ భార్యాభర్తలు! కానీ మాట్లాడుకోరు. నువ్వతనికి సేవలు చేస్తావు! కానీ మీకు శారీరక సంబంధం లేదు. అతడు నిన్ను హీనంగా చూస్తాడు. నువ్వతన్ని పట్టించుకోవు. అయినా మీకిద్దరు అమ్మాయిలు. తండ్రిగా వారిని చేరదీయడు, ముద్దుచేయడు. అయినా మీతో కలసి వుంటాడు. ఇష్టంలేని ఇద్దరు వ్యక్తులు ఏ కారణంగా, ఏ అనుబంధంతో ఒకే ఇంట్లో వుంటున్నారో నా ఊహకు అందటంలేదు. మీ ఇంటికి వచ్చిన మరుక్షణమే, ఎందుకు వచ్చానా అని తిట్టుకున్నాను. కానీ నిన్ను వదిలిపోవాలంటే బాధగా వుంది. రెండుగంటలు మోహన్ని భరించలేను, మరో రెండు రోజులు వుండాలంటూ అడుగుతుంటే నీమాటా కాదనలేక పోతున్నాను. వుండి నీ బాధను చూడలేకా, అతన్ని భరించలేక ఎలా వుండగలనో చెప్పు రేఖా!"

"ప్లీజ్, నాకోసం వుండవా రేణూ? నీకు మాట ఇస్తున్నాను. నిజం నువ్వు సంతోషంగానే వెడతావ్. రేపు మోహన్ బెంగుళూర్ వెడుతున్నాడు. మనం ఫ్రీగా వుండచ్చు రెండురోజులుకాదు, నాలుగురోజులు వుంటానని నువ్వే అంటావ్" అంది రేఖ.

అంతగా చెబుతున్న రేఖ మాటను తీసేయలేకపోయింది రేణూ. మర్నాడు రేణూ నిద్ర లేచేసరికే మోహన్ వెళ్ళిపోయాడు. రేణూ, రేఖా కాలేజీ కబుర్లు చెప్పుకున్నారు. పూజా, రోజాలను రైడింగ్‌కి తీసుకెళ్లారు. షాపింగ్ చేశారు. మంచి సినిమా చూశారు. ఆనందంగా గడిచిపోయాయి రెండురోజులు. రేఖ సంతోషం చూసి, మనసారా ఆనందించింది రేణూ.

"రేఖా! నువ్వు చెప్పినట్టు ఈ రెండు రోజుల నా ఆనందం చూశాక, మరెన్ని రోజులైనా మీ ఇంట్లో వుండాలనే వుంది. కానీ వెళ్ళక తప్పదు, రేపటికి రిజర్వేషన్ చేయించుకోనా? " అంది రేణూ.

"రేపు ఒక్కరోజు ఆగు. అరుణ్ వస్తాడు. అరుణ్ అంటే, మోహన్ అన్నయ్య" అంది రేఖ.

"అతడెవరో వస్తే నేనెందుకట? నాకేమైనా పెళ్ళిసంబంధం చూస్తావా ఏమిటీ? నేను పెళ్ళిచేసుకునే ఆలోచన ఈ జన్మకు లేదు" అంది రేణూ.

"మరీ 'ఈ జన్మకు' అనకు. తాత్కాలి

కంగా అయితే అవ్వచ్చు. అదీకాక నీ పెళ్ళి గురించి నీకు తెలియకుండా ప్లాన్ చేయగల గట్స్ నాకేవీ? అతి ముఖ్యమైన సీన్ రేపే చూడగలవ్ మరి. కాదంటే కుదర్దు. అయినా కాదన్నావ్ అనుకో. ఆ తర్వాత నువ్వే విచారిస్తావ్" అంది రేఖ. మరి మాట్లాడలేదు రేణూ. రేఖ సంతోషాన్ని పంచుకోవాలని అనుకుంది. ఆరోజు రేణూ నిద్రలేచేసరికి, ఇల్లంతా కొత్తగా డెకరేటివ్‌గా నీట్‌గా సర్దివుంది. పూజా, రోజా చక్కగా ముస్తాబై, కిలకిలలాడుతూ, ఆడుకుంటు న్నారు. రేణూని చూసి, కాఫీ తీసుకువ చ్చింది రేఖ. రేఖ కూడా డ్రసప్ అయి, అందంగా మెరిసిపోతోంది. అసలే అంద మైన రేఖ, రేఖలా నాజూగ్గా వుండేరేఖ, మంచి ఖరీదైన చుడీదార్‌లో దేవకన్యలా తళతళలాడుతోంది. ఆమె వదనంలో సంతోషరేఖలు కదలాడుతున్నాయ్. చాలా ఉత్సాహంగా వుంది. వంటమనిషి వున్నా, స్వయంగా వంట చేస్తుంటుంది ప్రత్యేకమైన రోజుల్లో. అప్పటికే డైనింగ్ టేబుల్‌మీద టిఫిన్ తయారుచేసి పెట్టేసింది.

"రేణూ! నువ్వు కూడా స్నానం చేసేసిరా. అరుణ్ వచ్చే టైమ్ అయింది..." అంది.

"ఎంత అందంగా వున్నావ్ రేఖా! మనసు సంతోషంగా వుంటే వదనంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈరోజు నీలో కొత్త అందాలు కనిపిస్తున్నాయ్. నాకే ఇంత మైమరపు కలి గిస్తే... ఆ తర్వాత" మాటలు రాని రేణూని బాత్‌రూమ్‌వైపు నెడుతూ.

"మైమరపు తర్వాత, ముందు స్నానానికి వెళ్ళు. టైమే లేదూ... అంటూంటే..." అంటూ సిగ్గుపడింది రేఖ.

రేణూ వచ్చేసరికే వీధి గేట్ దగ్గిర టాక్సీ ఆగింది. పూజా, రోజాలిద్దరూ ఆట బొమ్మలు వదిలి, గేట్ దగ్గరికి పరుగుతీ శారు. పిల్లలిద్దర్నీ చెరో చేతితోను ఎత్తుకుని, హాల్లో అడుగుపెట్టాడు అతను! పిల్లలకు ఆటబొమ్మలూ, స్వీట్స్ ఇచ్చి కిందకు దింపి రేఖవైపు చేతులు చాచగానే ఒక్క పరుగున పరిసరాలు మరచి అతడ్ని హత్తుకుపో యింది రేఖ.

రేణూ అతడ్ని చూస్తూనే అదిరిపడింది. 'ఇతను, ఆరోజు వాల్తేర్ స్టేషన్‌లో రేఖతో కనిపించినతను! అంటే అరుణ్! మోహన్ అన్నయ్య...' రేణూకి తానేం చూస్తోందో కాసేపు అర్థం కాలేదు. అలాంటి దృశ్యానికీ, ఈ సంఘటనకు తేడా లేదు. పూర్తిగా అర్థం అయింది. ఈ రేఖకి అరుణ్‌తో అక్రమ సంబంధం వుంది. ఛీ... ఇంత దిగజారిపో యిందా?

"నమస్తే రేణూగారు..." అన్న అతడి మాటలకు పులికిపడి చూసింది.

"ఏమిటి రేణూ? పరధ్యానంలో వున్నావు...? " ఇతను అరుణ్, ఆర్మీ కమాం డర్ అంది రేఖ. అప్పుడు ఈ లోకంలోకి వచ్చి, విష్ చేసింది రేణూ.

హుందా అయిన అతడి మాటా, తీరూ, ప్రవర్తనా రేణూని కూడా ఆకట్టుకున్నాడు. గలగలా నవ్వుతూ, నవ్విస్తూ, ఇల్లంతా సంతోషాన్ని నింపాడు అరుణ్. వారితో కలిసి ఆనందం పంచుకుంది. మోహన్ అన్న అనే విషయం నమ్మబుద్ధి కాదు. అన్న, తమ్ములకు ఎంత తేడా? అరుణ్ మాట్లాడుతూంటే ఇంకా ఇంకా వినాలని పిస్తూ, మోహన్ని ఎప్పుడు తప్పించుకుం దామా అనేట్టు వుంటుంది.

మనిషిని చూడగానే రేఖతో అతడి సంబంధానికి అసహ్యంగా అనిపించినా అరుణ్ ప్రవర్తన దాన్ని పోగొట్టింది. అందుకే తప్పు పట్టలేకపోయింది. రేఖ చేసిన వంటకాలను అతడు మెచ్చుకుం టూంటే, రేఖ వదనంలో కోటి కాంతులు వెల్లివిరిశాయ్. ఆప్యాయంతో, అనురాగంతో కొసరి కొసరి వడ్డించింది రేఖ. అరుణ్ ఇష్టంగా తింటూ, మధ్యలో పిల్లలకు తినిపి స్తూంటే ఆ దృశ్యం కమనీయంగా తోచింది రేణుకి. అడుగడుగునా మోహన్ ప్రవర్తనకీ,

ఈ అరుణ్ ప్రవర్తనకీ గల తేడాను స్పష్టంగా చూసింది.

రాత్రి భోజనాలు చేశాక అరుణ్ పిల్లలను తీసుకుని, మేడమీదకు వెళ్ళిపోయాడు. రేఖ వచ్చి రేణూ దగ్గిర కూర్చుంది.

"రేణూ! నీకు నామీద కోపం, అసహ్యం కలిగాయని నాకు తెలుసు. ఎవరైనా అలాగే అనుకుంటారు. అరుణ్‌నిచూస్తే ఏమనిపించింది? అంటే మోహన్‌కీ, ఇతడికీ గల తేడా అర్థం అయిందనుకుంటాను'

'

"అర్థం అయింది రేఖా! కానీ ఎందుకో నిన్ను తప్పు పట్టాలని అనిపించడంలేదు. అయితే ఈ అనుబంధం ఏమిటో, ఆ బంధం ఏమిటో నా ఊహకు తోచడంలేదు. నువ్వు పెళ్లి చేసుకున్నది మోహన్ని. అనురాగం పంచుకున్నది మాత్రం అరుణ్‌తో.



ఇది ఎలా సాధ్యపడిందీ అనే విషయం గురించి నేను ఆలోచించడంలేదు. ఆకర్షణ కావచ్చు అవసరం కావచ్చు ఒక్కటి మాత్రం నిజం. అరుణ్ సమక్షంలో తప్పు ఒప్పుల ఆలోచన రాదు. అతడితో ఎవరైనా మమేకం కాగలరనేది అర్థం అయింది. నీ గురించి నాకు తెలుసు. మీ కుటుంబం గురించీ తెలుసు. అందుకే కొంచెం ఆశ్చర్యంగా అనిపించింది. అంతే!" అంది రేణు.

"అవును రేణూ! నువ్వు మాత్రమే నన్ను అర్థం చేసుకోగలవు. నువ్వు చెప్పిందంతా నిజమే! దీనికి కారణం ఏమిటో, కారకులెవరో చెబుతాను అప్పుడు పూర్తిగా అర్థం చేసుకుంటావు"



"రేఖా! బ్యాంక్ టెస్ట్ రాయమని చెప్పింది ఎందుకో తెలుసా?" అడిగాడు ఆనందరావు.

"చెప్పండి నాన్న గారూ!" వినయంగా అంది రేఖ.

"నీకు తప్పకుండా సెలక్షన్ వస్తుంది. నాకు తెలుసు. అందుకే రాయమన్నాను"

"మంచిదే నాన్నగారూ! మీకు నామీద నమ్మకం వుంది. మీరు కోరినట్టుగా మీకు తోడుగా నిలబడగలిగితే అంతకన్న ఏం కావాలండీ" చెప్పింది రేఖ.

"అంతేకానీ, పి.జి. చేస్తే లెక్చరర్ అవ్వచ్చు అంతకంటే ఎక్కువ సంపాదన వుంటుంది" అని మాత్రం అన్లేదు. ఎందుకంటే అంతవరకూ ఖర్చు తప్పుదుగా అంటారని!

అక్కయ్య పెళ్ళికి, అన్నయ్య డొనేషన్‌కీ నా సంపాదనే కావాలికదా నాన్నగారూ అనే ధైర్యంలేక! రేఖ పుట్టిందే పరోపకారం కోసం ఆమెను ఆధారం చేసుకుని, తమ అవసరాలు గడుపుకుంటారే కానీ, ఆమె సుఖం గురించి ఎవరూ ఆలోచించరు. ఏం కావాలన్నా ఇంట్లో వాళ్ళకి గుర్తు వచ్చేది రేఖ. ఆ అమ్మాయి కూడా వాళ్ళు ఏది చేయమని చెప్పినా వెనకాడదు. అందుకు ఎప్పుడూ సిద్ధంగానే వుంటుంది.

చెల్లెలిమీద ఆధారపడుతున్నానని అన్న అనుకోడు. ఆమెను కష్టపెడుతున్నానే అనీ అనుకోడు. ఏదోరకంగా అవసరం గడిచిపోతోంది. చాలు అనుకుంటాడు. తండ్రి ఏ రకంగానూ కొడుక్కి లోటు రానీయడు. ఆయన ఏ పాట్లు పడితేనేం అతడికి అవసరంలేదు.

ఇక రేఖా వాళ్ళమ్మ పూజలూ, వ్రతాలూ ఎడతెరిపి లేకుండా చేస్తూ అన్నిటికీ భగవంతుడిదే భారం అనుకుంటుంది. ప్రతి పనికీ ముందు ముడుపులు కట్టేసి మొక్కేసుకుంటుంది. ఇలా ఎవరు నమ్మినదాన్ని వారు ఆచరించడమే తప్ప కేవలం భగవంతుడు ఒక్కడే ఏ పనీ చేయడనీ, కష్టపడి సాధించాలనీ, ఒళ్ళు వంచి పని చేయాలనీ అనుకోరు. వాళ్ళ సోమరితనం రేఖమీద అదనపు భారంగా తయారయింది.

ఆనందరావ్‌కి కష్టపడి చదివేది, ఆదుకునేది రేఖ మాత్రమే అని తెలుసు. అందుకే తన చెప్పుచేతల్లో వుంచుకున్నాడు. వాళ్ళకోసం ఆ అమ్మాయి అన్నిటికీ సిద్ధపడింది. బ్యాంక్‌లో ఉద్యోగం వచ్చింది. రెండేళ్ళలో ఆనందరావ్ పెద్ద కూతురి పెళ్ళి చేశాడు. గారాల కొడుక్కి మార్కులు వేయించి మొత్తంమీద బియ్యాడీ అయిందనిపించాడు. ఇక ముడుపులు చెల్లించి ఉద్యోగం వేయించడమే తరవాయి. అవకాశం కోసం చూస్తున్నాడు.

"నమస్కారం ఆనందరావ్‌గారూ, నా పేరు కృష్ణమోహన్..." అంటూ పరిచయం

చేసుకున్నాడు అతను. ఆహ్వానించకుండానే లోనికి వస్తూ.

"ఎవరు మీరు? " అడిగాడు ఆనందరావ్ ఆశ్చర్యంగా.

"నేను, మీ అమ్మాయి రేఖతోబాటే బ్యాంక్‌లో పనిచేస్తాను. కొత్తగా రెండు నెలల క్రితమే బదిలీమీద వచ్చాను" అన్నాడతను.

"అలాగా! ఏమిటీ నాతోపని? " అనుమానంగా అడిగాడు ఆనందరావ్.

"రేఖ మొదటి చూపులోనే నన్ను ఆకర్షించింది. మీరు అంగీకరిస్తే మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను" అతివినయంగా చెప్పాడు మోహన్.

"ఇప్పుడే అమ్మాయి పెళ్లి చేయాలని అనుకోవడంలేదు..." అన్నాడు ఆనందరావ్ గంభీరంగా.

"మీరు ఎప్పుడంటే అప్పుడే. ఎంతకాలమైనా వేచివుంటాను. మీరు కాదంటే అసలు పెళ్లిమాటే తలపెట్టను" అన్నాడు.

"నన్ను ఆలోచించుకోనీయండి" అంటూ అప్పటికి మోహన్‌ని పంపించేసినా మోహన్ తరచుగా ఇంటికి రావడం, బ్యాంక్‌లో వున్నప్పుడు రేఖను పలకరించకుండా ఆనందరావ్‌గారిని మెప్పించాలనీ తన కుటుంబం, ఆస్తి వివరాలూ చెప్పడంతో క్రమంగా ఆనందరావ్‌కి మోహన్ అంటే ఇష్టం ఏర్పడింది.

"బాబూ మోహన్! మీరు అయిశ్వర్యవంతులు. నేనా జీతం తప్ప ఆధారం లేని వాణ్ణి. నీకు తగినట్టు పెళ్లీ చేయలేను, కట్నమూ ఇవ్వలేను" అన్నాడు. తన నిస్సహాయత వెల్లడించి చాలారోజుల తర్వాత తనంతగాతానే పెళ్లి గురించి మాట్లాడుతూ ఆనందరావ్.

"కట్నంమాట మాటాడద్దు. రేఖలాంటి అమ్మాయి నాకు కనపడటం అదృష్టం అనుకుంటున్నాను. మా అమ్మగారికి రేఖ తప్పకుండా నచ్చుతుంది. మీరు మరోలా భావించనంటే మీ అబ్బాయికి ఉద్యోగం ఇప్పించి, మీకు ఆర్థికావసరం ఏమైనా వుంటే నావంతు సహకారం అందిస్తాను. ఈ ఇల్లు మీ స్వంతమేనా? కాకపోతే కొనాలనుకుంటున్నారా? పెళ్ళికి అంగీకరిస్తే రేఖ ఉద్యోగం చేయడం నాకు ఇష్టంలేదు. రేఖ రిటైర్‌మెంట్ బెనిఫిట్‌గా మీకు స్థలం ఉచితంగా ఇస్తాను" అంటూ చెప్పాడు మోహన్.

'ధనవంతుడు కావడం అతని అదృష్టం అయితే ఆ ధనాన్ని నావంటి వాడికోసం వినియోగించడం గొప్ప విషయం. ఇటువంటి మనిషి ఎక్కడ వుంటాడు? రేఖచేత ఉద్యోగం చేయిస్తే వచ్చే రాబడికంటే రెట్టింపు ప్రతిఫలం లభిస్తుంది, ఈ పెళ్లి జరిగితే' అని ఆలోచించిన ఆనందరావ్ సంతోషంగా పెళ్లికి ఒప్పుకున్నాడు.

"రేఖా, మోహన్ ఏరికోరి నిన్ను చేసుకుంటానని మన ఇంటికి వచ్చి అడిగాడు. పెళ్ళి చేసుకో. ఆ తర్వాత ఉద్యోగం చేయవలసిన అవసరమూ రాదు. అదే మోహన్‌కి నువ్వు ఉద్యోగం చేయడం ఇష్టంలేదు" అన్నాడు.

రేఖ ఎప్పటిలా 'మీ ఇష్టం నాన్నా' అంది తలవంచుకుని. పెళ్లి అయిపోయింది. కానీ మోహన్ ఎవర్నీ పెళ్ళికి ఆహ్వానించలేదు. బాగా దగ్గరైనవాళ్లు పట్టుమని పదిమంది కూడా రాలేదు. ఆనందరావ్‌కి అదేమంత వింతగా తోచలేదు. పెళ్లి ఖర్చంతా అతడిదే! నాకేం ఎవర్ని పిలుచుకున్నా, మానుకున్నా అనుకున్నాడు. ఆనందరావ్ తనవైపువార్నీ పిలవలేదు. ఆయనకి ఈ ఆర్భాటాలు, అనవసరపు ఖర్చులూ ఇష్టం వుండవు. పైగా బంధువులు ఇంత గొప్ప సంబంధం అంటే అసూయపడతారు. అదో అనర్థం. మా రెండు కుటుంబాలకు సంబంధించిన విషయం కనుక ఇలా సింపుల్‌గా జరిపించడమే మంచిది అనుకున్నాడు. పెద్ద అల్లుళ్లి ద్దరూ వేధించి కట్నమనీ, లాంఛనాలనీ, పెళ్లి గ్రాండ్‌గా చేయాలనీ, ఖర్చు చేయించి అప్పు

లపాలు చేశారు. ఆ అనుభవంతో మోహన్ ప్రతిపాదన చాలా సుఖంగా తోచింది.

మోహన్ తల్లి మంగళాదేవి రేఖను చూసి మురిసిపోయింది. 'అబ్బాయిది మంచి సెలక్షనే' అనుకుంది. అంతా కలిసి మోహన్ ఇంటికి వెళ్ళారు.

మోహన్ ఫస్ట్‌నైట్ ఇంట్లో వద్దనీ హానీ మూన్‌కి స్విట్జర్లాండ్‌కి టిక్కెట్స్ బుక్ చేశాననీ చెప్పాడు. మంగళ "హనీమూన్ వెళితే వెళ్ళచ్చు. సాంప్రదాయం ప్రకారం పీటల మీద కూర్చోవడం తంతు జరిపించాలి. మనింట్లో జరిగిన మొదటి శుభకార్యం అంటూ నచ్చచెప్పడంతో మోహన్ అయిష్టంగానే అంగీకరించాడు.

ఏర్పాట్లు జరుగుతున్నాయ్. మంగళ కొడుక్కి తలస్నానం చేయించాలని 'మోహన్ ఈరోజు తలస్నానం చేయాలి. నేనే స్వయంగా చేయించాలి' అంటూ ముచ్చటపడి పనివాళ్లని రానీయకుండా తనే నలుగు పెట్టింది. అప్పుడు మోహన్ శరీరం సలసలా కాగిపోతోంది. ఆవిడ గాభరాపడిపోయి "మోహన్ ఇదేమిట్రా జ్వరం వచ్చినట్టుంది. ఇంత వేడిగా వుందేమిటి ఒళ్ళూ..." అంటూ తొందరగా స్నానం ముగించేసి, అతడ్ని గదిలోకి తీసుకెళ్ళి తలతుడిచి డ్రయ్యర్‌తో ఆరబెట్టింది.

"ఉండు డాక్టర్‌ని పిలిపిస్తాను" అంటూ ఫోన్ చేయడానికి వెళ్ళబోయింది. తల్లి చేయిపట్టి ఆపి "రెండు రోజులుగా వుంది లేమ్మా. నేను మెడిసిన్ వాడుతున్నాను. అదే తగ్గిపోతుంది" అన్నాడు మోహన్ వారిస్తూ.

"రెండు రోజులుగా జ్వరం అయితే నాతో చెప్పవద్దా? నీకేం మతిలేదా! డాక్టర్ని పిలుస్తాను" అనడం, అతను వద్దని తేలిగ్గా తీసి పారేయడం దూరంనుంచి గమనించాడు ఆనందరావ్.

మారు మాట్లాడకుండా అతని స్నేహితుడు, ఫ్యామిలీ డాక్టర్ రాజారాంని తీసుకొచ్చాడు. ఆయన రెండురోజులపాటు అన్ని టెస్ట్‌లూ చేసి రిపోర్ట్స్ ఇస్తూ తటపటాయించి చెప్పక తప్పదని.

"ఆనంద్... మోహన్ నిన్ను మోసగించాడ్రా..." అన్నాడు బాధగా.

"మోసమా? ఏం చేశాడు? " కంగారుగా అడిగాడు ఆనందరావ్.

విషయం చెప్పాడు రాజారాం.

అంతే ఆనందరావ్‌కి ఎన్నడూ రానంత కోపం వచ్చింది. మంగళనూ, మోహన్‌నూ తీవ్రంగా నిందించాడు. రేఖను తీసుకుని ఇంటికి వచ్చేశాడు.

పెద్ద అల్లుళ్లిద్దరూ, "ఆస్తి చూసి బుట్టలో పడ్డారు. అందరూ మావంటి సచ్ఛీలురు కావద్దూ" అంటూ హేళన చేయడంతో ఆనందరావ్ అవమానం ఫీలయ్యాడు. తనను తాను తిట్టుకున్నాడు. బంగారం లాంటి పిల్ల జీవితం పాడవకుండా ముందే రక్షించుకున్నాం. అదృష్టం బాగుంది. మోహన్ చూపించిన వినయ విధేయతలు అంతా నాటకం అన్నమాట. దుర్మార్గుడు. పదిమందితో చెప్పి పరువు తీయాలి' అనుకున్నాడు ఆవేశంగా!

కానీ రేఖ వారించింది.

"నాన్నగారూ! ఎవరి పాపం వాళ్ళదే. మనం బయటపడ్డాం. పోనీయండి" అంది చాలా సౌమ్యంగా.

'ఇంతటి సహనశీలికి తొందరపడి, మోహన్ ఐశ్వర్యం చూసి ప్రలోభపడి పెళ్లి చేశారు. ఇకముందు చాలా జాగ్రత్తగా మంచి సంబంధం చేయాలి' అనుకున్నాడు. 'వెంటనే డైవోర్స్‌కి లాయర్‌ని సంప్రదించాలి' అనుకుని ఆ ప్రయత్నంలో పడ్డాడు.

తలుపు తట్టిన శబ్దం విన్న ఆనందరావ్ వెళ్ళి తలుపు తీశాడు.

"నమస్కారమండీ! నేను మంగళాదేవిగారి పెద్ద అబ్బాయిని నా పేరు అరుణ్" అన్నాడు, ఆ వ్యక్తి లోపలికి వస్తూ.

"ఆగు! మంగళాదేవికీ మాకూ సంబంధం

లేదు. నీతో మాట్లాడే పనీలేదు." అంటూ విసురుగా ఆనందరావ్ వెనక్కి తిరిగి లోపలికి వెళ్ళబోయాడు.

"ఒక్కమాట ఆనందరావుగారూ! అమ్మ ఆరోగ్యం బాగాలేదు. మీ అమ్మాయి రేఖని చూడాలనీ, మిమ్మల్ని క్షమాపణ కోరుకోవాలనీ అలమటించిపోతోంది. దయచేసి ఒక్కసారి మీరు అమ్మాయిని తీసుకుని మా ఇంటికి రండి" అన్నాడు అభ్యర్థనగా.

"నీకేనయ్యా చెప్పేది. నువ్వసలు మా ఇంట్లో అడుగు పెట్టాల్సిన పనిలేదు. ఎవరి ఆరోగ్యంతోనూ మాకు అవసరం లేదు. మర్యాదగా వెళ్ళు. లేదా..." అన్నాడు ఆనందరావు తెచ్చిపెట్టుకున్న సహనంతో.

"మీరు మామీద కోపం తెచ్చుకోవడం సహజమే! కానీ అపరాధభావంతో కుమిలిపోతున్న అమ్మమీద సోదర భావంతో ఆలోచించండి. రాగలిగితే ఆవిడే ఇక్కడకు వచ్చేది. పెళ్లి తరువాత జరిగిన సంఘటన ద్వారానే అమ్మకు, మోహన్ గురించి తెలిసింది. అంతవరకూ మాకా విషయం తెలియదు. అప్పట్నించీ అమ్మ దిగులుతో అనారోగ్యం పాలైంది. ఒక్క విషయం నమ్మండి. మోహన్ చేసిన తప్పు మీకెంతటి విఘాతమో మాకు అంతటి అవమానకరమైనది. జరిగిన సంఘటన మీకూ, మాకూ కూడా బాధాకరమైనదే! మానవతా దృష్టితో నా మాట మన్నించండి. మోహన్ చేసిన తప్పుకంటే వాడు మిమ్మల్ని మోసగించడం ఇంకా పెద్ద తప్పని అమ్మకు దిగులుగా వుంది. దయచేసి మా మాట మన్నించి నాతో రండి" వినయంగా, నిజాయితీగా చెప్పాడు అరుణ్. అంతవరకూ లోపల గదలోనుంచి, అరుణ్ మాటలు వింటున్న రేఖ, హాల్లోకి వచ్చింది. తండ్రివైపు చూసి చెప్పింది.

"నాన్నగారూ! వారు చెప్పింది నిజమే. జరిగిన దురదృష్టకరమైన సంఘటనకు మంగళాదేవిని బాధ్యురాల్ని చేయడం న్యాయం కాదు. ఆవిడను చూడటానికి మనం వెళ్ళడం మంచిదని అనుకుంటున్నాను"

ఆనందరావ్‌కి కూడా అరుణ్ చెప్పిన మాటలు సబబుగా తోచాయి. తనకంటే కూతురికే ఎక్కువ బాధ కలిగించే సంఘటన మోహన్‌తో జరిగిన పెళ్ళి! 'అమాయకత్వం, మంచితనం, సహనం మూర్తీభవించిన రేఖ మొదటిసారిగా తన అభిప్రాయాన్ని చెప్పింది. ఇకనుంచీ ఆమె ఇష్టప్రకారమే జరగనీ' అనుకుని రేఖను తీసుకుని అరుణ్‌తోపాటు బయలుదేరాడు.

ఆనందరావ్‌నూ, రేఖనూ చూసిన మంగళ కృతజ్ఞతాపూర్వకంగా చేయెత్తి నమస్కరించింది అనారోగ్యంతో బెడ్‌మీద నుంచి కదల్లేని స్థితిలో వున్న ఆవిడ.

"ఆనంద్‌గారూ! మా వేడికోలును మన్నించి, మా ఇంటికి వచ్చినందుకు కృతజ్ఞతలు. ఆరోజు మీరు ఆవేదనలో వున్నారు. నేను ఎంతగా ప్రాధేయపడినా వినేస్థితిలో లేరు. అది సహజం. మీరు కోలుకున్నాక మీ ఇంటికి వచ్చి క్షమాపణ కోరుకోవాలనుకున్నాను. మోహన్ చేసిన తప్పు నన్ను నిలువునా కృంగదీసింది. ఈ స్థితికి చేరుకున్నాను. ఇంతలో మీరు పంపిన లాయర్ నోటీస్ వచ్చింది.

అరుణ్ నా పెద్ద కొడుకనీ, ఆర్మీలో వున్నాడనీ, పెళ్ళికి రాలేడనీ మీకు చెప్పాను. మీరిచ్చిన లాయర్ నోటీస్ అందుకున్న తర్వాతనే అరుణ్‌కి మోహన్ గురించి చెప్పి జరిగిందంతా తెలియచేసి రమ్మని కబురు పంపితే వెంటనే బయలుదేరి వచ్చాడు. మిమ్మల్ని కలిసి మీ ఇద్దర్నీ తీసుకువస్తానంటూ మీ ఇంటికి వచ్చాడు. నాకు కొండంత బలం వచ్చినట్టుంది. మీరు క్షమించారు అదే చాలు"

అరుణ్ తన బాధ్యత పూర్తయినట్టు అక్కడ్నించి తప్పుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"అమ్మా రేఖా! ఇలా వచ్చి నా దగ్గర కూర్చో తల్లీ" అంటూ ఆదరంగా పిలిచింది మంగళ.

రేఖ లేచివచ్చి ఆవిడ దగ్గరగా కూర్చుంది.

రేఖ తలమీద చేయివేసి నిమిరి, ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకుంది. ఓపిక తెచ్చుకుని,

"ఆనంద్‌రావ్‌గారూ! మీరు నాకు సోదరుడి వరుస. అగ్నిసాక్షిగా మోహన్ తాళికట్టిన ఈ అందాల బొమ్మ ఈ ఇంటికి కోడలు! శాస్త్రప్రకారం ఈ బంధాన్ని ఎవరూ కాదనలేరు" ఒక్కక్షణం ఆగింది.

ఆనందరావ్ మండిపడ్డాడు. "నేను సోదరుణ్ణి, రేఖ ఈ ఇంటికోడలూనా... ఆ బంధాన్ని తెంచుకోవాలనే లాయర్ నోటీస్ పంపించింది" కఠోరంగా చెప్పాడు.

"నేను ఈ సుగుణరాశిని వదులుకోలేను. కోడలు అయిన తర్వాత మీరెంత కోపగించినా నామాట కాదనలేరు" అంది సౌమ్యంగా మంగళ.

ఏమిటీ ఈవిడ ఉద్దేశ్యం? మంచిమనిషి, గౌరవనీయురాలు అనీ భ్రమపడి అరుణ్‌తో బయలుదేరివచ్చా ఇలా రప్పించి, దౌర్జన్యంగా అమ్మాయిని ఇక్కడే అట్టిపెట్టేసుకోడానికి, తల్లీకొడుకులు కలసి పథకం వేసినట్టున్నారు. నమ్మివచ్చినందుకు ఈవిడ చులకన చేస్తోంది. రేఖ తొందరపడింది. నాతెలివి ఏమైందీ? ఇంత ద్రోహమా? ఆనందరావ్ నిలువునా దహించుకుపోయాడు.

చివాల్న కుర్చీలోనుంచి లేచి నిలబడి, "రేఖా లేచిరా... అయిన మర్యాదచాలు. మనం ఇక వెడదాం పద" అన్నాడు ముందుకు అడుగువేస్తూ.

"ఆనందరావుగారూ! కూర్చోండి. నా మాటలను మరో రకంగా అనుకోకండి" అంది మంగళ.

"చాలు మంగళాదేవిగారూ! మీ అంతస్తు, పరువు పదిలంగా వుండటంకోసం మాలాంటి అభాగ్యులను బలిచేయాలనుకోకండి. మీతో సమానస్థాయిగల అంతస్థు లేకపోయినా పరువు, మర్యాదలు అంతకంటే ఎక్కువే! నీతీనిజాయితీగల కుటుంబం మాది. ఐశ్వర్యంగల మీరు ఏంచేసినా చెల్లుతుందనీ, పేదవారైతే ఒదిగి వుంటారనీ అనుకోకండి. మీ అబ్బాయేకాదు, మీరు కూడా నయవంచకులే అని తెలిసివచ్చింది. మనిషిని తోటిమనిషే నమ్మకూడని రోజులని మరచి, వచ్చినందుకు తగినశాస్తి చేశారు. ఇంకా మీకు మర్యాద అంటూ వుంటే లాయర్ నోటీస్ ప్రకారం డైవోర్స్ ఇవ్వండి. లేదంటే మేము చేయగల పని చేస్తాం" అన్నాడు ఆనందరావ్ మొహమంతా ఎర్రగా చేసుకుని.

రేఖ మెల్లిగా మంగళ దగ్గరనుంచి లేచి నిలబడి, తండ్రిని అనుసరించింది.

"రేఖా! ఆగమ్మా, నువ్వైనా శాంతంగా నామాట విను. నేను నయవంచకురాల్ని కాదు. నాభోగభాగ్యాలు చూసుకుని ఏనాడూ గర్వపడలేదు. అసలు నాకా విషయమే గుర్తు వుండదు. నువ్వు వివేకవంతురాలివి, గుణవంతురాలివి తల్లీ. అమాయకురాలివికానేకాదు. అదంతా నీమంచితనం. అందుకే నావంశ ప్రతిష్ట నీవల్లనే నిలబెట్టుకోవాలనే ఆశతో, నా కోడలివే అంటున్నాను. మోహన్‌కి భార్యగాకాదు... చెబుతాను వినండి, ఆనంద్‌రావ్‌గారూ! మీరు నన్నింకా అర్థంచేసుకోలేదు. మీ గాయం మానలేదు. అందుకే అపార్థంచేసుకుంటున్నారు" అంటూ అతికష్టంమీద బెడ్‌మీదనుంచి లేచి, గోడ ఆధారంగా అడుగులువేస్తూ వచ్చి ఆనందరావ్ రెండుచేతులూ పట్టుకుని, ప్రాధేయపూర్వకంగా చెప్పింది. నీరసంగా వున్న ఆవిడ అడుగులు తడబడి, తూలిపడబోతూంటే, ఆనందరావ్, రేఖా చప్పునవచ్చి చెరోవైపు పట్టుకున్నారు. జాగ్రత్తగా తీసుకువచ్చి అక్కడే వీల్ ఛైర్‌లో కూర్చోబెట్టారు.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.





ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.




శ్రీచంద్ర..






# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ చతుర నవల **ఇలా ఎందరో?**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

రేఖ ఆవిడ దగ్గరే కూర్చుని గ్లాస్‌లోవున్న పళ్ళరసం తాగించింది. నుదుట పట్టిన చమటను తుడిచి సేదదీర్చింది. ఆనంద రావ్ ఆవిడ పరిస్థితి చూసి, 'తొందరపడి అనవసరంగా తీవ్రంగా మాట్లాడాను. మాదారిన మేము వెళ్లడం మంచిది. అన్నీ కోర్ట్ ద్వారానే తేల్చుకోవచ్చు' అనుకున్నాడు.

"ఒక్క నిముషం కూర్చుని, నామాట వినండి ఆనంద్‌రావ్‌గారూ! అరుణ్ నా పెద్ద కొడుకు. వాడికి చిన్నప్పట్నించీ ఆర్మీలో చేరాలని కోరిక. వాళ్ళ నాన్నగారికి ఇష్టంలేకుంటే చెప్పకుండా వెళ్ళిపోయాడు. వెళ్ళి చేరిన తర్వాత నచ్చచెప్పాడు. అరుణ్ నాన్నగారికి వాడంటే చెప్పలేనంత అభి మానం. వాడు దూరం అయితే తట్టుకోలేక పోయారు. అయినా దేశసేవ తన కర్త వ్యంగా భావించిన అరుణ్, తండ్రిప్రేమనే వదులుకున్నాడు. ఆ బెంగతో వారు మర ణించారు. నిజానికి అరుణ్, మోహన్ కవ లలు. ముందు జన్మించినవాడు అరుణ్. అందుకే పెద్ద కొడుకు అన్నాను. కవలలైనా, ఇద్దరివీ వేరువేరు స్వభావాలు. అరుణ్, రేఖకు తగినవాడు. బుద్ధిమంతుడు, సౌమ్యుడు. మోహన్‌లో దుడుకుతనం ఎక్కువ. ఆ అల్లరే అమ్మాయిలతో స్నేహా నికి కారణం అయిందని తెలుసుకోలేకపో యాను. తండ్రిలేనివాడని గారంచేశాను. అరుణ్ దూరంగా వుండటంతో మరింతగా అభిమానం పెంచుకున్నాను. మోహన్ దుడుకుతనాన్ని గ్రహించుకోలేకపోయాను. అదే వాడి స్వేచ్ఛాజీవితానికి అవకాశం ఇచ్చిందేమో! వాడ్ని బాగుచేయలేనంత నీచ స్థాయికి దిగజారిపోయాడని తెలిశాక, ఏమీ ఎరుగని రేఖను బలిచేస్తానా చెప్పండి. లేదు, నేను మోహన్ని క్షమించను. అందుకు వాడికి తగిన శిక్షగా, డైవోర్స్ ఇప్పించి, అరుణ్ భార్యగా, నా కోడలి స్థానాన్ని నిలు పుకుంటానని 'రేఖ ఈ ఇంటికోడలని' చెప్పాను. మీ ఇద్దరికీ అంగీకారమో, కాదో చెప్పండి. అదీ బాగా ఆలోచించుకునే చెప్పండి" అంది మంగళ అలసటగా.

అనుకోని మంగళ ప్రతిపాదనకు తండ్రీ కూతుళ్ళిద్దరూ తెల్లబోయారు. మంగళ డ్రైవర్ని పిలిచి ఆనందరావ్, రేఖలను ఇంటి దగ్గర దిగవిడిచి రమ్మని చెప్పి, ఇక మాట్లా డలేనట్టు కళ్ళు మూసుకుని పడుకుంది. ఆనందరావు, రేఖా ఇంటికి వచ్చారు. మంగ ళాదేవి కోరిక గురించి పదేపదే తర్జనభర్జన లుచేశారు.

"రేఖా! మంగళాదేవి ఈ రకంగా కోరు తుందని అనుకోలేదు. ఆ కోరిక ఉన్నతమై నదే! నువ్వు ఏమంటావమ్మా?"

"ఆలోచిద్దాం నాన్నగారూ! సమంజ సమా? అసమంజసమా? అనికాదు, అరుణ్ తల్లిగారికోసం అంగీకారం తెలుపవ చ్చేమోకానీ, మోహన్ అంత సులువుగా డైవోర్స్‌కి ఒప్పుకుంటాడా? అరుణ్ తల్లి బల వంతం కారణంగా ఈ పెళ్ళికి సిద్ధమవు తాడా? అనేది తెలియాలి" అంది రేఖ.

"నిజమే తల్లీ! అందుకే మంగళాదేవితో ఇదేవిషయం చెబుదాం. తనమాట నిలబె ట్టడం అవసరార్థం కాకుండా, మనసారా ఇష్టపడినప్పుడే ఈ పెళ్ళి జరగాలని" అన్నాడు కూతురి మాటను బలపరుస్తూ ఆనందరావ్.

రోజులు గడుస్తున్నాయి. రేఖ మామూ లుగా ఉద్యోగానికి వెడుతోంది. మోహన్‌తో జరిగిన పెళ్ళి విఫలమవడం గురించి రేఖ ఆలోచించడమేలేదు. ఒక ప్రమాదం తప్పింది అనుకుంది. అరుణ్ భార్య కావాలా? లేక ఆ కుటుంబానికి దూరంగా వుండటానికి సిద్ధపడి తెగతెంపులు చేసుకో వాలా? అనేది మాత్రం ఆలోచిస్తోంది.

మోహన్ మాట ఇచ్చిన ప్రకారం, అన్న య్యకి పెళ్ళి జరగకముందే ఉద్యోగం వేయించాడు. బహుశా అతడి గురించి నమ్మకం కలగటానికి అయివుండచ్చు. తెగ తెంపులు చేసుకుంటే అన్నయ్య ఉద్యోగం

పోవచ్చు. అరుణ్‌ని పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకుంటే అలా జరగదు. ఇక బంధువులె వరికీ పెళ్ళిగురించి తెలియదు. తెలిసిన వాళ్ళు సహకరించేవారే! ఇక అరుణ్ ఇష్ట పడి చేసుకుంటాడా? తల్లికోసం చేసుకోవా లనుకుంటాడా అని తెలియదు. తెలియా లంటే అతడితో కొన్నాళ్ళు కలసి మెలసి వుండాలి. లేదా అవన్నీ మంగళగారే చూసుకుంటారని అంగీకారం తెలియచే యాలి.

ఆనందరావ్ అనుకునేది ఏమిటంటే అరుణ్ మంచివాడిగా కనిపించాడు. అత నికి తల్లి అంటే గౌరవం, అభిమానం వున్నాయ్. ఆవిడ ఆరోగ్యం కోసం తల్లడిల్లి ఏమైనా చేయడానికి సిద్ధంగా వున్నాడు. నిజానికి రేఖకి తగిన సంబంధం చూడటం కష్టమే. అలా అని నా స్వార్థం కోసం పెళ్ళిచేయ



కుండా వుండటమూ చేయలేను. ఎవరు ఎలాటివారో తెలీదు. రేఖలాటి మనస్తత్వం గలవారికి, తగిన వ్యక్తి లభించడమూ కష్టమే. ఇప్పుడు అటువంటి సమస్య లేకుండా అరుణ్‌తో పెళ్ళి జరిపిస్తానని మంగళే అడుగుతోంది. ఇక సందేహించాల్సిన అవసరంలేదు. అలా అని, రేఖ ఇష్టానికి వ్యతిరేకంగా చేయను.

మంగళ ఇంటినుంచి రేఖ వచ్చేముందు ఆవిడ కూడా ఒకమాట చెప్పింది. మోహన్‌ని ఇప్పుడు ట్రీట్‌మెంట్‌కోసం హాస్పిటల్లో వుంచారు. కాబట్టి, అరుణ్‌తో సన్నిహితంగా వుండి, పరస్పరం అభిప్రాయాలు తెలుసుకుంటే, వాళ్ళిద్దరూ ఒక అవగాహనకు రావచ్చు కనుక తరచుగా రేఖను ఇంటికి రమ్మని!

అది సబబుగానే తోచింది ఆనందరావుకి కూడా! రేఖ అప్పుడప్పుడు మంగళాదేవి ఇంటికి వెడుతూంది. అరుణ్, రేఖల మధ్య చనువు ఏర్పడింది. అయితే అసలు సమస్య మోహన్ డైవోర్స్ ఇవ్వటానికి అంగీకరించక పోవడం! మంగళ ఈ విషయం గురించి చెప్పగానే, విరుచుకు పడ్డాడు.

"అమ్మా! నేను రేఖను ఏరికోరి పెళ్ళిచేసుకున్నాను. డైవోర్స్ ఎలా ఇవ్వగలను?" అన్నాడు.

"ఇచ్చి తీరాలి. నువ్వు చేసినపని చాలా దారుణమైనది. అందుకు రేఖను బాధించడం న్యాయంకాదు.

మోహన్ నాన్నగారులేరు. అన్నయ్య దూరంగా ఉన్నాడు. నువ్వొక్కడ బాధపడతావో అని, నీకు నచ్చినట్టు వుండటానికి అంగీకరించాను. ఫారిన్‌లో చదువన్నావ్ పంపించాను. దేశమంతా తిరగాలని వుందంటే సరే అన్నాను. ఫ్రెండ్స్, సరదాలూ అంటూ ఇల్లు పట్టకపోతే, ఆ బాధనూ ఓర్చుకున్నాను. చివరికి మనసు కుదిరి ఇండియావచ్చి ఉద్యోగంలో చేరినప్పుడు సంతోషించాను. ఇక ఇంటిపట్టున వుండి, బాధ్యతగా మసలుకుంటావనుకున్నాను. రేఖను ఇష్టపడుతున్నానంటూ, ఆనందరావ్‌గార్ని ఒప్పించి, పెళ్ళిచేసుకుంటానని చెప్పినప్పుడు, రేఖలాటి అమ్మాయి కోడలుగా రాబోతోందని మురిసిపోయాను. ఆ మురిపెం మూడురోజులే అనీ, శాశ్వతంకాదనీ తెలిసినప్పుడు నేను పడిన ఆవేదనా, అవమానం నీకు తెలియదు మోహన్.

చేయిజారిపోయిన నిన్ను ఇక బాగుచేయలేను. కానీ రేఖకు న్యాయం చేయగలను. అందుకు మనసు సంబాళించుకున్నాను. నా కర్తవ్యం ఏమిటో తెలుసుకున్నాను. ఇప్పుడు నువ్వు రేఖకు విడాకులు ఇవ్వక తప్పదు" అంది మంగళ కఠినంగా.

కొంతసేపు ఆలోచించిన మోహన్ "అమ్మా! నా విచ్చలవిడితనానికి ప్రతిఫలం తెలిసివచ్చింది. ఇప్పుడు నా తప్పు దిద్దుకోలేనిదే! నాకు నచ్చిన రేఖను పెళ్ళంటే చేసుకున్నానుకానీ, ఆమెతో జీవితాన్ని పంచుకోలేకపోయాను. తప్పు నాదైతే శిక్ష రేఖకు వేయడం న్యాయంకాదు. నిజమే! ఈ జన్మకు ఇంతే! ఇకనైనా మంచిపన్లు చేస్తాను. అనాథలను ఆదుకుంటాను. వికలాంగులకు ఆశ్రయం ఇస్తాను. నావంటి నిర్భాగ్యులకు చేదోడుగా నిలబడతాను. ఇక మీదట నీకు ఎటువంటి వేదనా కలుగనీయను. నీమాట జవదాటను. నీ ఆనందం కోసం ఏమైనా చేస్తాను" అంటూ పశ్చాత్తాపంతో మంగళ చెప్పినట్టే డైవోర్స్ పేపర్ మీద సైన్‌చేశాడు. ఉద్యోగానికి రాజీనామా చేసి అతను కోరుకున్న చోటుకి వెళ్ళిపోయాడు. వెళ్లేముందు మంగళ ఎప్పుడు చూడాలనిపిస్తే అప్పుడే వస్తానని మాట ఇచ్చాడు. ఎంతటి వ్యసనపరుడైనా కన్నకొడుకే. ఐశ్వర్యం ఎంతవున్నా నలుగురు పిల్లలు అనుభవించడానికి లేకపోయాక ఆ ఆవేదనకు అంతువుండదు. మోహన్ నిర్ణయం బాధాకరమే అయినా, ఒక నిర్ణ

యానికి కట్టుబడిన మంగళ మనసు రాయి చేసుకుంది. మనసులోమాట మోహన్‌తో చెప్పలేదు.

"అరుణ్! జరిగిందంతా తెలుసుకున్నావ్ కదా? రేఖ నాకు చాలా నచ్చింది. మోహన్‌తో పెళ్ళి, ఆ వెంటనే విడాకులూ జరిగిన తర్వాత, ఆ అమ్మాయికి మరో పెళ్ళి అవ్వచ్చు కాకపోవచ్చు ఆ అమ్మాయి దారిన ఆ అమ్మాయిని వదిలేసి, మనం తప్పుకోవచ్చు పరిహారంగా మన ఆస్తిలో సగం వాటా ఇవ్వచ్చు కానీ నిండుజీవితాన్ని ఇవ్వలేం. ఆ అమ్మాయిమీద పడిన 'వివాహిత, డైవోర్సీ' అనే ముద్ర చెరిగిపోదు. అందుకే నీకు ఇష్టం అయితే, రేఖను చిన్న కోడలి స్థానంనుంచి, పెద్దకోడలి స్థానానికి మార్చి మన ఇంట్లోనే పదిలపరుచుకోవాలనీ, కొంతవరకూ వారికి జరిగిన అవమానాన్ని తుడిచివేయాలనీ నిర్ణయించుకున్నాను. నీ అభిప్రాయం చెప్పు బాబూ"

తల్లి రేఖను తీసుకురమ్మని పంపించినప్పుడే అరుణ్, ఆమె ఆలోచన గ్రహించాడు. అది న్యాయంగానూ తోచింది. "అమ్మా, నువ్వు ఏ నిర్ణయం తీసుకున్నా, మా బాగు కోరి, మన కుటుంబ శ్రేయస్సుకోరీ, ఒక అమ్మాయి జీవితాన్ని నిలబెట్టాలనేకదా? అందుకు నేను తప్పక నావంతు సహకరిస్తాను. నేను ఆర్మీలో చేరిన తర్వాత అసలు పెళ్ళిచేసుకోరాదని అనుకున్నాను. కానీ రేఖను చూసిన తర్వాత నా నిర్ణయం మారింది. నేను కోరుకున్నదే, నువ్వు కోరుకున్నావ్. అయితే రేఖ ఇందుకు సమ్మతిస్తుందా? తెలుసుకోవాలంటే రేఖతో కొద్దికాలం సన్నిహితంగా మెలగాలి. మనస్ఫూర్తిగా ఆమె అంగీకరిస్తేనే పెళ్ళి అవుతుంది" అన్నాడు తన మనసులోమాట చెబుతూ అరుణ్.

"ఆ ఏర్పాటుచేశాను అరుణ్. రేఖ మన ఇంటికి వస్తుందనే నా ఆశ. ఆపైన కాలమే నిర్ణయిస్తుంది" అంది మంగళ నిశ్చింతగా.

మంగళ ప్రతిపాదన విన్న తర్వాత అటు రేఖా, ఇటు అరుణ్ కూడా అనుకోకుండా పరస్పరాకర్షణతోనే, ఇష్టపడి, ఒకరినొకరు నచ్చినందువల్లనే మంగళమాటకు అంగీకారం తెలియచేశారు.

రేఖ ఇంట్లో అడుగుపెట్టిన విశేషమో, తప్పు దిద్దుకోగలిగాననే సంతృప్తివల్లనో, రేఖ ఆదరణ, ఆప్యాయత వల్లనో, మంగళ ఆరోగ్యం క్రమంగా బాగుపడింది. అరుణ్ యధాప్రకారం శెలవుపూర్తి అయిన తర్వాత డ్యూటీకి వెళ్ళిపోయాడు.

రోజులు గడిచిపోతున్నాయి. మోహన్ ఫోన్ చేయడం, అప్పుడప్పుడు ఉత్తరం రాయడం చేస్తున్నాడు. మంగళ రేఖకు సాయంగా ఒక అనాధ అయిన అమ్మాయికి ఆశ్రయం ఇచ్చింది. పేరుకి ఆశ్రయమే కాని, 'కేర్ టేకర్' అని చెప్పాలి. స్థిరాస్థి, చరాస్తుల వ్యవహారాలు, మంగళకు పిఏగా అన్నీ చూసుకుంటుంది. మంగళకు ఇప్పుడు చాలా ఆనందంగా వుంది.

ఆరోజు ఎందుకో మంగళమనసు ఆందోళనగా ఉంది. అందుక్కారణం మోహన్ వస్తున్నానని ఫోన్ చేయడమే. కన్నకొడుకు, గారాలబిడ్డ వస్తున్నాడంటే మాతృమూర్తికి కలిగే ఆనందం వర్ణనాతీతమైనది. అందరికీ... కానీ మంగళ మాత్రం ఏ భయంకరమైన దృశ్యాన్ని చూడాల్సి వస్తుందో, ఈ సంఘటన ఎదుర్కోవడం ఎలా అనే వ్యాకులపడుతోంది. అంతలోనే, 'ఎప్పటికైనా ఈ పరిస్థితి ఎదుర్కోవాలి తప్పదు. అదేదో త్వరగా జరిగిపోనీ. అది కష్టమే కావచ్చు వ్యధాభరితమే కావచ్చు" అని సిద్ధపడింది.

మోహన్ వచ్చాడు. ఇంటి వాతావరణంలో మార్పు కనబడింది. "ఏమిటమ్మా ఇది? ఎప్పుడూ లేనిది ఇంటికి కొత్తగా కళాకాంతులు వచ్చాయే" అన్నాడు పరిశీలనగా చూస్తూ.

"అవును మోహన్. నేను ఒంటరిగా వుండాలి కదా, అదీకాక ఇంటి విషయాలు

# ఏరిన ముత్యాలు

* చనిపోయిన తరువాత గానీ కీర్తి రాదు. అందుకే నేను కీర్తి కోసం తొందరపడటం లేదు.

– మార్టిల్

* అలసిపోయి ఏదో పుస్తకం చదవాలనుకున్న వాడికి, ఉత్సాహంతో పుస్తకం చదవాలనుకున్న వాడికి మధ్య తేడా ఎంతో ఉంది.

– జి.కె.చెస్టర్‌టన్

* వివిధ మతాలు ఒకే గమ్యాన్ని చేర్చే వివిధ మార్గాలు. ఒకే గమ్యాన్ని చేరుతున్నప్పుడు ఏ మార్గం అవలంబించినా ఒకటే.

– మహాత్మాగాంధీ

* జీవితంలో రెండే రెండు పోల్చడానికి వీలు లేని అమూల్యమైన ఫలాలు ఉన్నాయి. ఒకటి మంచి పుస్తకాలు, రెండవది ఉత్తమ స్నేహితులు.

– సుభాషితం

* ఉన్నతంగా ఆలోచించే వారికెన్నడూ ఒంటరితనం ఉండదు. వారి ఆలోచనలే వారికి నేస్తాలు, మిత్రులు.

– సి.సిడ్నీ

* అన్ని మతాలు దేవుణ్ణి దర్శించు అనే చెబుతాయి. ఆచరించటంలోనే వస్తుంది చిక్కు.

– వివేకానంద

* మన బాధ్యతలను మాటిమాటికి గుర్తుచేసేవే మన కష్టాలు.

– ఒక సామెత

* కష్టమో, సుఖమో స్వభావం మీదే ఆధారపడి ఉంటుంది. కానీ పరిస్థితుల మీద కాదు.

– మార్థా వాషింగ్‌టన్

* ఆధ్యాత్మికంగా ఉండటం హేతు నిరాకరణ కాదు. హేతువును మించి ఉండటం.

– సర్వేపల్లి రాధాకృష్ణ

* విశ్వాసం లేని ప్రయత్నం అడుగు లేని అఖాతం చేరడం వంటిది.

– మహాత్మా గాంధీ

* మానవుని మెదడు గొప్పది. పుట్టినప్పటి నుంచి విరామం లేకుండా పనిచేస్తూ ఉంటుంది. ఒక్క క్షణం గూడా ఆగదు- ఉపన్యాసం ఇచ్చేందుకు, వేదిక ఎక్కినప్పుడు తప్ప.

– హాఫ్‌మన్

సేకరణ: ఎ.ఎస్. ఎల్. మనోజ్ఞ

చూసుకోడానికి నాకు పూర్వంలా జ్ఞాపకం వుండటంలేదు. అందుకని, మన దూరపు బంధువుల అమ్మాయిని పిలిపించాను. ఆ ప్రభావమే ఇది. ఇప్పుడు నిశ్చింతగా వుంది నాకు" అంటూ చెప్పింది మంగళ.

భోజనాల దగ్గిర వడ్డనకు వచ్చిన రేఖను చూసిన మోహన్ ప్రాన్పడిపోయాడు. "అమ్మా రేఖ మనింట్లో వుందేమిటీ? " ఆత్రంగా అడిగాడు.

"అవును. ఈ ఇంటికోడలు మన ఇంట్లో వుండక మరెక్కడ వుంటుందీ? " తాపీగా చెప్పింది మంగళ.

"అంటే... రేఖా నువ్వు డైవోర్స్‌కి అంగీకరించలేదా? " సమాధానం చెప్పదని తెలిసి కూడా, రేఖను అడిగాడు మోహన్.

"నీతో పెళ్ళికి డైవోర్స్ అయ్యాయి. కానీ... అరుణ్‌తో పెళ్ళి అయినందువలన మన ఇంట్లోనే వుంది" చెప్పింది మంగళ.

అంతే మోహన్‌లోని సౌమ్యత అంతా నశించిపోయింది. డైనింగ్ టేబుల్ మీద వస్తువులన్నీ విసిరికొట్టాడు. పిచ్చిపట్టినట్టుగా "ద్రోహం, దగా, మోసం. అమ్మవేనా నువ్వు? అన్నయ్య ఎలా అంగీకరించాడు? నా లైఫ్‌ని కొల్లగొట్టాడు. ఎవరు? ఎవరు చేశారీపని? " పెద్ద గొంతుతో అరిచాడు.

రేఖ తన గదిలోకి పారిపోయింది. పనివాడు హరి, బలవంతాన, మోహన్ పెడరెక్కలు విరిచి పట్టుకున్నాడు.

నోటికొచ్చినట్లు తిట్టి, అరిచి, గోలచేసి, ఆ ఉధృతం తగ్గాక, పసివాడిలా హృదయవిదారకంగా ఏడవసాగాడు మోహన్.

చెట్టంత కొడుకు, గారాల మోహన్ అలా ఏడుస్తుంటే మంగళ కరిగిపోయింది. అయినా గుండె దిటవుపరచుకుని, దుఃఖాన్ని దిగమింగి, "మోహన్, ఓర్చుకో బాబూ! నాకు తెలుసు. నేను చేసిన ఈ నిర్ణయం నీకు అంతులేని బాధ కలిగిస్తుందని. కానీ ఒక్కక్షణం విజ్ఞతతో ఆలోచించు. నువ్వు రేఖని ప్రేమించావ్. జీవిత సహచరిగా ఆహ్వానించావ్. కానీ దురదృష్టం ఆమె నీకు భార్య కాలేకపోయింది. నువ్వు చేసిన తప్పుకి, ఆ అమాయకురాలు శిక్ష అనుభవించడం న్యాయమా బాబూ? కాదుకదా? అందుకే, నేను అరుణ్‌తో రేఖ పెళ్ళి జరిపించాను. కోడలుగా శాస్త్రప్రకారం మన ఇంటికి రావల్సిన రేఖ, కోడలిగానే వచ్చింది బాబూ! అయితే మార్పు పెద్దకోడలిగా. నాకు తెలుసు, నీ మనసు ఎంత గాయపడుతుందో... అయినా సిద్ధపడ్డాను. ఇందువలన పరువు, ప్రతిష్టలూ రేఖజీవితం బాగుపడతాయి అనే కారణంగా. ఇందులో మోసం, ద్రోహం అనేవంటూ వుంటే అది నా తప్పే అవుతుంది. అన్నయ్యగానీ, రేఖ కానీ బాధ్యులుకారు. నన్ను క్షమించు నాన్నా! నీకు కష్టం కలిగించాను" అంది మంగళ దేనికైనా సిద్ధం అన్నట్టు.

మోహన్ చివాలునలేచి, వచ్చినవాడు వచ్చినట్టే కారు తీసుకుని డ్రైవ్ చేసుకుంటూ బైటకు వెళ్ళిపోయాడు. ఒకరోజు బాగా డ్రింక్‌చేసి వచ్చాడు. రేఖనుచూసి ఓసారి హృదయవిదారకంగా ఏడవటం, మరోసారి తల్లినీ, అన్ననూ తిట్టడం, తనుతాను తిట్టుకోవడం చేసేవాడు. అంతలోనే తలుపులు మూసుకుని మర్నాటివరకూ నిద్రపోయేవాడు. మంగళ డాక్టర్‌ని పిలిపించింది. ట్రీట్‌మెంట్ వలన మైల్డ్‌గా తయారయ్యాడు. ఒకసారి తల్లి పాదాలమీదపడి, "అమ్మా, నన్ను ప్రాణంగా పెంచావు. అడిగింది ఇచ్చావు. అందుకే నా జీవితాన్ని చేజేతులా పాడుచేసుకున్నాను. అలాకాక, వద్దనీ, ఇవ్వననీ దండించి వుంటే రేఖ నాకు దక్కేదికదూ? " అని పసిపిల్లాడిలా అనేవాడు.

మరోసారి, "అమ్మా! నువ్వు దేవతవి. నేనే నీకు ఎన్నో తలవంపులు తెచ్చాను. అమ్మా, అమ్మాయిల పొందులోనే స్వర్గం అనుకొని మోసపోయాను. వాళ్ళెవరూ ఒక్క రేఖకి సరిపోలరని గ్రహించలేకపోయాను.

"బంగారంలాంటి ఈ జీవితాన్ని పాడుచే

సుకున్నాను. ఎవరో కారకులు కారమ్మా! నేనే! చదువుకుని ప్రయోజకుణ్ణి కావల్సిన వాణ్ణి. భ్రష్టుడ్ని అయిపోయానమ్మా!" అనే వాడు.

తెలివివుంటే అలా! లేకుంటే నిద్రపోవడం. కొన్నాళ్లు రేఖను పుట్టింటికి పంపింది మంగళ. అయినా ఏం లాభం? ఆమె కనిపించనంత మాత్రాన ఆమె రూపం, యదార్థం మోహన్ మనసులోనే నిల్చిపోయింది. అదెవరూ తుడిచిపెట్టలేరు.

మంగళకు మళ్లీ మనోవ్యాధి పట్టుకుంది. ఒక బిడ్డ జీవితం బాగుచేస్తే మరో బిడ్డ జీవితం చేజారిపోయింది. ఏం చేయాలో? నేను చేసిన సాహసం ఈ రకంగా పరిణమిస్తుందని అనుకోలేదు. ఇప్పుడిక చేయగలిగిందీలేదు అనుకుంది. మంగళ బాధ చూడలేక చివరికి రేఖ స్వయంగా మోహన్‌కి నచ్చచెప్పాలనుకుంది.

"మోహన్, మీ జీవితంలో ప్రవేశించడానికి నేను ఎంతవరకూ కారకురాలినో నాకు తెలియదు. జరగాల్సినవి కొన్ని ఎవరి ప్రమేయమూ లేకుండానే జరిగిపోతాయి. మీకు అన్నీ వున్నాయి. నాలాటి అమ్మాయికోసం ఎందుకిలా అయిపోతున్నారు? మీ మనసుకు కావలసింది కాస్తంత ఓదార్పు. మనశ్శాంతి! ఆహ్లాదపరిచే వాతావరణం. మీకు భార్యని కాకపోతేనేం ఒక సోదరిగా భావించండి. మీ కుటుంబ సభ్యురాలిగానే చూడండి"

మనిషిరూపం కళ్లు తెరచి చూసినప్పుడే భ్రమలు గొల్పుతుంది. కళ్లు మూసినప్పుడు ఎవరైనా ఒక్కటే. మీ మనోనేత్రాన్ని తెరచి ఆలోచించండి. కొంతకాలం స్త్రీల పొందు చవిచూశారు. అంతటితో ఆ అనుభవానికి తృప్తిచెంది ఇప్పుడు నిగ్రహంతో వుండండి. అన్నీ బాగుంటే మీరీ పరిస్థితికి దిగజారిపోయేవారా? జరగరానిది జరిగిపోయింది. మన జీవితాలను మనం శాసించుకోలేం. పరిస్థితులనుబట్టి ఒదిగి వుండాలి. అరుణ్ ఎవరు? మీతోబాటు ఏకకాలంలో పేగుతెంచుకు పుట్టిన సోదరుడు. ఆయనను ద్వేషించడం మంచిదా? మంగళాదేవి దేవతలాటి అమ్మ మీకు. ఆవిడ సంతోషాన్ని కోరుకోండి. మీకు ఇష్టమైన అమ్మాయిని వివాహం చేసుకోండి. ఆ అమ్మాయి సాహచర్యం మీకు మనశ్శాంతినిస్తుంది. అంతేకాని మీరు బాధపడి, ఇంట్లో వారిని బాధపెట్టి బతుకు నాశనం చేసుకోకండి. దయచేసి నా మాట మన్నించండి" పట్టుమని నాలుగు మాటలు మాట్లాడని రేఖ తనకు తెలియకుండానే హితవు చెప్పింది.

మర్నాడు అతని రూమ్‌లో ఒక ఉత్తరం కనబడింది. తానేదో ఆశ్రమానికి వెడుతున్నానని, తనకోసం చూడవద్దని క్లుప్తంగా రెండే వాక్యాలున్నాయి. ఆ తర్వాత కొన్నాళ్లపాటు మోహన్ గురించి తెలియలేదు. రేఖకు ఇప్పుడు ఇద్దరమ్మాయిలు. మళ్లీ కవలలు. వంశంలో ఈ కవలల వారసత్వం వుందేమో అనుకుంది మంగళ.

ఆడపిల్లలు, పూజా, రోజాలు ముద్దబంతుల్లా ముచ్చటగా ఉన్నారు. మంగళకు వాళ్లతో కాలమే తెలియడంలేదు. వాళ్ల ఆటపాటలతో, చిలిపి చేష్టలతో మురిసిపోతుంది.

అరుణ్, రేఖలు పిల్లల్ని మంగళ దగ్గర వదిలి జాలీట్రిప్‌కి వెడుతుంటారు. మళ్లీ రోజులు సుఖంగా గడిచిపోతున్నాయ్.

మోహన్ గురించి మంగళ ఆలోచించదు. ఆలోచించి ప్రయోజనమూ లేదు. అతను వచ్చి బాధపడటం, ఇంట్లో నరకం సృష్టించడం తప్ప సంతోషంగా ఉన్నదేది?

కానీ ఇంటిమీద గాలి మళ్లినప్పుడల్లా మోహన్ హఠాత్తుగా వచ్చేస్తుంటాడు. ఆ రోజు కబురు లేకుండా వచ్చాడు. అరుణ్, రేఖా లేరు. రోజా, పూజాలను మొదటిసారి చూశాడు. పసివాళ్లను చూసి వాళ్లతో కాసేపు ఆడుకుంటూంటే హమ్మయ్య అనుకుంది మంగళ మార్పు వచ్చిందని. కాని మర్నాడు బాత్‌టబ్‌లో ఎత్తునుంచి

బొమ్మల్లా పడేసి పైశాచికానందంతో నవ్వుతూంటే అదిరిపడిన మంగళ మళ్లీ వాళ్లను అతని కంట పడనీయలేదు. మోహన్ హిస్టీరికల్‌గా తయారయ్యాడు. ఏ క్షణానికి ఏ రకంగా వుంటాడో నమ్మకూడదని తెలుసుకుంది.

వీడు మధ్యలో వచ్చి ఇలా కలవరం కలిగిస్తాడు. రాకుండా వుంటేనే నయం అనుకుంది. కన్నతల్లినే! కానీ ఏం చేయనూ? ఇలాటి బాధ ఎవరికీ రాకూడదు అనుకునేది.

ఈసారి మోహన్ తరచుగా వస్తున్నాడు. రేఖ అతని కంటపడక తప్పటంలేదు. అయితే ఇదివరకులా మాడ్‌లా ప్రవర్తించడంలేదు. మామూలుగా వుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. టైమ్‌కి వచ్చి భోజనం చేయడం, బయటకువెళ్లి సాయంకాలం రావడం, భోజనం చేసి నిద్రపోడం, అంతా బాగానే గడిచిపోతోంది.

"ఈ మార్పులేమిటి డాక్టర్? మోహన్ మామూలు మనిషి అవుతాడో, లేదో తెలియడంలేదు" అడిగింది మంగళ, డాక్టర్‌గార్ని.

ఈ మార్పు మంచికేనమ్మా! అయితే ఈ మార్పు శాశ్వతంగా వుండిపోవచ్చు. మంచైనా, చెడైనా భరించక తప్పదు. ఎయిడ్స్ వ్యాధితో బాటు మానసికమైన ఆందోళన కారణంగా, రకరకాల భావాలు అతడ్ని లొంగదీసుకున్నాయి. ఏ ఒక్క వ్యాధికి మందులు వాడినా, రెండవ వ్యాధి విజృంభిస్తుంది. వీటితోబాటు సైడ్ ఎఫెక్ట్స్ కూడా దాపురించాయి. ఏం చేయగలం? వ్యాధులకు అనుగుణంగా మందులు వాడటం తప్పితే" అన్నారాయన.

రేఖ తన జాగ్రత్తలో తనుంది. రాత్రి పిల్లలిద్దరూ మంగళ దగ్గర నిద్రపోతారు. పక్కన ఆయా కనిపెట్టి వుంటుంది. అయినా మధ్యలో లేచి వచ్చి చూసి వెడుతుంటుంది రేఖ. మంగళ పక్క రూమ్‌లోనే పడుకుంటుంది రేఖ. అరుణ్ వచ్చినప్పుడు మేడమీద పడగ్గది వుపయోగిస్తారు. అతను లేనప్పుడు లాక్ చేసి వుంటుంది.

మోహన్ బెడ్‌రూమ్ ఎవరికీ సంబంధం లేనిచోట వేరేగా వుంటుంది. అలవాటుగా రేఖ మంగళ గదిలో పిల్లల్ని చూసి -తిరిగి తన రూమ్‌లోకి వచ్చేసరికి బెడ్‌మీద మోహన్ కనిపించి అదిరిపడిన రేఖ వేగంగా వెనక్కి తిరిగి వెళ్లబోయింది.

"ప్లీజ్ రేఖా ఆగు నీతో మాట్లాడాలి" అన్నాడు మోహన్ దీనంగా. "ఏం మాట్లాడతారు? ఇంత అర్ధరాత్రి? పగలు మాట్లాడుకోవచ్చు" అంది భయంగా.

"పగలు వీలవదు రేఖా. ఇప్పుడు మాట్లాడాలి. రేఖా నీకూ ఈ ఇంటికీ చాలా దూరంగా వుండాలని ప్రయత్నించినా నాకు సాధ్యం కావడంలేదు. అందుకే వస్తున్నాను. నీకు బాధ కలిగిస్తున్నానా? " చాలా దీనంగా వున్నాయి అతడి మాటలు.

"ఈ ఇల్లు మీది. రావడానికి ఎప్పుడూ స్వాతంత్రం వుంటుంది"

"నిజమా రేఖా? వప్పుకుంటావుగా. అయితే నా భార్యతో సంతోషంగా గడిపే స్వాతంత్రం కూడా వున్నట్టేకదా? అందుకే వచ్చాను. నీకోసమే ఎదురు చూస్తున్నాను" మోహన్ మాటల్లోని తమకం అర్థమైన రేఖ ఒక్క పరుగున మంగళ గదిలోకి వెళ్లిపడింది.

"మోహన్! ఇదేం పాపంరా. రాత్రి నువ్వు రేఖ గదిలోకి ఎందుకు వచ్చావ్? " తీవ్రంగా అడిగింది మంగళ... మర్నాడు మోహన్ గదిలోకి వెళ్లి.

"అదేమిటమ్మా! భర్త, భార్య గదిలోకి ఎందుకు వెళ్లాడని అడగచ్చా? "

"అడగచ్చు నువ్వు రేఖ భర్తవి కాదుకనుక"

"అమ్మా! ఒకసారి అగ్నిసాక్షిగా తాళికట్టినప్పుడు లీగల్‌గా విడాకులిచ్చినా రేఖ మీద నాకు సర్వాధికారాలు వున్నాయి" ఏమాత్రమూ జంకులేకుండా చెప్పాడు మోహన్.

"ఇదెక్కడి వితండ వాదం మోహన్. నువ్వు నాకోమాట చెప్పావ్ గుర్తులేదూ?

నాకు కష్టం కలిగించననీ, నా మాట వింటా ననీ చెప్పావాలేదా? "

"గుర్తులేదు. రేఖకి మొదటిభర్తను నేనే. కాదని చెప్పగలవా? "

"మోహన్! నువ్వేదో బాగుపడ్డావని సంతోషించాను. పోనీ పెళ్లి చేసుకుం టావా? " తనను తాను కంట్రోల్ చేసు కుంటూ నచ్చచెప్పే ధోరణిలో అడిగింది మంగళ.

"నాకు పెళ్లయిందిగా మళ్లీ చేస్తావా? వద్దు తప్పు"

'హరి భగవంతుడా! రేఖ వీడి మనసులో నాటుకుపోయింది. బయటపడలేకపోతు న్నాడు. ఏం చేయాలి? రేఖకి ఎప్పటికైనా ప్రమాదం తప్పదు. మోహన్ రావడం మానడు' అనుకుని, మోహన్ నా మాట విను. నిన్ను నువ్వు మరచిపోయి మాట్లా డుతున్నావు. నీ పెళ్లి రేఖతో రద్దు చేసుకు న్నది ఎందుకు? నువ్వు నువ్వు... ఎయిడ్స్ రోగివి" ఇంతదాకా మోహన్ని ఎప్పుడూ ఈ రకంగా మందలించని మంగళ బాధగా అంది.

"అవును. నేను ఎయిడ్స్ రోగిని. అందుకే నాకు రేఖని దూరం చేశారు. భార్య హిందూ శాస్త్ర ప్రకారం, భర్తను అనుసరిం చాలి. నా పెళ్లి నువ్వు శాస్త్రోక్తంగా జరిపిం చావ్. ఈ ఎయిడ్స్ నా భార్యకూ వస్తే పోయేది ఏముందీ? ఇద్దరమూ ఒకే కార ణంగా పోతాం"

"అంతేతప్ప నీ పట్టువిడవ్వా? రేఖని బాధించేహక్కు నీకులేదు. అది గుర్తుంచుకో"

"అమ్మా ఇంతవరకూ నేను కోరినవన్నీ జరిగాయ్. చివరి కోరికగా ఇదొక్కటే తీర్చు కుంటాను" తెగించినట్టు చెప్పాడు మోహన్.

"ఒరేయ్! నువ్వేదో మంచిగా మనసు మార్చుకున్నావనుకున్నాను. ఇది చాలా దారుణం. ఇప్పుడు రేఖ నీకు వదిన అవు తుందిరా"

"వావివరసలు చెప్పకు. రేఖకు నేను తాళి కట్టాను. అంతే" మూర్ఖంగా అన్నాడు మోహన్.

"అరే! నీకు బుద్ధి వక్రించింది. మంచిగా చెబితే వినవురా" అంటూ ఆవేశంతో మోహన్ రెండు చెంపలూ వాయించింది. "మళ్లీ నువ్వీ ఇంటికి రావద్దు. నీమొహం చూడాలంటేనే అసహ్యంగా వుంది. వెళ్లి పోరా" అంటూ ఛీత్కరించింది. మందు మైకంలో వున్న మోహన్‌కి కొంతసేపటికి గానీ మైకం దిగలేదు.

మోహన్ వలన రేఖకి ఎప్పటికైనా ప్రమాదం జరగవచ్చు. డైవోర్స్ ఇప్పించినా కూడా ఆమెమీద మోహన్ని వదులుకోడం లేదు. ఎలా రేఖను రక్షించాలో అర్థంకాక సతమతమైపోయింది మంగళ. డాక్టర్‌గా రితో ఇంట్లో జరిగే రాద్ధాంతం అంతా వివ రించింది.

"డాక్టర్! మీరు ఎంతోకాలంగా మాకు ఆప్తులు. మోహన్‌వలన కోడలికి ప్రమాదం తప్పేలాలేదు. వాడి మనసు మళ్లించడానికి తగిన మెడిసిన్స్ వుంటే చెప్పండి. వాడు ఈ ఇంటికి రానంతకాలమే మా మనసులు ప్రశాంతంగా వుంటాయి. వచ్చాక నరకమే చూస్తున్నాం. రేఖ మంచికి చేశాననుకున్న ప్రయత్నం ఈవిధంగా చెడుకి దారితీస్తుందన నుకోలేదు" అంటూ బాధపడింది.

"మంగళా! మనసు మళ్లించడానికి ప్రత్యే కంగా మందులేముంటాయి? ఎప్పుడూ మత్తులో వుంచే మందు, నిద్రమాత్రలూ తప్పితే! అవి ఇప్పుడు తీసుకుంటూనే ఉన్నాడు. మరికాస్త పవర్‌ఫుల్ డోస్‌కి పెంచాలని నేనూ మరికొందరు డాక్టర్లం కలిసి ఆలోచిస్తున్నాం. తీరా వాడిన తర్వాత ఫలితాలు ఎలా వుంటాయో. మీరు ఏమను కుంటారో అని సంశయిస్తున్నాం. మీరు అనుమతిస్తే ఎందుకైనా సిద్ధపడగలను అంటే ఎక్స్‌పెరిమెంట్ చేయాలిమరి" అన్నారు డాక్టర్.

"కన్నతల్లినై ఉండి, ఇటువంటి పరిష్కారం కోరుకోవలసి వస్తోందని ఏనాడూ అనుకో లేదు డాక్టర్. కానీయండి. చేసిన పాపాల్లో ఇదొకటి అవుతుంది అంతేకదా! మీరు మీ ప్రయత్నం చేయండి. అందుకు మనస్ఫూర్తిగా అనుమతి ఇస్తున్నాను. రేఖను రెండో సారి కోడలిగా తెచ్చుకున్నప్పుడు ఆ అమ్మాయి శీలాన్ని కాపాడటానికి మోహన్ని బలి చేయక తప్పదు" చెప్పింది మంగళ నిబ్బరంగా.

డాక్టర్ మంగళ కోరినట్టు డాక్టర్ మెడిసిన్ వాడటం మొదలుపెట్టారు. కొద్దిరోజులు వాడగానే మోహన్‌లో మార్పు వచ్చింది. విచిత్రం రేఖ కనబడితే కోరికతో రగిలిపోయే అతడిలో ద్వేషం అసూయా పెరిగిపోసాగింది. ఆమె నీడ కూడా భరించలేనట్టు మారిపోయాడు. మంగళ తేలికగా నిట్టూర్చింది. రేఖ మీద కోరిక కలగటంకంటే ద్వేషం కలగటమే మంచిదిగా తోచింది.

అటు పెళ్లి అయిన సంఘటనా, ఇటు రేఖ కనబడితే కోపం, రోజురోజుకీ శరీరంలో సత్తువంతా తీసేసినట్టుండే ఎయిడ్స్ వ్యాధీ, అతణ్ణి మరో మనిషిగా చేశాయి. అందుకే ఒకోసారి అసలు భర్తలా, రాత్రి పడగ్గదిలోకి రాలేదేమని కోపగించడం, మరోసారి ప్రతీపనికీ వంకలు పెట్టడం, హేళన చేయడం, రేఖ ఎదుట పరాయి స్త్రీల అందచందాలను పొగడటం, వల్గర్‌గా మాట్లాడటం, ఒక సినిమా చూసినప్పుడు, బయట ఆడవాళ్లను చూసినప్పుడు నఖశిఖ పర్యంతం అతిగా వర్ణించడం ఏవేవో ఇటువంటి వికృత చేష్టలు చేయడం సాగించాడు. తప్పితే రేఖను తాకడానికి మాత్రం భయపడేవాడు. అతడిలో తీరని కోరిక కసిగా మారి ద్వేషంగా బయటపడేది. అందుకే రేఖ అతను ఎన్ని అనుకున్నా పట్టించుకోదు. మౌనంగా వుండిపోతుంది.

జన్మతః వచ్చిన సహనం, ఓర్పు ఆమె జీవితానికి వరంగా ప్రాప్తించాయి. మోహన్ వచ్చినప్పుడు అమావాస్యగా, అరుణ్ వస్తే పున్నమి వెన్నెలగా గడిచిపోతుంది. మంగళాదేవికి రేఖ అంటే పంచప్రాణాలు. పూజా, రోజాలు సరేసరి. కొడుకు మోహన్‌ని అయినా వదులుకోడానికి సిద్ధపడుతుంది కాని రేఖను, పిల్లలను కంటికిరెప్పలా కాపాడుకుంటుంది.

అరుణ్ వచ్చినప్పుడు అందరికీ పండగే. మంగళ పిల్లలను కనిపెట్టి వుండటం, అరుణ్, రేఖలు ఎట్లైనా విహారాలకు వెళ్లడం చేస్తుంటారు. అరుణ్ ఎన్నడూ మోహన్ మాట తలపెట్టడు. అతనేకాదు మంగళ కూడా అలాగే మసలుతుంది. అతనొక అతిథిలా వస్తాడు. కొన్నాళ్లు వుంటాడు. వెడతాడు. తల్లి అంటే గౌరవం వుంది. ప్రేమ వుంది. కానీ తల్లీ కొడుకులు, అన్నాతమ్ముడూ అభిమానంగా మాట్లాడుకోవడమే అరుదు. రాగానే ఎలా వున్నావమ్మా అని పలకరించడం, వెళ్లేప్పుడు వెళ్లొస్తానమ్మా అనడం తప్పితే వారి మధ్య అంతగా మాటలుండవు. ఎందుకు వస్తాడో తెలియదు. ఎక్కడికి వెడతాడో తెలియదు. అరుణ్, మోహన్‌లు ముఖాముఖీ ఎదుట పడటం అనేది జరగదు. సంబంధంలేని వారిలా ఇంటికి వస్తుంటారు. వెడుతుంటారు. మోహన్, అరుణ్ వచ్చినప్పుడు ఎలా తెలుసుకుంటాడో కానీ రానేరాడు. రేఖని అపురూపంగా ఆరాధనగా, ఎవరికీ లభించని పెన్నిధి తనకు మాత్రమే దక్కిందన్నట్టుగా చూసుకుంటాడు అరుణ్. అరుణ్, రేఖలు ఒకరికోసం మరొకరు పుట్టినంత అనురాగంతో, అన్యోన్యంగా వుంటారు.

మోహన్ కారణం లేకుండా రేఖను నిందించడం మంగళకు బాధగా అనిపిస్తుంది. అటువంటప్పుడు రేఖను, పిల్లలను తీసుకుని కొన్నాళ్లపాటు పుణ్యక్షేత్రాల్లో నిర్మించుకున్న సొంత కాటేజీల్లో కొద్ది రోజులు వుంటుంది. ఎలా కనిపెడతాడో ఎక్కడున్నా అక్కడికే వచ్చేస్తాడు మోహన్. అతన్నుంచి తప్పించుకోడం చాలా కష్టం.

అతడి ధోరణికి అంతా అలవాటు పడిపోయారు చేసేదిలేక. శాశ్వత పరిష్కారం ఏమిటా అని మంగళ ఆలోచిస్తూనే వుంటుంది. అప్పుడు వచ్చిన ఆలోచనల్లో ఆమెకు తోచింది ఒక్కటే! అనుకోడానికి తప్పేకావచ్చు మాతృమూర్తి అయిన ఏ స్త్రీ అయినా ఆమె అనుకున్నట్టు బాధిస్తుందో లేదో కానీ మోహన్ ప్రవర్తనతో విసిగిపోయిన మంగళ మాత్రం ఒక్కటే కోరుకుంది. రోజు రోజుకీ క్షీణిస్తున్న అతడి ఆరోగ్యం, ఏదో ఒక రోజున దిగజారక తప్పదు. భయంకరమైన వ్యాధి అతణ్ణి క్రమంగా కబళిస్తూనే వుంది. ఏదో ఒక రోజున దూరం చేయకా మానదు. అందుకే ఆరోజు ఎప్పుడా అని ఎదురుచూడటమే! ఒక్కరి వీడ్కోలు ముగ్గురి మనసులకు శాంతినిస్తుంది.



అరుణ్, మోహన్‌లు పుట్టినప్పుడు మంగళ, అత్తమామలు ఎంతో మురిసిపోయారు. అంతకుముందు వారి కొడుకులకు ఆడపిల్లలే సంతుగా కుటుంబాలు విస్తరించాయి. ఆడ పిల్ల అనగానే మరో ఇంటిపేరుకి మారిపో తుంది. ఆ ఆనవాయితీ తప్పి మగ బిడ్డలు జన్మించడమే వారి ఆనందానికి కారణం. ఇక అరుణ్, మోహన్‌లను నేలమీద నడువనీయ లేదు. అరచేతుల్లో పెట్టి పెంచినట్టుగానే పెంచారు. మంగళ భర్త తల్లితండ్రులకు చివరి సంతానం. చాలాకాలానికి పుట్టిన మగబిడ్డలకు అయిదో సంవత్సరం రాగానే మంగళ అత్తమామలు మరణించారు. అయినా ఇంటినిండా పనివాళ్లు వుండటంతో కవలల పెంపకం అంత కష్టం కాలేదు. ప న్నెండేళ్ల వరకూ దుడుకుగా అల్లరి చేసే అరుణ్, విచిత్రంగా ఆ తర్వాత నెమ్మదిగా తయారయ్యాడు. మొదట్నించీ సౌమ్యంగా వుండే మోహన్ పెంకెగా తయారయ్యాడు. ఒకరి తత్వం మరొకరికి బదిలీ అయింది. అంతే అప్పట్నించీ అరుణ్ మనసులో మాట చెప్పకుండా గుట్టుగా వుండటం, పెద్దలు ఎలా చెబితే అలా నడుచుకోడం చేయసా గాడు. అరుణ్‌కి వ్యతిరేకం మోహన్. వద్దన్న పని చేయడం, కాదంటే ఇల్లంతా భీభత్సం చేయడం, పనివాళ్లను కొట్టడం, హీనంగా చూడటం చేసేవాడు. యుక్తవయసు వచ్చేస రికి దుర్వ్యసనాలు పట్టుబడ్డాయి. దాంతో తండ్రి డబ్బు అందుబాటులో వుండనీయకా, అవసరం ఇమ్మని అడిగినప్పుడు ఎందుకో, ఏమిటో ఆరాతీసి ఆ అవసరం తప్పనిసరి అయినది అనుకుంటేనే కొంత డబ్బు ఇవ్వడం అలవాటు చేశాడు.

మంగళ కూడా భర్త ఎందుకు అలా చేశాడో గ్రహించి ప్రవర్తించేది తప్ప మోహ న్‌ని ప్రోత్సహించలేదు. అరుణ్ ఇంటర్ చదివిన తర్వాత ఆర్మీలో చేరాలని ఉత్సాహం చూపించాడు. కాని తండ్రి అంగీ కరించలేదు. చెబితే పోనీయరని ఇంట్లో చెప్పకుండా మరికొందరు ఫ్రెండ్స్‌తో కలిసి సెలక్షన్ టెస్ట్‌కి హాజరై సెలక్ట్ అయిన వెంటనే వాళ్లతో బాటే వెళ్లిపోయాడు. అంతే మంగళ భర్త ఎంత ప్రయత్నించినా కొడు కుని వెనక్కి తీసుకురాలేకపోయాడు. అలా అని మనసు సరిపెట్టుకోనూలేకా బెంగతో తీసుకుని మరణించడంతో మంగళ చిన్న కొడుకుని అదుపు చేయలేక నిస్సహాయురా లిగా వుండిపోయింది. ఇక నన్ను శాసించే వారు లేరన్న స్వేచ్ఛకు దారితీయడంతో మోహన్‌కి పట్టపగ్గాలు లేకుండా పోయాయి.

కర్మసిద్ధాంతాన్ని నమ్ముకున్నవారు ఇదంతా ఖర్మ, ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది, తప్పించగలవారెవరూ అను కుంటారు.

మరొకరు అదుపు చేసేవారెవరు? తండ్రి లేడు. అన్నేమో సైన్యంలో చేరాడు. తల్లి మంగళ గారం చేసింది అనుకోవచ్చు లేదా పాపం ఆవిడ మాత్రం ఏం చేయగలదు? అతడి ఇష్టాన్ని కాదనలేకపోయింది. మిగి లిన ఒక్కడ్నీ దూరం చేసుకోలేక అనుకోనూ వచ్చు నిజానికి మంగళ మోహన్ అల వాట్లు గ్రహించలేకపోయింది. అతడి మన సుకి కష్టం కలిగించలేకపోయింది.

ఐశ్వర్యం కలవారంతా మోహన్‌లాగే తయారు అవుతారా అంటే అదీ చెప్పలేం. ఒంటరిగావుండే మంగళకు సరైన సలహాలి చ్చేవారు లేకపోయారు. అన్నీ ఆవిడే నిర్వ హించుకోవలసి వచ్చేసరికి మరోదారి తోచ లేదు. మందలించేవారున్నా మోహన్‌ని అదుపు చేసేవారున్నా అతడు మారతాడనీ చెప్పలేం. ఒకరకమైన జీవితానికి అలవాటు పడినవారు అంత త్వరగా బయటపడలేరు. తీరా తప్పు తెలుసుకునేసరికి అమూల్యమైన జీవితాన్ని కోల్పోతారు. అప్పుడు ప్రయో జనం ఏముంటుంది?

మోహన్ విషయంలో అదే జరిగింది. ఆ వేదనతో ఒకరకమైన రాక్షసత్వానికి లోన

య్యాడు. నిస్సహాయత అతన్ని మృగంలా మార్చింది. అతడు చేయగలిగింది ఎదుటి వార్ని బాధించటమే. అది కూడా కావాలని చేయడు. నిస్సహాయత, చేతకానితనం, కోల్పోయిన ఆనందం అతన్ని దహించివే సింది. విచిత్రంగా ఈ భావాలను ఎదుటి వారు గ్రహించలేరు. అతడో దుర్మార్గుడు, స్త్రీలోలుడు, భార్యను బాధించే రాక్షసుడు, చదువుకున్న మూర్ఖుడూ, విచ్చలవిడి జీవితా నికి అలవాటు పడినవాడికి ఎవ్వరి మీద ప్రేమాభిమానాలుండవు అనుకుంటారు.

జరిగింది ఇదీ! అందుకే నువ్వు కూడా అతడి గురించి అసహ్యించుకున్నావ్. నీ తప్పు కూడా లేదు. మనం కలిసి వున్నది మూడు సంవత్సరాలు. అది కూడా కాలేజీ వరకే పరిమితమయింది. నువ్వు మా ఇంటికి వచ్చింది చాలా తక్కువ. అందువ ల్లనూ, మనం మళ్ళీ కలుసుకోగల అవకాశం లభించనందువల్లనూ ఈ విషయాలు నీకు తెలియవు. ఆనాటినుంచి ఈనాటికి నీరేఖ గత చరిత్ర ఇదంతా" అంటూ రేఖ చెప్పడం ముగించింది.

"అబ్బ! చిన్న వయసులో ఇన్ని అనుభ వాలు చూశావా రేఖా? నీ సహనం నిన్ను రక్షించిందో, కష్టాలపాలు చేసిందో నాకు తెలియదు. కానీ, నేనైతే క్షణం భరించగలి గేదాన్నికాదు. మరి మీ అత్తగారు మంగళా దేవిగారు ఎక్కడున్నారు? కనిపించలేదేం? " అడిగింది రేణూ.

"పాపం! ఆవిడ ఎన్ని బాధలు పడ్డారని! ఆవిడతో కంపేర్‌చేస్తే నాకు తక్కువని చెప్ప వచ్చు. అటు ఆస్తిని కాపాడుకుంటూ, ఇటు మోహన్‌ని భరిస్తూ, మమ్మల్ని ఏ కష్టం కలగకుండా చూసుకుంటూ అసలు కష్టం ఆవిడదే అనిపిస్తుంది. ఒకోసారి భరించలేక స్లీపింగ్‌పిల్స్ ఎక్కువగా వేసుకునేవారు. మాకోసం పాటుపడుతూ, ఇంతకాలమూ ఓర్చుకున్న మీరు, అర్ధాంతరంగా అన్యాయం చేసి వెళ్ళకండి. మీరే అఘాయిత్యం చేసినా, నేనూ, పిల్లలూ అనాథలు అవుతామని కన్నీ టితో వేడుకున్నాను. మీరింకా పాపల భవి ష్యత్ చూడాలని బతిమాలుకున్నాను. మాకోసం ఇంత చేయాలని తహతహలా డేది మాకు దూరం కావడం కోసమేనా? " అని వారించాను.

"ఏంచేయను రేఖా! ఒకప్పుడున్న ధైర్యం పోయింది. రానురాను నీకు బాధలేతప్ప, సుఖం వుండదా అనిపించేది. అరుణ్ ఎప్ప టికైనా తిరిగివస్తాడు. నిన్ను, పిల్లల్నీ క్షేమంగా అప్పగించగలనా అని, దిగులు పడుతున్నాను" అన్నారు.

"కొన్నాళ్ళపాటు మీరు ప్రశాంతంగా వుండండి. మీ దగ్గిర వ్యవహార జ్ఞానం తెలుసుకున్నాను. నేను కూడా కొన్ని నేర్చు కోవాలికదా? ఎంతకాలం మిమ్మల్ని కష్టపె ట్టగలను? అని వప్పించి, ధైర్యంచెప్పి నువ్వు వచ్చేముందే బెంగుళూర్‌లో ఆవిడ నిర్మిం చిన ఆశ్రమానికి పంపించాను. ప్రస్తుతం మా ఇంట్లోలేరు"

"మరి మోహన్‌నుంచి నిన్ను నువ్వు కాపాడుకోగలవా? " అడిగింది రేణూ.

"ఆ... ఆ అవసరం లేకుండా మోహన్‌కి ట్రీట్‌మెంట్ ఇచ్చారు. అందువలన అతడు మాటలవరకే, చేతలకు నిస్సహాయుడు. నేనే కాదు, ఏఅమ్మాయికీ అతన్నించి ప్రమాదం లేదు. ఆ ధైర్యంతోనే వెళ్ళారు అత్తయ్య" చెప్పింది రేఖ.

"ఇదేదో చాలా ఉపయోగకరంగా వుంది కదూ? అయితే ఎయిడ్స్‌వ్యాధి వున్నవారికి ఈరకమైన ట్రీట్‌మెంట్ ఇస్తే, ఇతరులకు వ్యాపిస్తుందనే భయం లేదుకదా? ప్రతిదా నికీ సమస్య తీరుతుంది. ఒక భయంకర మైన వ్యాధి నిర్మూలించబడుతుంది. ప్రపం చానికే రక్షణ కలిగిస్తుంది" అంది రేణూ.

"అవును. మాఫ్యామిలీ డాక్టర్ మోహన్‌కి ట్రీట్‌చేస్తున్న డాక్టర్స్ బృందమంతా అదే ఆలోచనలో వున్నారు. మరికొద్ది ఎక్స్‌పెరి మెంట్స్ చేయాలట. అంతదాకా సీక్రెట్‌గా

వుంచాలనుకున్నారు. ఈ విషయం నీకు మాత్రమే చెప్పాను. ఈ ప్రయోగాలకు స్పెసిమన్ మోహన్ అవుతాడు" కొత్త విషయం తెలియచేసింది రేఖ.

"ఫెంటాస్టిక్. నేనా డాక్టర్స్‌ని అభినందిస్తున్నాను. ఎక్స్‌పెరిమెంట్‌కి, మోహన్ అంగీకారం ఇచ్చాడా మరి?" ఇంట్రెస్టింగ్‌గా అడిగింది రేణూ.

అనుమతి కోరడానికీ, అతను ఒప్పుకోడానికీ మోహన్‌కి తెలియకూడదట. ఏ కారణంగానో అతను తిరగబడినా, సహకరించకపోయినా అంతా వృధాయే అవుతుందట. అందుచేత పర్మిషన్ ఇచ్చినవారు మంగళ అత్తయ్యగారే!

అదెలా జరిగిందంటే అత్తయ్య, మోహన్ చేష్టలను భరించలేక డాక్టర్‌ని వేడుకున్నారు. ఎప్పటికీ మోహన్ మామూలు మనిషి కాలేడు. వాడివలన నేను బాధపడటానికి సిద్ధమే! కానీ రేఖ, పిల్లలు, అరుణ్ కూడా నరకం చూస్తారు. నేనెంతకాలం జీవించి వుంటానో తెలియదు. వున్నంతకాలమూ రక్షణ ఇవ్వగలను. ఆ తర్వాత రేఖా, పిల్లలూ ఏమవుతారు? అరుణ్ ఉద్యోగం వదిలిరాడు. అలా రావాలని నేను అనుకోను. వాడొక ఉన్నత ధ్యేయంతో చేరాడు. అది నెరవేరితే నాకూ గర్వకారణమే! మోహన్‌ని మాకు అడ్డు తొలగించండి, నన్ను రాక్షసి అనుకున్నా సరే...' అన్నారు.

అప్పుడు, "మంగళా! నువ్వెంత విసిగిపోయి ఈ నిర్ణయానికి రాగలిగావో నాకు తెలుసమ్మా! నువ్వు రాక్షసివికాదు. దేవతామూర్తివి. నీ ఆలోచన తప్పుకాదు. అయితే నువ్వెటూ ఈ నిర్ణయానికి వచ్చావు కాబట్టి, నేనొక మాట చెబుతాను. నువ్వు సరేనంటే దానివలన లోకోపకారం జరుగుతుంది. నీ త్యాగం ఎందరికో కొత్త జీవితాన్నిస్తుంది. దేశసేవలో అరుణ్ ఎంతటి ఉన్నతుడో, నువ్వు కూడా అంతటి కీర్తిని గడించగలవు. ఎందరో నీపేరు తలుచుకుంటారు" అన్నారు డాక్టర్.

"నాకు కావలసింది కీర్తి, త్యాగం అనే బిరుదులు కావు డాక్టర్. మానవాళికి జరిగే మహోపకారానికి నేను సమిధను అవుతాను. చెప్పండి డాక్టర్. మీమాటలు నాకు ఎంతో ఆనందం కలిగిస్తున్నాయ్" అన్నారు అత్తగారు.

ఎయిడ్స్ వ్యాధిపై పోరాటానికి మా డాక్టర్స్ గ్రూప్ అంతా కలసి, ఎన్నో పరిశోధనలు చేశాం. ఇంకా చేస్తున్నాం. సరియైన వ్యక్తి లభించి అంగీకారం తెలియచేయనందువలన, ఆటంకం ఏర్పడింది. మోహన్ అందుకు తగినవాడే. మీ నిర్ణయం వలన అతడిమీదనే ప్రయోగాలు చేయవచ్చునని ఆలోచన కలిగింది. ఇప్పుడు చెప్పు మంగళా..." అన్నారు డాక్టర్.

"మీరు చెప్పినట్టు ఎందరి జీవితాలో మోహన్ కారణంగా బాగుపడతాయంటే, అంతకంటే కావలసింది ఏముంది డాక్టర్. అలాగే కానివ్వండి... అంటూ ఆవిడ పర్మిషన్ ఇచ్చారు" అంది రేఖ.

"అలాగా... ఈ నిర్ణయం తీసుకున్నందుకు ముఖ్యంగా మంగళాదేవిగార్ని అభినందించాలి. మనిషి మరో మనిషికి సహాయం చేయాలన్నా, మరణించినవారి శరీరావయవాలు, దానం చేయవచ్చునని తెలిసినా అంగీకరించరు. తరతరాలనుంచీ వచ్చిన సాంప్రదాయాలకోసం వెనుకాడుతారు. అటువంటిది జీవించి వుండగానే అభిమానించే చిన్న కొడుకుని, దానమిచ్చిన గొప్ప మనసుగల వ్యక్తిత్వం మంగళగారిది. ఆవిడను తప్పకుండా చూడాలి. అభినందించాలి" ఆరాధనాభావంతో చెప్పింది రేణూ.

"నువ్వు ప్రస్తుతం ఆవిడను చూడలేవు. మరోసారి ఆవిడ వున్నప్పుడు చెబుతాను. వద్దువుగాని..." అంది రేఖ.

తేలికపడిన మనసుతో, సంశయాలన్నీ తీర్చిన రేఖ గతం గురించి తెలిశాక ఆ రాత్రి

హాయిగా నిద్రపట్టింది రేణుకి.

అరుణ్, రేఖా, రేణుని ట్రెయిన్ ఎక్కించడానికి స్టేషన్‌కి వచ్చారు. ట్రయిన్ ఎక్కి కూర్చుంది రేణు. సిగ్నల్ ఇచ్చారు.

"మీరాక రేఖకి ఎంతో సంతోషం కలిగించింది. వీలైనప్పుడు వస్తూ వుండండి. మీరే మాకు ఆప్తులు. మేమూ వస్తూంటాం" వీడ్కోలు చెబుతూ అన్నాడు అరుణ్.

"అంతగా మీరు చెప్పాలా? అలాగే వస్తాను. అంటూ రెండు చేతులూ జోడించి, బై... రేఖా" అంది రేఖవైపు తిరిగి.

ట్రయిన్ కదిలి వేగాన్ని అందుకుంది.

మరికొద్దిరోజుల తర్వాత రిటెన్‌టెస్ట్ పాసైనట్టు కబురు తెలిసింది. ఇంటర్వ్యూకి ఢిల్లీ వెళ్ళాల్సివచ్చింది రేణుకి.

తరచుగా రేఖతో మాట్లాడుతూండటంతో విషయమంతా వివరించింది.

"కంగ్రాట్స్ రేణు! నువ్వు అనుకున్నది తప్పక నెరవేర్చుకుంటావ్. చాలా సంతోషంగా వుంది. అరుణ్ కూడా కంగ్రాట్స్ చెప్పమన్నాడు" అంది రేఖ.



విజయవాడ స్టేషన్‌లో మోహన్, రేణు ఎక్కిన కంపార్ట్‌మెంట్ ఎక్కాడు. అతణ్ణిచూస్తే ఇప్పుడు రేణుకి అతడిపట్ల ద్వేషం కలగలేదు. ఈ మనిషి ఒకప్పుడు తన పతనాన్ని కోరితెచ్చుకుని వుండవచ్చు. రేఖని అన్న భార్యగా చూసినప్పుడు మాత్రం అతడిలో ప్రేమనుంచి ద్వేషం పుట్టింది. అందరి జీవితాల్లో అలజడి కలిగింది. ఆ కుటుంబంలో నిజానికి సుఖపడింది అరుణ్ ఒక్కడే. మోహన్ మనసు తెలుసుకుని సాంత్వన చేకూర్చేవారే లేకపోయారు. అతని డబ్బుకోసం అమ్మాయిలు వెంటపడ్డారు. ఎవరికి మాత్రం ఏంద క్కింది? కొందరి జీవితాలు అంతేనేమో!

ఎంతో సంపదవుండీ, కన్న కొడుకులుండీ, మంగళాదేవికి మనశ్శాంతి లేకుండాపోయింది.

అందులోనే ఒక మహత్తర త్యాగానికి సిద్ధపడి కొడుకునే ప్రయోగానికి వదులుకుంది. ఆవిడ పెద్దగా చదువుకోలేదు. అయితేనేం ఎందరో నిర్భాగ్యులకోసం కొడుకును సమిధను చేయడానికి సిద్ధపడింది. ఆవిడ మార్గదర్శకత్వంలో ఎన్నో నేర్చుకోవలసినవి వున్నాయ్. ఇప్పుడు ఈ క్షణంనుంచీ నేను కూడా ఆవిడే స్ఫూర్తిగా, చేయగల మంచిపని వుందేమో ఆలోచిస్తాను" అనుకుంది రేణు.

మోహన్ రేణుని గుర్తుపట్టాడు. కానీ పలకరిద్దామా వద్దా అనే సంశయంతో వుండిపోయాడు.

ఈ సంశయాన్ని గుర్తించిన రేణు, "హల్లో మోహన్ నన్ను గుర్తుపట్టారా? రేణుని! ఎక్కడికి వెడుతున్నారు?" అడిగింది.

"గుర్తుపట్టకేంలెండి. కానీ మీకు నాతో మాట్లాడటం, ఇష్టం వుంటుందో లేదో తెలియక పలకరించలేదు" అన్నాడు.

ఆరోజు వెకిలిగా వెంటపడి వేధించిన మోహనేనా ఇతగాడు? ఇంత సౌమ్యంగా, కుదురుగా వున్నాడేమిటీ? ఇతనిమీద డాక్టర్స్ ఎక్స్‌పెరిమెంట్స్ చేస్తున్నారు కదా? ఇలా వచ్చాడెందుకు? ఇతనుగాని పారిపోయి వచ్చాడా? అనుకుని, "మీరు ఇప్పుడు ఎక్కడ వుంటున్నారు?" అడిగింది రేణు!

"ఢిల్లీలో ఉంటున్నానండీ. ఎ.ఐ.ఎం.ఎస్‌కి పంపించారు డాక్టర్స్. అమ్మనుచూసి తిరిగి వెడుతున్నాను. నా ఆరోగ్యం ఇప్పుడు

అంతగా బాగాలేదండీ ఇక వెళ్ళలేకపో వచ్చు. ఈ విషయం అమ్మకు చెప్పలే దండి..." అన్నాడు విషాదంగా.

మోహన్‌లో ఇంత మార్పా? కారణం ప్రయోగాలకోసం వాడే మెడిసిన్ కార ణమా? అర్థంకాలేదు రేణుకి.

"మోహన్‌గారూ, నేను ఇంటర్వ్యూకి ఢిల్లీ వెడుతున్నాను. నేను కొద్దికాలం అక్కడే వుంటాను. మిమ్మల్ని కలుస్తూ వుంటా లెండి" చెప్పింది రేణు.

"నన్ను కలుస్తుంటారా? అలా వీలుపడ దండీ. మా అమ్మగారు రావడానికే డాక్టర్ అంగీకరించలేదు. నన్ను కూడా ఇకమీదట హాస్పిటల్ వదిలి వెళ్ళడానికి అంగీకరిం చరు" అన్నాడు మోహన్.

"ఎలాగో ప్రయత్నం చేస్తాలెండి. చెప్పండి మీ ఆరోగ్యం ఎలావుంది ఇప్పుడు?"

"ఎలా వుంటుందండీ. రానురానూ దిగ జారుతోందని నాకు తెలుస్తూనే వుంది" ముభావంగా అన్నాడు మోహన్.

"మీరిలా ట్రయిన్‌లో ప్రయాణంచేస్తు న్నారు. ప్లేన్‌లో వెళ్ళకుండా, పైగా ఒంట రిగా..." అడిగింది రేణు.

"ఒంటరితనంకాక, నాకు తోడు ఎవరు న్నారు?" విషాదంగా అన్నాడు.

"కనీసం, అమ్మగారు మిమ్మల్ని ఢిల్లీలో హాస్పిటల్ వరకూ తీసుకువెళ్లచ్చునుకదా?"

"అమ్మ వస్తానంది. కానీ వద్దన్నాను. అటునుంచి వచ్చేప్పుడు అమ్మ దిగులుతో ప్రయాణంచేయలేదు"

"ప్లేన్‌లో ఎంతసేపు రావాలి? మీమాట నమ్మశక్యం కావడంలేదు. మీరు ఏదో దాచి పెడుతున్నారు"

"బాగానే కనిపెట్టారు. మీరింతగా నామీద జాలిచూపిస్తున్నారు. నా గురించి మీకు తెలిసిపోయిందా? పూర్తిగా...? నామీద అసహ్యం కలగలేదా?"

"అవును. జరిగినదంతా విన్నాను. మీ గురించి తెలియకముందు మీ ప్రవర్తన తప్పుగా తోచినమాట నిజమే! తెలిశాక ఒక రకంగా మీమీద జాలి ఏర్పడింది"

"అదేమిటండీ తెలిసిన తర్వాత అసహ్యం ఏర్పడాలి. మీరు జాలిపడుతున్నారా?"

"అవును మోహన్. తెలిసీ కావాలని ఎవరూ చెడిపోరు. మీరు ఎందుకిలా అయి పోయారని అడిగి బాధించను. కాని నిరాశ వదిలిపెట్టండి. అందరూ ఏ క్షణంలో అయినా ఈ లోకంనుంచి తప్పుకునేవారే"

"అందరి విషయమూ వేరు. నేను నా మరణశాసనాన్ని, స్వయంకృతంగా లిఖించు కున్నాను"

"మోహన్! బాధపడొద్దు. చెప్పానుగా, ఒకోసారి మనకి తెలీకుండానే మనం నడిచే బాట సరియైనదిగా భావిస్తాం. తీరా కొంత దూరం ప్రయాణం చేసిన తరువాతనే తప్పు తెలిసేది. వెనక్కి రానూలేం. ముందుకు పోనూలేం"

"జీవితానికి నిర్వచనం ఇంత బాగా చెప్పారు. మరి మీరెందుకు పెళ్ళిచేసుకో లేదు?"

"పెళ్లికంటే ముఖ్యమైనది విజ్ఞానతృష్ణగా తోచినందువలన"

"అంటే పెళ్ళి జ్ఞానతృష్ణకు ఆటంకమం టారా?"

మోహన్ ఇప్పుడు రేణుతో చొరవగా మాట్లాడుతున్నాడు. రేణుకి తనమీద అస హ్యంలేదు. పైగా స్నేహభావం చూపి స్తోంది. ఈ భావనే అతడికి ఉత్సా హాన్నిచ్చింది.

"నిస్సందేహంగా! నేను చదివింది సైన్స్ గ్రూప్. నాకు సైన్స్ సబ్జెక్ట్ అంటే చాలా ఇష్టం. ఇంతా చదివి, మళ్ళీ మరొకరికి బోధించే ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాను. కానీ ఈనాటి చదువు జిజ్ఞాసను రేకెత్తించే దిగాలేదు. ఏదో చదవాలి. పొట్టకూటికి ఉద్యోగం చేయాలి అనే తప్ప, ఎన్నో నేర్చు కుని మానవాళికి తనవంతు కృషిచేద్దాం

అని భావించేవారు కరువైపోయారు.

మొదట్నించీ నాలో జ్ఞానపిపాస ఎక్కువ. అందుకు తగినట్టు మా అమ్మా, నాన్న ప్రోత్సహించారు. అమ్మాయిలకు పెళ్లీ, సంసారం, కుటుంబాన్ని తీర్చిదిద్దటమే కర్త వ్యంగా నా తల్లిదండ్రులు భావించలేదు. 'నీఇష్టం' అన్నారు. మీ విషయంలోనూ, రేఖ విషయంలోనూ మీ అమ్మగారు చూపించిన విజ్ఞత నాలో ఒక కొత్త ఆలోచ నకు నాంది పలికింది"

"అదేమిటని నేను అడగను. ఏమైతేనేం నాకు అవసరం లేనిది"

"కానీ నేను చెబుతాను. ఇప్పుడుకాదు, త్వరలో" రేణూ చెప్పింది.

"రేణూ మీరు నన్ను కూడా జ్ఞానిగా చేయాలని చూస్తున్నట్లు కనబడుతోంది. మీ ప్రయత్నం నిష్ఫలం అవుతుందండోయ్"

"అలా శపించకండి బాబూ! మీకు పుణ్యం వుంటుంది. ఇంతకీ భోజనం చేశారా! నీరసంగా కనిపిస్తున్నారు. వుండండి. ఇద్దరమూ ఏదైనా తిందాం" తెచ్చిన భోజనం ఇద్దరికీ సర్దింది రేణూ.

మోహన్ వద్దన్లేదు. ప్లేట్ తీసుకుని తిన్నాడు.

అప్పటికే రాత్రి పదయింది.

"పడుకుంటారా? కాసేపు కబుర్లు చెప్ప మంటారా? " అడిగింది రేణూ.

"స్లీపింగ్ పిల్స్ వేసుకున్నా నిద్రరాదండీ! డాక్టర్ మార్ఫిన్ ఇవ్వాల్సిందే. మీకు నిద్ర వస్తే పడుకోండి"

"ఒక్కరోజు నిద్రపోకుంటే కొంపమునగ దులెండి. విలువైనకాలాన్ని నిద్రతో పోగొ ట్టుకోవడం నాకు ఇష్టంలేదు"

"రేణూ! మీ పరిచయం కొన్ని సంవత్సరా లముందే... అయివుంటే... నేను ఈ దుర వస్థకు లోనయ్యేవాడ్ని కాదండీ..." అప్రయ త్నంగా అన్నాడు.

"అంతలా నమ్మకం కలిగిందా నామీద? "

"అవును. మా ఇంటికి వచ్చినప్పుడు మీతో మాట్లాడిన మాటలు ఇలాలేవు. అంచేత మీరు నన్ను దుర్మార్గుడిగా భావిం చడం సహజం. ఇప్పుడు మీరు నన్ను రక్షిం చడానికి వచ్చిన దేవతలా కనబడుతు న్నారు. అయినా, రక్షించలేరు కదా? "

"నన్ను హఠాత్తుగా దేవతను చేసేశారేమి టండోయ్. నేను మనిషిని. మీలాంటి మని షిని. మోహన్, మీ ఇంట్లో జరిగిన మీ చిన్ననాటి సంఘటనలు ఏవైనా చెప్పండి"

"చెప్పమంటారా? మానాన్నగారికి నేనంటే ఎందుకో ఇష్టం వుండేదికాదు. నన్ను చేరదీసే వారుకాదు. అసలే మాది నౌకర్లూ, పనివా ళ్లతో ఒకరకమైన స్టేటస్ మెయిన్‌టెయిన్ చేసే కుటుంబం. అందుకే ఆయన నాతో గడిపేది చాలా తక్కువ. అలా మా అన్నయ్య విషయంలో జరగలేదు. ఇద్దరమూ ట్విన్స్‌మేకదా? మరేమిటో తెలియదు. అమ్మ మాత్రం అలాకాదు. ఎంతమంది పనివా రున్నా, నా అవసరాలు ఆవిడేచూసేది.

అన్నయ్యకు గోల్ఫ్, హార్స్ రైడింగ్, టెన్నిస్ ఆయనే స్వయంగా నేర్పారు. నాన్న గారు మంచి ప్లేయర్‌లెండి. వాణ్ణి క్షణం విడిచిపెట్టేవారుకాదు. చివరికి ఆయనతో చెప్పకుండా వాడు ఆర్మీలో చేరిపోయాడు.

నేనేమో అమ్మ ప్రేమను నిలుపుకోలేకపో యాను. ఇంతకీ నాన్నగారికి నామీద ఇంట్ర స్టలేని విషయం నాకు అర్థమైంది. అందుకే ఎక్కువగా బయట ఫ్రెండ్స్‌తో తిరిగేవాణ్ణి. అలా అని డబ్బు ఖర్చు విషయంలో నాకు ఆంక్షలు పెట్టలేదాయన. ఇంకా అమ్మే కంట్రోల్ చేయాలని చూసేది. ఎందుకులెండి ఇప్పుడవన్నీ తల్చుకుని ఉపయోగంలేదు"

"నాకు ఒకటి అనిపిస్తోందండీ. మీ నాన్న గారు మీ అన్నదమ్ముల మీద చూపించిన పక్షపాత ధోరణి వలన మీలో ఏదో తెలి యని, నిరాశాభావం మీ విచ్చలవిడి జీవితా నికి కారణం అయివుండాలి"

"కావచ్చు అయితే అందుకు కారణమైన

అన్నయ్య దూరంగా వెళ్లిపోయాడు. నాన్న గారా మరణించారు. అమ్మ నాకు ఎప్పుడూ అడ్డురాలేదు. మరి నాలో పెరిగిన విశృంఖ లతకు కారణం ఏమిటంటారు"

"అప్పటికే మీరు వ్యసనాలకు బానిస అయిపోయారు. ఇక బయటపడటం అంత సులువుకాదుగా! మరొక విషయం మీ మేలుకోరి దారి మళ్ళించగల ఒక్క అమ్మాయీ మీకు కనిపించకపో వడం దురదృష్టం. అంతా మీతో ఎంజాయ్‌మెంట్‌నే చూసుకున్నారు తప్పితే, మీ మనసుకు దగ్గిర కాలేకపో యారు. అదో దురదృష్టం"

"అందుకేనండీ మీరే కనుక కొన్ని సంవ త్సరాల ముందు ఎదురైవుంటే, నా జీవితం నందనవనం అయేది. దేనికైనా అర్హత వుండాలి"

"అదిగో మరి. అదే నేను చెప్పేది.



గతాన్ని గురించి మరచిపోండి. నిజానికి ఈ లైఫ్‌కి ఇక ఏ సుఖంకానీ, ఆనందంకానీ లేవనే నిరాశతో మీరు మరింత కృంగిపోతున్నారు. అలాకాకుండా మరో వ్యాపకం పెట్టుకోండి"

"నిద్రపోరా? అని నేనంటే, విలువైన కాలాన్ని నిద్రలో పోగొట్టుకోను అన్నారు. అంటే రేణూ... ఆ విలువ ఎవరిని వుద్దేశించినదో... నాతో మాట్లాడటం అంత విలువైనదా?"

"అంతేకదామరి? ఇప్పుడు మీరు స్వచ్ఛంగా మాట్లాడుతున్నారు. మరోసారి కలిసినప్పుడు, ఏరకంగా మాట్లాడతారో తెలియదుకదా?"

"అవును. నాలోని రాక్షసుడు క్షణక్షణం వికృతంగా మారతాడు. అప్పుడు నా ప్రవర్తన ఎలా వుంటుందో తెలియదు కదూ?"

"నేను ఆ వుద్దేశంతో అన్లేదు..." అంటూ సరిదిద్దుకోబోయింది రేణూ!

"ఫర్వాలేదులెండి. మీరలా అనుకోవడం తప్పుకాదు..." అంటూనే మోహన్ నిద్రలోకి జారుకున్నాడు. రాత్రి నిద్రలేని రేణూకి కూడా కళ్ళు మూతలుపడ్డాయి. కాసేపు నిద్రపోయి, మరి కొంతసేపు ఏవేవో బుక్స్, రైటర్స్ గురించి మాట్లాడుకునీ గడిపేశారు. న్యూఢిల్లీ స్టేషన్‌లో దిగి వెళ్ళే ముందు ఫోన్ నంబర్స్ తీసుకున్నారు.

"వుంటానండీ, ఈ ప్రయాణంలో మీ కంపెనీ ఎంతో సంతోషాన్నిచ్చింది. 'హాపీ జర్నీ' అనేమాటకి సరియైన అర్థం ఇది. మళ్ళీ కలుస్తామో లేదో తెలియదుకానీ, ఈరోజు బాగా గుర్తుంచుకుంటాను" అన్నాడు మోహన్.

"ప్రయాణంలో ఎందరో కలుస్తారు. విడిపోతారు. నా కంపెనీ మీకు సార్థకత చేకూర్చడం నాకూ ఆనందకరమే... బై..." అంటూ వీడ్కోలు చెప్పింది రేణూ.

★ ★ ★

"రేఖా! నీ ఫ్రెండ్ రేణూని మోహన్ ఏమీ బాధించ లేదుకదా?" అడిగాడు అరుణ్.

"బాధించడం అంటే సహజధోరణిలో ఆడవాళ్ళ గురించి మాట్లాడినందుకు, రేణూ బాధపడకపోలేదు కానీ, మనిద్దరం వాల్తేర్ స్టేషన్‌లో కనిపించినప్పుడు, ఇక్కడ మోహన్‌ని చూసినప్పుడూ ఆశ్చర్యపడింది. జరిగినదంతా తెలిశాక కుదుటపడింది"

"మీ ఫ్రెండ్‌షిప్‌కి మధ్యలో ఆటంకం ఎందుకు కలిగింది?"

"పెద్దగా కారణం అంటూలేదు. నేను కొద్దిగా ముభావంగా వుండటం, మావాళ్ళు ఛాందసులు కావడంతో వాల్తేర్‌నుంచి వచ్చాక మామధ్య అట్టే కాంటాక్ట్స్ లేకుండా పోయాయి. ఇదిగో మళ్ళీ తను హైదరాబాద్ రావడంతో, తిరిగి ఇద్దరిమధ్యా పూర్వపు సాన్నిహిత్యం ఏర్పడింది. రేణూ చాలా మంచిది. చేయాలనుకున్నపని చేసి తీరాలన్న పట్టుదలకలది"

"మరి పెళ్ళి గురించి ఆలోచించలేదా?" అడిగాడు అరుణ్.

"లేదు. మీలాగే, అంత ప్రాముఖ్యతనివ్వలేదు. ఇక చేసుకోకపోవచ్చు"

"నువ్వు కనిపించి నాకు తపోభంగం కలిగించావు" చిలిపిగా అన్నాడు అరుణ్.

"నిజమైన తపస్సు అయితే, ఎవరూ భంగం కలిగించలేరు" అలాగే జవాబిచ్చింది రేఖ.

"అంటే, నేను బలహీనుణ్ణి అంటావా? నాది చంచలమైన మనసా?"

"అబ్బేకాదు! చాలా దృఢమనస్కులు. లేకుంటే ఆర్మీ కమాండర్ అవరు"

"మనం ఢిల్లీకి మకాం మార్చివేద్దామా అని అనిపిస్తోంది"

"ఏం ఎందుకని?"

"ఏమో... నీకైతే అక్కడ బాగుంటుంది. నేనూ తరచు రావడానికి వీలుపడుతుందని"

"మీ ఇష్టం. అత్తయ్యగారి అనుమతి తీసుకోండి"

"అమ్మ నామాట కాదనదు. అయినా అడుగుతాను"

"బహుశా తరచుగా మోహన్‌ని, అత్తయ్య చూసుకోవచ్చని అయివుంటుంది. నిజమే! ఈ లంకంత ఇంటిని మెయిన్‌టెయిన్ చేయడం కష్టంగానూ వుంది..." అనుకుంది రేఖ.

అరుణ్ ఢిల్లీ మకాం గురించి చెప్పినప్పుడు మంగళ వెంటనే అంగీకరించింది.

"అలాగే వెడదాం అరుణ్. అత్తయ్య మోహన్‌కి దగ్గిరగా వుండే అవకాశమూ వుంటుంది కదూ" అంది.

"అరుణ్, మోహన్‌కి ఇప్పుడు దాదాపు చివరిదశ అనుకుంటాను..." రుద్ధకంఠంతో అంది మంగళ.

"ఏమోనమ్మా! డాక్టర్ కొంతకాలం వాడి ఆయుష్షను పొడిగించవచ్చునేమో... అయితే ఇక మనమధ్యకు రాగల అవకాశం మాత్రం వుండకపోవచ్చు" ఈమాట బాధాకరమైనదే అయినా ఏదో ఒకరోజు ముగింపు తప్పదు. అమ్మ వినడానికి సిద్ధం కావలసిందే... అనుకున్నాడు అరుణ్.

ఈసారి శెలవులకు వచ్చినప్పుడు, అరుణ్ ముందుగా ఢిల్లీలో కొన్న అపార్ట్‌మెంట్‌కి మారిపోయారు మంగళా, రేఖా, పిల్లలూ. కొత్తచోట్లు కొంచెం సెటిల్ అయ్యాక మంగళా, అరుణ్ హాస్పిటల్‌కి వెళ్ళి, మోహన్‌ని చూసివచ్చారు. అప్పటికి అతన్ని చూసి సంవత్సరం గడిచింది. మోహన్ బాగా నీరసించిపోయాడు. మంగళ హాస్పిటల్లో గుండెచిక్కబట్టుకుని, ధైర్యం నటించింది. కానీ ఇంటికి చేరుకున్నాక కుమిలికుమిలి ఏడ్వసాగింది.

"అమ్మా! నువ్విలా బాధపడుతూవుంటే, మనం ఇక వెళ్ళద్దు. మనం సిద్ధంకాక తప్పదమ్మా..." అన్నాడు అనునయిస్తూ.

"ఎలా అరుణ్? వాడ్ని చూడకుండా వుండలేక, చూసి దిగులు పడకుండా వుండటం సాధ్యంకావడంలేదు. అల్లారు ముద్దుగా పెంచాను. దూరంగా వున్నా మనసు రాయిచేసుకున్నాను. కొద్దికాలం క్రితం భయంకరమైన వ్యాధికి గురైనప్పుడు వాడి విశృంఖలత్వాన్ని అసహ్యించుకున్నాను. ఈ వ్యాధి ఏమందులకూ లొంగదని తెలిశాక, రేఖను పెట్టే చిత్రహింసలు చూస్తూ సహించలేక, వీడు త్వరగా కడతేరిపోతేనే నయం అని తిట్టుకున్నాను. వాడిలో మార్పు వచ్చి, బలహీనుడిగా మారాక, మళ్ళీ నాలోని అమ్మ మనసు గిలగిలలాడిపోతోంది. పగవాళ్ళకి కూడా వద్దురా ఇటువంటి వేదన"

"అమ్మా అన్నీ తెలిసినదానివి. మనచేతులు దాటిపోయాక చేసేది ఏముంది? సహనం తెచ్చుకో. ఓర్పుతో భరించాలమ్మా తప్పదు... ఈ టైమ్‌లో వాడికి మానసిక విశ్రాంతి కావాలి. మనం ధైర్యంగా వున్నప్పుడే వాడూ శాంతిగా వుండగలుగుతాడు. మనం దూరంగా ఎక్కడోవుండి, అన్నీ అయిపోయాక చూడటం కంటే, రోజూ ఒకసారి చూసివస్తూ, మనసుకు సాంత్వన కలిగించుకోవడం అవసరం..." అంటూ మంగళకు ధైర్యం చెప్పి, తన రూమ్‌లోకి వెళ్ళాక, అరుణ్ కూడా ధైర్యం కోల్పోయాడు. అతడి కళ్ళు రక్తం పంచుకు పుట్టిన రెండోభాగానికి తగిలిన గాయానికి బాధతో వర్షిస్తూనే వున్నాయి.

అతడి స్థితిని గమనించిన రేఖ, "అరుణ్... మీరిలా అయితే ఎలా? రణరంగంలో శత్రుసైనికులను ధైర్యంతో ఎదుర్కొన్నారు. ఎందరో తోటి సహచరులు నేలకొరిగినప్పుడు, గుండెను దిటవుపరుచుకుని, వారి అమరత్వాన్ని గర్వంగా చాటిచెప్పారు. అవసరం అయినప్పుడు కఠినమైన నిర్ణయాలను తీసుకున్న మీరు, ఇప్పుడిలా డీలా పడిపోవడం సమంజసమా?"

"రేఖా! అది రణరంగం. దేశరక్షణే

## స చి త్ర వి చి త్రం



# అందమైన నూతులు

నీటి అవసరాన్ని గుర్తించిన గుజరాత్ ప్రజలు బహుకాలంనుంచే నీటి నిల్వలకి చక్కటి పద్ధతులకు రూపకల్పన చేశారు. గుజరాత్‌కు సమీపంలోని అహ్మదాబాద్‌లో 'అద్‌లాజ్‌వార్' అనే అతి పెద్ద నూతిని అక్కడి ప్రజలు ఏర్పాటుచేసుకున్నారు. ఇటువంటి నూతులు 120 వరకూ గుజరాత్‌లో వున్నాయి. అహమ్మదాబాద్‌లోనే 4 నూతులున్నాయి. వీటిలో నీరు సమృద్ధిగా వుండి ప్రజల అవసరాలను తీరుస్తోంది. పైగా వీటిని ఎంతో కళాత్మకంగా, అత్యంత సుందరంగా నిర్మించారు. వీటికి ఎన్నో మెట్లుంటాయి. 35 మీటర్ల లోతు, 75 మీటర్ల వెడల్పులో తవ్వారు వీటిని. వీటికి 101 మెట్లు, 270 స్తంభాలు, 65 ఎన్‌క్లోజర్లు వున్నాయి. వీటిపై పౌరాణిక గాథలకు సంబంధించిన శిల్పాలు చెక్కబడ్డాయి. మెట్లు విశాలంగా, కూర్చుని కాసేపు అలసట తీర్చుకునేలా వుంటాయి.

ధ్యేయంగా, శత్రువుల చొరబాటును నిరోధించడానికి సర్వశక్తులనూ ఎదుర్కోవలసిన గురుతర బాధ్యత.

ఇది అన్నదమ్ముల అనుబంధం. పేగు సంబంధం. అందులోనూ కవలసోదరులం. మోహన్‌కీ, నాకూ విరుద్ధభావాలు ఏర్పడినా, హృదయం మాత్రం ఒక్కటే. దాన్ని రెండుగా చీల్చి అటు ఇటు సర్దుకున్నాం అంతే! చిన్నప్పుడు ఆటపాటల్లో, చదువులో, అమ్మఒడిలో ఆడుకోడానికి పోటీపడి అల్లరి చేసినా, వాడికి కాల్లో ముల్లు గుచ్చుకున్నా బాధగా వుండేది. అటువంటిది, ఇప్పుడిలా అన్నీవుండి ఆరోగ్యంలేని వాడి దీనావస్థ నన్ను పిరికివాడిగా మారుస్తోంది.



ఈ భయంకర వ్యాధి అందుకు కారణం. ఎందరో అమాయకులు దీనిబారినపడి, బంగారంవంటి భవిష్యత్‌ను అంధకారంగా మార్చుకుంటున్నారు. ఈరోజు మోహన్ అయితే ఇంతకుముందు ఎంతో మంది బలి అయ్యారు. ముందుముందు భవిష్యత్‌లో ఇంకెందరు సర్వనాశనం కాగలరో.

మోహన్ చిన్నప్పుడు ఈవ్యాధి బారినపడకముందూ, ఎంత అందంగా వుండేవాడో. నేనంటే ఎంత ప్రేమగా వుండేవాడో, వాడికి ఎవరు ఏమిచ్చినా 'అన్నకో, అరుణ్‌కో' అని అడిగి నాకు తెచ్చి ఇచ్చేవాడు. రాత్రిళ్ళు పీడకలలు వస్తే, 'భయం వేస్తోందిరా అన్నా...' అంటూ నా బెడ్‌మీదకు వచ్చేవాడు. నన్ను చుట్టుకుని ధైర్యంగా హాయిగా నిద్రపోయేవాడు. చదువుకీ, ఉద్యోగానికీ, చివరికి విహారాలకి జాలీ ట్రిప్ వెళ్ళినప్పుడు నాకోసం ఏదోఒక గిఫ్ట్ తెచ్చి ఇచ్చేవాడు. నేను వాడికోసం ఏంచేశానో నాకు గుర్తులేదు. కానీ నాకోసం వాడు చేసినదంతా బాగా గుర్తుండిపోయింది రేఖా! కానీ అటువంటి మోహన్ ఈరోజు, మృత్యువుకి దగ్గిరవుతూంటే అటు అమ్మ, ఇటు నేనూ ఏమీచేయలేక, చేతకాక, నిస్సహాయులుగా మిగిలిపోయాం" అంటూ రోదిస్తున్న అతణ్ణి ఓదార్చడం ఎలాగో రేఖకి తెలియలేదు.

"హలో డాక్టర్ సింగ్! అయామ్ రేణూ..." రేణూ, డాక్టర్ సింగ్‌కి తనను పరిచయం చేసుకుంది.

"చెప్పండి రేణూ! మీరు నన్నెందుకు చూడాలని అనుకున్నారు?

"మీ పేషెంట్ మిస్టర్ కృష్ణమోహన్ ఫ్రెండ్‌ని నేను. అతన్ని ఒకసారి చూడవచ్చునా? " అడిగింది రేణూ.

"మోహన్ పర్మిషన్ ఇస్తే అలాగే కలవచ్చు అతను ఎవర్నీ చూడాలని అనుకోడు. మదర్, బ్రదర్ మాత్రమే రావడానికి ఒప్పుకున్నాడు. మేముకూడా అందర్నీ ఎలా చేయం. ఎందుకంటే అతడి మానసిక పరిస్థితినిబట్టి, అతడిష్ట ప్రకారం చేస్తాం. మరి మీ గురించి అడగాలి" చెప్పాడు డా.సింగ్.

"అలాగే అడగండి. అంతవరకూ వెయిట్ చేస్తాను" అంది రేణూ. రేణూ పేరు స్లిప్ రాసిచ్చి పంపించాడు డా.సింగ్.

"మోహన్ పొజిషన్ ఎలా వుంది డాక్టర్? " అడిగింది రేణూ.

"వెరీగుడ్" చెప్పాడు డాక్టర్.

"మరి, మీ డాక్టర్స్ గ్రూప్ అతడిమీద చేస్తున్న ప్రయోగాలు ఎంతవరకూ సక్సెస్ అయ్యాయో చెప్తారా? "

"లేదు. మేం అప్పుడే ఎవరికీ చెప్పదల్చుకో

లేదు. అతను మీకెంత దగ్గిరవాడైనా సరే! ఈ ఎక్స్‌పెరిమెంట్స్ ఈనాటివికావు. ఎయిడ్స్ బయట పడినప్పట్నించీ సైంటిస్ట్స్, డాక్టర్స్ అహోరాత్రులు ఫైట్ చేస్తూనేవున్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో సయితం, ఒక నిర్ధారణకు రాలేకపోయారు. రీసెంట్‌గా మన కంట్రీకూడా వారి సరసన చేరి, ప్రయోగాలు చేస్తున్నారు. కాని నాకు ఆశవుంది. ఇంతమంది మేధావులు కృషి ఏనాటికైనా తప్పక ఫలిస్తుందని" చెప్పాడు డాక్టర్.

"చాలు డాక్టర్. మీరామాత్రం ఆశను మానవాళికి కల్పిస్తే అంతకన్నా ఏంకావాలి? కనీసం ముందు తరాలకైనా మేలు జరుగుతుంది"

"అరే, మోహన్‌కి కబురు పంపి గంట గడిచింది. ఏంచేస్తున్నాడు? "అనుకుంటూ డాక్టర్ సింగ్ లేచివెళ్లారు. మరికొద్దిసేపటికి, రేణూని రమ్మని కబురు వచ్చింది. రేణూ లోనికి వెళ్ళింది ఆత్రంగా.

"ఏమండీ మోహన్! నేను మిమ్మల్ని చూడటం ఇష్టంలేదా? చాలాసేపు కూర్చోబెట్టారు..." అతడి బెడ్ దగ్గిరవున్న కుర్చీలో కూర్చుంటూ అడిగింది రేణూ.

"నిజమేనండీ, ఇప్పుడు నాకు ఎవరి అవసరంలేదు. అందుకే దూరంగా వుండాలనుకున్నాను"

"అవసరం అయితేనే స్నేహం చేయాలా? ఇలా ఈ పరిస్థితిలో, ఎవరితోనైనా మాట్లాడాలని, మీ ఆలోచన్లను పంచుకోవాలనీ, అన్పించదా? "

"భవిష్యత్‌లో సాధించాల్సింది ఏమైనా వున్నప్పుడు, ఆలోచన్లను పంచుకోవాలని వుంటుంది. భవిష్యత్ అంటూ లేని నాకు పనికిమాలిన ఆలోచన్లు దేనికి? "

"అంత స్వార్థం పనికిరాదండోయ్! మన వలన పదిమందికి ప్రయోజనం కలిగే అవకాశం వున్నప్పుడు మనిషి నిరంతరమూ కొత్త ఆలోచన్లు చేస్తూనే వుండాలి. నేను, నాకోసం అనే భావన వుండకూడదు. అసలు మనగురించి ఆలోచించనే కూడదు. మీలో ఇంకా నిరాశపోలేదు. మీరు మన స్ఫూర్తిగా డాక్టర్స్‌కి సహకరించండి. మీరు గొప్ప ఉన్నతాశయం కోసం ఈ ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చానని మరచిపోయారా? "

"రేణూ! మీరు ఎంత బాగా మాట్లాడుతున్నారు? మిమ్మల్ని చూస్తే మీరు చెప్పినవన్నీ వింటూంటే నాకు అలా చేయాలనిపిస్తోంది. మీరు ఇక్కడే నాకు తోడుగా వుంటే ఎక్కడలేని ధైర్యమూ వస్తుంది... సారీ... నన్ను నేను మరచిపోయి మాట్లాడుతున్నాను. మీరిక్కడ ఎలా వుంటారు? అసాధ్యం! అర్థంలేకుండా ఆశపడుతున్నాను. ఎక్స్ట్రీమ్లీ సారీ" అపరాధ భావంతో చెప్పాడు మోహన్.

"మీరు సారీ చెప్పాల్సిన పనిలేదు మోహన్. నా మనసులో వున్నమాట చెప్పారు. ఇపుడు నేను వచ్చింది అందుకే. డాక్టర్స్‌తో మాట్లాడి ఇక్కడ మీకు తోడుగా వుండిపోవాలనే" చిరునవ్వుతో చెప్పింది రేణూ.

"ఏమంటున్నారు రేణూ! నిజంగానా... వుండిపోతారా? "

"నిజంగానే! సాధ్యపడితే శాశ్వతంగా వుంటాను. నువ్వు రెస్ట్ తీసుకో. నేను డాక్టర్స్‌తో మాట్లాడి ఏవిషయమూ నీకు చెబుతాను..." అంటూ రేణు వెళ్ళిపోయింది.

మోహన్‌కి నమ్మశక్యం కావడంలేదు. అతడిలో కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది. గతంలో ఆవరించిన నిరాశ మెల్లమెల్లగా మాయమవుతూ వుంది.

రేణూ 'మీరు' బదులు 'నువ్వు' అని ఆత్మీయంగా పిలుస్తుంటే హాయిగా తోచింది.

మరుసటిరోజు ఎప్పుడు వస్తుందో, డాక్టర్స్ అంగీకరిస్తారా అని ఆత్రంగా ఎదురుచూడసాగాడు.

"ఎవరమ్మా నువ్వు? చాలా ప్రమాదకరమైన పట్టుబడుతున్నావే... రక్తసంబంధీ

కులే భయంతో, అసహ్యంతో దూరంగా పారిపోయే వ్యాధి ఈ ఎయిడ్స్. అటువంటిది ఏమాత్రమూ అనుబంధంలేని నువ్వు, కొద్దిపాటి పరిచయంవున్న నువ్వు, ఈ నిర్ణయం తీసుకోవడం ఆశ్చర్యం కలిగిస్తోంది. అసలు నువ్వు అతడికి, మాకూ ఏరకంగా సహాయ పడతావన్నదీ అర్థంకావడంలేదు. అంతేకాదు, నువ్వు నీ ఇష్టంమీద ఇక్కడ వుండిపోవాలనుకున్నా నీ తల్లితండ్రులు, కుటుంబసభ్యులూ అంగీకరిస్తారా? లేనిపోని గొడవలు తీసుకు రావద్దమ్మా! ప్లీజ్! డ్రాప్ దిస్ అయిడియా. లీవ్ దిస్ మేటర్..."

"కావాలంటే వారినుంచి పర్మిషన్ లెటర్ ఇప్పుడే ఫాక్స్ ద్వారా తెప్పిస్తాను. నాకీ అవకాశం ఇవ్వండి. మీ కండిషన్స్‌కి అంగీకరిస్తాను" పట్టుదలగా అంది రేణూ.

"నో...నో... నీకు వచ్చిన మంచి అవకాశాన్ని వుపయోగించుకుని ప్రజాసేవ చెయ్" అంటూ ఇక చెప్పేది ఏమీ లేనట్టు లేచివెళ్లిపోయాడు డా॥సింగ్.

"డాక్టర్! ఎంత చెప్పినా డాక్టర్ సింగ్ నా మాట వినడంలేదు. మీరు కూడా ఒకసారి చెప్పండి. మీరు ఎవరి అనుమతి అయినా తీసుకోండి. నేను మాత్రం ఇక్కడ వుండితీరాలి" దృఢంగా చెప్పింది రేణూ జూ॥డాక్టర్ మధూతో.

మధుకర్ ఎఐఎమ్ఎస్ డైరెక్టర్‌గారికి బంధువు. అందుకే మధుకర్‌ని ఆశ్రయించింది రేణూ.

మధుకర్‌కి డా॥సింగ్ సీనియర్ కూడా. అందుకే అటునుంచి రావాలి అనుకుంది. మొదట మధుకర్ కూడా వారించాలని చూశాడు. కాని రేణూ పట్టు విడవలేదు. డైరక్టర్ ఆఫీస్ దగ్గర నిరాహారదీక్ష చేస్తానంది. కావాలంటే ఇంకా పలుకుబడి వున్న మినిస్టర్‌గారి ద్వారా పర్మిషన్ తెచ్చుకుంటానంది. నా స్వంత పూచీమీదనే ఏ రిస్క్ అయినా భరిస్తానంది. మీ డాక్టర్స్‌కిగానీ ఇన్‌స్టిట్యూట్‌గానీ నా వలన ఇబ్బందులు రావని మాట ఇచ్చింది. చివరికి సాధించింది. వాళ్లకి అర్థం కానిది ఒక్కటే! ఈ అమ్మాయి ఏం సాధించాలని ఇంత ప్రయాస పడుతోంది? బంగారంలాటి భవిష్యత్ వుంది. అత్యుత్తమ స్థాయి సివిల్ సర్వీసెస్‌లో సెలక్ట్ అయింది. పదిమందిని శాసించగల అధికారం స్వంతం అవుతుంది. ఆరోగ్యంగా, అందంగా వుంది. కావలసిన బంధువర్గమంతా వున్నారు. ఒక అనామకుడికోసం అదీ మరణం తప్పని అభాగ్యుడి కోసం ఎందుకింత పట్టుపట్టిందా అన్నదే!

రెండురోజుల తర్వాత గుడ్‌న్యూసంటూ మోహన్‌కి జరిగినదంతా వివరంగా చెప్పిన రేణూని అతను కూడా సరిగ్గా అదే ప్రశ్న అడిగాడు.

"కొన్నింటికి సరియైన సమాధానం సూటిగా చెప్పలేం. అలా అని నీ మీద నాకేలాటి ప్రేమా లేదు. నీ మనసుకి ఆనందం కలిగించాలనే కోరిక ఒక్కటే. నాకు అడ్వంచర్స్ చేయడం చాలా ఇష్టం. అలా అని కళ్లు మూసుకుని కారు డ్రైవ్ చేయడం, నిప్పులమీద నడవడం, గిన్నిస్‌బుక్‌లో నా పేరు చూసుకోవడం లాటివికాదు. వాటివలన రెండో వాళ్లకి ఏమీ ఉపయోగంలేదు. సహాయం చేయడమూ కాదుకనుక. ఇదిగో ఇలాంటి ఛాలెంజ్ చేయాలి. ఇదే నా ఆదర్శం. అందుకు నా పేరెంట్స్, బ్రదర్స్ సహకరిస్తూ వచ్చారు. చాలు, అది చాలు" అంది రేణూ.

"అయితే నీ ఖర్మ. చెప్పినా వినని మొండివి. సరే ఏం సాధిస్తావో నేనూ చూస్తాను" అన్నాడు మోహన్ సరెండర్ అయిపోతూ.

"మోహన్ అసలు నీకీ హెచ్ఐవి సోకినట్టు ఎలా తెలిసిందీ? ఎప్పుడు తెలిసిందీ? చెప్పు" అతడి చేతిని తన చేతిలోకి తీసుకుని లాలనగా అడిగింది రేణూ.

"ఇంత అభిమానంగా అడిగిన దానివి

నువ్వే. మరెవరూ నా గురించి పట్టించుకోలేదు. ద్వేషిస్తూ వచ్చారే తప్ప" అన్నాడు బాధగా మోహన్.

"అది ద్వేషం కాకపోవచ్చు. తెలుసుకునీ చేసేదిలేక అయివుండచ్చు. ఇప్పుడు అడుగుతున్నాను చెప్పు"

"నన్ను గురించి చెప్పుకోవాలంటే నాకే సిగ్గుగా వుంది. చెప్పగల గొప్ప విషయమా? అదే కాకుండా రేఖకి కూడా హాని తలపెట్టాను. ఇంట్లో వాళ్లకి మనశ్శాంతి లేకుండా చేశాను. పిచ్చివాడిలా ప్రవర్తించాను" తల దించుకుని చెప్పాడు మోహన్.

"లేదు అప్పటిస్థితిలో నువ్వు చేసింది తప్పుకాదు. అయితే రేఖ విషయంలో మాత్రం నిన్ను క్షమించలేను" నిస్సంకోచంగా చెప్పింది రేణూ.

"అవును రేఖను ఇష్టపడటంవలన ఆ



దారుణానికి సిద్ధమయ్యాను. సరే నాకు గుర్తున్నంతవరకూ అమ్మాయిలతో విచ్చలవిడిగా తిరిగినందువలన హెచ్ఐవి బారిన పడ్డానని నేను అనుకోను. జరిగిందంతా ఏమిటసలు అని అడిగావు కనుక చెబుతాను. ఓవర్ డ్రింకింగ్ వలన నా లివర్ డామేజ్ అయింది. కిడ్నీ ఫెయిల్యూర్ అయింది. డయాలసిస్ చేయించుకున్నాను. అప్పుడే ఏదో పొరబాటు జరిగిందని నా అనుమానం"

"నీకు ప్రాణం ఇచ్చే తల్లి వున్నారు. అన్న వున్నారు. అంతులేని సంపద వుంది. ఎవరికీ చెప్పకుండా ఎక్కడో దూరంగా ఎవరి ఆసరా కోరకుండా నీ అంతట నువ్వు ట్రీట్మెంట్ ఎలా తీసుకున్నావ్? "

"నువ్వే చెప్పావుగా! సంపద.. అంతులేని సంపద నన్ను లోబరుచుకుంది. పదిమందీ ఆ డబ్బు కోసమే నన్ను ఆశ్రయించారు. వాళ్లే అవసరాలు తీర్చుకోడానికి ఇంద్రుడివీ చంద్రుడివీ అన్నారు. ఆడవాళ్ల సాంగత్యంలోకి మళ్లించారు. లివర్ డామేజ్ అయ్యాక తీసుకెళ్లి హాస్పటల్‌కి అప్పగించారు"

"మీ నాన్నగారి హోదా, సంపదా తెలిసినవారు నిన్ను వారి కుమారుడిగా గుర్తించలేదా? మీ అమ్మగారికి కబురు చేయలేదా? "

"లేదు. నాన్నగారు ఎక్కడో మారుమూల జమిందార్ అయితే, యు.పి బెంగాల్, ఎం.పిలోనో ఎలా తెలుస్తుంది? నేను తిరిగినదంతా ఈ చుట్టుపక్కల దరిదాపుల్లో లేకుండా! అంతదాకా ఎందుకు రేఖ నాన్నగారికే తెలియలేదు. సంపద అందరికీ అచ్చిరాదు. కొందరికి వద్దన్నా వృద్ధిచెందుతుంది. కొందర్ని సమూలంగా నాశనం చేస్తుంది. ఆ నాశనానికి కారణమూ రకరకాలుగా వుంటుంది. దానధర్మాలు చేసినందువలనా, నానా దుర్వసనాలకు లోనుకావడం వగైరాలుగా.

"రేణూ! నువ్విప్పుడు నాకు ఆప్తురాలివి. అందుకని నిజం చెబుతున్నా నాలో అనారోగ్య లక్షణాలు బయటపడ్డాక డాక్టర్స్ నా రహస్యాన్ని బయటపెట్టాక, నేను ఏ స్త్రీ జోలికీ పోలేదు. నమ్ముతావా? అంటే నేను వ్యాధిబారిన పడిన తర్వాత తెలిసీ ఎవరికీ అపకారం చేయలేదు.

మరి రేఖని ఎందుకు కోరుకున్నానో నాకే అర్థం కాదు. అది నేను తెలిసీ చేసిన పెద్ద తప్పు. అదృష్టవశాత్తు తప్పిపోయింది. ప్లీజ్ రేణూ ఆ విషయం మరిచిపోదాం"

"రేఖ నిన్ను ఎంతగానో ఆకర్షించింది. ఆ ఆకర్షణ నుంచి తప్పుకోలేక నిజం దాచాలనుకున్నావ్. అలా దాచినందువలన ఎంతటి నష్టం జరిగిపోయేదో ఆలోచించలేదు. తొందరపాటు నిర్ణయాలు జీవితకాలం వేధిస్తాయ్. అంతేకాక వ్యాధికన్నా ఎక్కువగా నరకయాతన సృష్టిస్తాయి. మరి ఇక ఆ ప్రసక్తి తీసుకు రావద్దు కానీ నువ్వు ఈ వ్యాధికి కారణం నీకు హాస్పిటల్లో జరిగిన డయాలసిస్ అంటున్నావ్. అలా అయితే తప్పు నీది కాదు. అయితే బాధితుడివి కనుక మరెవరికీ నీ వలన వ్యాప్తిచెందకుండా జాగ్రత్త తీసుకోవాలి. అందుకే నీకు వివాహం నిషేధించబడింది. నీవంటి చదువుకున్నవారు, ఆదర్శవంతులు, వివేకవంతులూ ఈ హెచ్ఐవి నిరోధించడానికి మార్గం కనిపెట్టాలి. అందుకే నీమీద ఎక్స్‌పెరిమెంట్స్ జరపటానికి స్పెసిమన్‌గా మారావు. ఇది కూడా మంచిపని. నేను డాక్టర్‌తో మాట్లాడాను. వారు కూడా ఆశాజనకంగానే చెప్పారు"

మోహన్ మాట్లాడలేదు. రేణూ అతడి రూమ్ తలుపులు దగ్గరగావేసి డాక్టర్ మధుకర్ రూమ్‌కి వచ్చింది.

"హలో రేణూ! నువ్వు వచ్చి వారం రోజులైంది. ఎలా ఫీలవుతున్నావ్" అడిగాడు మధుకర్.

"తెలిసే వచ్చానుకదా డాక్టర్. మోహన్‌కి

నాతో మాట్లాడటం సంతోషంగానే కనిపిస్తోంది. అయితే అతడికి కుటుంబ విషయాలు మాట్లాడడం నచ్చదు. అది అంత అవసరమూ కాదనుకోండి. అతడికి ఉత్సాహాన్ని కలిగించే ప్రయత్నం చేస్తున్నాను.

డాక్టర్ నేనొక ప్రశ్న అడుగుతాను. అలా అడగటం తప్పయితే నిస్సందేహంగా మందలించండి. అర్థంలేనిదయితే చీవాట్లు పెట్టండి"

"అడుగు రేణూ! నువ్వు ప్రొఫెషనల్ డాక్టర్‌వి కాదు. మెడికల్ కోర్స్ చేయలేదు. ట్రీట్‌మెంట్ లేని ఒక భయంకర వ్యాధిని రూపుమాపడానికి నీ శక్తినంతా ధారపోయడానికి సిద్ధపడ్డావ్. ప్రతి ఒక్కరికీ నీవంటి ఆలోచనే వుంటే ఏ వ్యాధికైనా పరిష్కారం లభిస్తుంది. నీకెలాటి ఆలోచన్లు వున్నా చెప్పు. అవి మన పరిశోధనలకు చేయూతనిస్తాయి" అన్నాడు మధుకర్.

"డాక్టర్! ప్రజలు ఒక వ్యాధి గురించి తెలిసినప్పుడు కొత్తలో భయపడతారు. అందులోనూ మరణమే తప్ప నివారణ లేదని తెలిసినప్పుడు వణికిపోతాడు. ఆ వ్యాధి రాకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలో తెలుసుకుని అతి జాగ్రత్తకు లోనవుతాడు. క్రమంగా తెలిసో, తెలియకో ఇతరుల కారణంగా వ్యాధికి గురి అయినప్పుడు అతడిలో ఒక రకమైన తెగింపు కలుగుతుంది. లేదా చనిపోతే చనిపోతాం ఆనందాన్ని వదులుకోలేననుకునీ అలవాటు పడిపోతాడు. నిర్లక్ష్యంగా మారిపోతాడు. అదే ప్రమాదకరం. స్వయంకృతాపరాధం వలన అంటే సెక్స్ కారణంగా ఎయిడ్స్‌కి లోనైతే భార్యకు దూరంగా వుండి తన కారణంగా అన్నెం పున్నెం ఎరుగని మరో స్త్రీ గర్భవతి అయితే పుట్టబోయే బిడ్డకూ వ్యాధిని వ్యాపించకుండా చేయాలి. కానీ అలా చేయడంలేదు. అందుకు కారణం తనకు వ్యాధి వుందో లేదో తెలియకపోవడం, భార్య మీద చులకన భావం. సాధారణంగా ఇలా చేసేవారు కింది తరగతి ప్రజలు. లారీ, ట్రక్ డ్రైవర్లు, దూరాభారాలకు వెడుతూండటంవలన చాలాకాలం భార్యకు దూరంగా వుండటంవలన వచ్చే అనర్థాలు, అతడా మనిషికి కలిగే కోరిక కారణమేకదా! వ్యాధి లేనివారి గురించి తెలియదు. తెలిసిన తర్వాత వారిలో కోరికలు కలగకుండా చేసినట్టైతే మరొకరికి వ్యాపించే ప్రమాదం తప్పుతుందని నా ఆలోచన"

"రేణూ! నువ్వు చెప్పేది ఆలోచించదగ్గ విషయమే కానీ వారికి వ్యాధి వుందని తెలిసేలోగా మరికొందరికి వ్యాపిస్తుంది. పోనీ కొంత వరకూ అరికట్టవచ్చు అనుకున్నా ఎయిడ్స్ వచ్చిన వాళ్లు బైటకి చెప్పరు. ఒకవేళ తెలిసి నువ్వు చెప్పినా సెక్స్ సంబంధంపట్ల ఇంట్రస్ట్ కలగకుండా చేయడానికి మందులు వాడటానికి సిద్ధపడతారా? సంజయ్‌గాంధీ ఎమర్జన్సీలో బలవంతాన ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్స్ చేయించినట్టు చేయాలేమో అని నవ్వి, రేణూ! నీ ఆవేదన నాకు అర్థమైంది. వయసు మళ్లిన వ్యక్తిలో ఉత్తేజాన్ని కలిగించే వయాగ్రాని ప్రయోగించినప్పుడు ఒక ప్రాణాంతకమైన వ్యాధి రూపుమాపడానికి బలహీనత కలగచేసే ఔషధాన్ని ప్రయోగించడం తప్పుకాదని అనుకుంటున్నావ్. నీ సలహా ఆచరణలో ఎంతవరకూ సాధ్యమో ప్రయత్నం చేయాలి. మరికొందరు డాక్టర్స్‌తో చర్చించి చూద్దాం" అన్నాడు మధుకర్.

"డాక్టర్! నా ఆలోచనకు అందరూ నవ్వుకుంటారేమో. ప్లీజ్ నా పేరు మాత్రం ఎవరికీ చెప్పకండి. నేను వచ్చిందేమో మోహన్‌కి తోడుగా వుండటానికి. వెళ్లొస్తాను డాక్టర్" అంది రేణు.

★ ★ ★

"రేణూ! నువ్వు చేస్తున్న పనేమిటి? ఉద్యోగం మానుకుని మోహన్ దగ్గర హాస్పిటల్లో వుంటావా?" ఆశ్చర్యగా అడిగింది రేఖ.

"అవును రేఖా! నా గురించి నీకు తెలుసుగా ఒకసారి ఏదైనా చేయాలని అనుకుంటే చేసి తీరుతానని" చెప్పింది రేఖ.

"కానీ ఈ నిర్ణయం అన్నిటిలా కాదు. ప్రయోజనం లేనిదీ, వృధాప్రయాస. మీ పేరెంట్స్‌కి తెలిస్తే ఎంత బాధపడతారు? వాళ్లకి ఒక్క కూతురివి. పెళ్లి మానుకున్నావ్. ప్రజాసేవ చేయాలంటూ సివిల్ సర్వీసెస్‌లో చేరావ్. అంతలో ఏమైంది? ఆ రోజు నీకు నా ఇంటి ఫోన్‌నంబర్ ఇచ్చి పొరబాటు చేశాను. లేకుంటే మా ఇంటికి వచ్చేదానివి కాదు. నా గతం తెలిసేదీ కాదు. మనం జీవితంలో మళ్లీ ఏనాడూ కలిసేవాళ్లమూ కాదు. నీ భవిష్యత్ నాశనం అవకపోను" బాధగా అంది రేఖ.

నువ్వు చెప్పిందేమీ జరిగేది కాదులే. కావాలనుకుంటే ప్రయత్నం చేస్తే మీ నాన్నగార్ని కలుసుకుని నీ గురించి తెలుసుకునే దాన్ని. ఇప్పుడేమంత మునిగిపోయిందనీ నీ బాధ? "

"కాదామరి! మోహన్ తిరిగి మామూలు మనిషి అయ్యే అవకాశమేవుంటే అత్తయ్య, అరుణ్ ఊరుకునేవారా? "

"నిజమే! వారికి సంపద వుంది. ఏ దేశంలో డాక్టర్ దగ్గరకైనా తీసుకెళ్లగల కెపాసిటీ వుంది. ప్రేమాభిమానాలూ వున్నాయ్. అందులో ఏ ఒక్కటీ నాకు లేని మాట నిజమే. వారు చేయగలిగింది చేశారు. నీకు జీవితాన్నిచ్చారు. జరిగిన పొరబాటును దిద్దుకున్నారు. అది వారి హృదయవైశాల్యాన్ని, మంచితనాన్నీ తెలియ చేసింది. నాది అర్థంలేని ఆలోచనో, పనికి మాలిన అభిప్రాయమో, నిష్ఫలంకాగల ప్రయత్నమో ఏదైనా కానీ నేనిది సవాల్‌గా తీసుకున్నాను. నేనసలు డాక్టర్‌ని కావలసింది. అమ్మనాన్న చదివిస్తామన్నారు. కానీ నాకెందుకో దృష్టి అటు పోలేదు. నాది సైన్స్ సబ్జక్ట్. సైన్స్ అంటే ఇంట్రస్ట్ వుంది. నేనక్కడే రాంగ్‌స్టెప్ వేశానని తెలుసుకున్నాను. అయితే ఇప్పుడు నష్టపోయేది ఏదీలేదు.

మహామహులెందరో తాము చదివిన చదువుతో సంబంధం లేకుండా, లోకకల్యాణార్థం ఎన్నో కనిపెట్టారు. అసలు చదువే లేని వారిక్కూడా ఏదో ఒక మహత్కార్యం సాధించగల ఆలోచనలు వచ్చాయి. కాబట్టి చదువుతో సంబంధమే లేదు. ప్లీజ్ రేఖా! నాకు కోఆపరేట్ చెయ్. ఛాలెంజ్ చేసి అనుకున్నది సాధించినప్పుడు కలిగే తృప్తి దేనికీ సాటిరాదు. పెళ్లి, సంసారం, జీవితం ముగిసిపోవడం, ఏమీ లేకుండా అతి మామూలుగా జీవితాన్ని యంత్రంలా గడిపేయడం నాకు నచ్చనిది. అలా అని అందరూ నాలాగే వుండాలనీ చెప్పను. నా ధ్యేయం వేరు. నాకొక అవకాశం లభించింది. అదీ నీవలన అయినందుకు చాలా ఆనందంగా వుంది. నువ్వు నమ్మినా, నమ్మకపోయినా విచారించినా నాకు హెల్ప్ చేశావనే భావిస్తున్నాను... రేఖా" అంది రేణూ ఉద్వేగంతో

"నీ మనసు ఎవరికీ అందనంత ఎత్తుకి ఎదిగిపోయిందే రేణూ. నీ ఆశయం సక్సెస్ కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. నీ ప్రయత్నం ఫలిస్తుంది. నీ వలన సర్వ మానవాళికీ మహోపకారం జరుగుతుంది. నువ్వు ఏ బాధలు పడాల్సివస్తుందో నీ ఆరోగ్యం పాడవుతుందేమో అనే ఆందోళనతో వారించాలని చూశానేకానీ మరో కారణం కాదు" అంది రేఖ.

"నన్ను మంగళ గారికి పరిచయం చెయ్. ఇంతదాకా ఆవిడను చూసే అవకాశమే కలగలేదు" అంది రేణూ.

"నువ్వు చూడలేదుగానీ నీ గురించి అంతా చెప్పాను. ఇలారా ఆవిడ రూమ్‌లోకి వెడదాం" అంటూ తీసికెళ్లింది రేఖ.

"అత్తయ్యగారూ, నా ఫ్రెండ్ రేణూ! మిమ్మల్ని చూడాలనుకుంది" అంటూ పరిచయం చేసింది రేఖ.

"రేణూ, రామ్మా! నీ గురించి అంతా విన్నాను. వయసులో చిన్న అయినా ఆశయసాధనలో నువ్వు చాలా ఎదిగిపోయావు. నీ ముందు మేము చాలా అల్పులం" మంగళ ప్రేమగా చెప్పింది.

"నన్ను అంతగా ఆకాశానికి ఎత్తేయకండి మంగళాదేవీ. నేను అతి సామాన్యురాల్ని" వినయంగా చెప్పింది రేణూ.

"నువ్వు అలా అనడంలోనే నీ వినయ, విధేయతలు కనబడుతున్నాయ్. ఒకప్పుడు మోహన్ చేసే పన్లు భరించలేక కన్నతల్లినై వుండీ వీడికి భగవంతుడు త్వరగా ముక్తి కలిగించాలని కోరుకున్నాను. నన్ను చూస్తే అసహ్యంగా వుందా రేణూ"

"ఛ అలా అనకండి. మాతృమూర్తి ప్రేమించినా, ద్వేషించినా ఒక్కటే. మానవ సహజమైన బాధతో ఓర్పు నశించినప్పుడు ఏమనుకున్నా తప్పుకాదు. మీ బిడ్డ మీకు ఎన్నటికీ శత్రువు కాదు. ఆప్తుడే! నాకు తెలుసు మంగళగారూ. మా అమ్మానాన్నలు వారి మాట కాదన్నప్పుడు కోపగించుకోరా? ఆ తర్వాత నన్ను అర్థం చేసుకోరా అలాటిదే"

"ఇన్ని తెలిసిన నువ్వు అమ్మగారు మెచ్చే పని చేయలేవా? " అంది మంగళ.

"చేస్తాను. విచిత్రం! మెచ్చేపని చేసినప్పటి ఆనందంకంటే మెచ్చని పనిచేసిన కోపం ఎక్కువ కదండీ. కోపంలో ముందు కలిగిన ఆనందం హరించుకుపోతుంది. మీకు చెప్పగలదాన్నా? మీరు జీవితంలో చాలా అనుభవాలు గడించారుకదా!"

"రేణూ! నువ్వు మామూలు ఆడపిల్లవి కాదు. లేకుంటే ఏమీ తెలియని మోహన్ పట్ల నీకెందుకు జాలికలిగింది? ఎంతో గొప్ప ఉద్యోగం వదిలిపెట్టి ఒక నిర్భాగ్యుడి కోసం ఇంతటి త్యాగం చేస్తావా? "

"ఇది త్యాగం కాదండీ! ఒకరకంగా నాకు లభించే కీర్తికోసమే ఇలా చేస్తున్నానేమో అనుకోండి"

"ఛ... నీ గురించి అలా అనుకుంటే అంతకన్నా మహా పాపం లేదు. కీర్తి, ప్రతిష్టలు సునాయాసంగా వాటంతగా వచ్చే కలక్టర్ ఉద్యోగం మానుకున్న దానివి. ఒక ఎయిడ్స్ రోగికి సేవలు చేయడానికి కోరి వచ్చావని ఇట్టే గ్రహించుకుంటారు"

"అదంతా మీకు నా మీద వున్న అభిమానం. మరి నేను వెళ్లి వస్తానండీ"

రేణూ రెండుచేతులూ కళ్లకద్దుకుని, గుండెలకు హత్తుకుంది మంగళ కన్నీళ్ళతో.

"ఇదేంపనండీ మంగళగారూ! మీరు చాలా పెద్దవారు... ఇలాటి పని చేయకూడదు" వారించింది రేణూ.

"రేణూ! నువ్వు సామాన్యురాలివికాదు. దేవతామూర్తివి. నేను రోజూ పూజించే పార్వతీదేవివి. నీ రుణం తీర్చుకోలేనిది"

"అలా అనకండి, మీ కుటుంబంలో నేనూ ఒక సభ్యురాల్ని అనుకోండి చాలు" అంటూ రేణూ హాస్పిటల్‌వైపు బయలుదేరింది.

రేణూకి ప్రత్యేకించి తన క్వార్టర్‌లోనే బస ఏర్పాటుచేశాడు మధుకర్.

"వద్దండీ! నాకు వేరే రెండుగదుల పోర్షన్ చాలు. కొద్దిరోజుల తర్వాత అమ్మానాన్నలను ఇక్కడికే తీసుకువస్తాను" అంది రేణూ.

"అందాకా వుండు రేణూ! అలా మొహమాటపడకు" అన్నాడు మధుకర్.

మధుకర్, భార్యా ఇద్దరే వుంటారు. నాలుగు బెడ్‌రూమ్స్ వున్న క్వార్టర్ అది. అందుకే రేణూని వుండమని ఆఫర్ చేశాడు. కాదనలేకపోయింది రేణూ.

"మోహన్! మీ మదర్‌ని చూసివచ్చాను" చెప్పింది రేణూ.

"ఎలా వున్నారు?

"దిగులుతో, బాధతో, నిర్లిప్తంగా రోజులు గడుపుతూ వున్నారు"

"అంతేకదా! ఏదోఒకరోజు నా డెత్ న్యూస్ వింటామని వాళ్లకి తెలుసు. ఇక బాధ ఎందుకు? అదెంత త్వరగా వినగలి

గితే అంతమంచిదని కూడా అనుకుని వుండచ్చు"

"అంత కఠినంగా మాట్లాడకు మోహన్. అలా ఎందుకు అనుకోవాలి! ఏదో ఒక అద్భుతం జరిగి, ఈ హెచ్ఐవికి డ్రగ్ కని పెట్టి, మోహన్ మామూలు మనిషి అవుతా డని ఎదురుచూస్తున్నారని అనుకోవచ్చు కదా"

"వద్దు రేణూ! నావాళ్లను గురించి నేనిక ఆలోచించదల్చుకోలేదు. ఇంకేదైనా మాట్లాడు. నువ్వు ఎవర్ని చూసివచ్చినా నాతో చెప్పవద్దు"

"మోహన్! నీకు నచ్చిన విషయాలే మాట్లాడుకుందాం. నువ్వు దేవుణ్ణి నమ్ము తావా? నమ్మినవారికి ఏదో ఒక పరి ష్కారం లభించగలదనే ఆశవుందా? "

"మంచి ప్రశ్న అడిగావ్. నమ్మకానికి మూలం స్వార్థం! అంటే, దేవుడా, నేను పరీక్ష పాసైతే నీకు అభిషేకం చేయిస్తా ననో, లేకుంటే మరో లంచం ఇస్తాననో మొక్కుకుంటాడు విద్యార్థి.

కొడుక్కి ఆరోగ్యం బాగుపడాలని తల్లి, ఇల్లు కట్టుకోవాలని భార్య, మంచి ఉద్యోగం రావాలనీ కార్లలో తిరుగుతూ, పనివాళ్ళతో సేవలు చేయించుకోవాలని తండ్రీ, నాకు ఎక్కువకట్నం ఇచ్చి, మంచిమొగుణ్ణి తేవా లని చెల్లి, అంతరిక్షంలో చదువుకి పంపిం చాలని తమ్ముడూ, ఇలా కోరికలతో, స్వార్థ పూరితంగా మొక్కులు మొక్కుకుంటారు. తప్పితే నాకు మంచిమార్గంలో నడిచే నైతిక బలాన్ని కలిగించమని కోరుకోరు. పేదలను ఆదుకోవాలనీ, అందుకు మంచిమనసు ఇమ్మనీ, అర్హులైనవారికి సేవచేయగల ఔదా ర్యాన్ని ఇవ్వమనీ ఎందుకు కోరుకోరు? నాకు అసలా ఆలోచనలే రావు. ఇక భగ వంతుణ్ని నమ్మడం, నమ్మకపోవడం అనే ప్రసక్తిలేదు" అన్నాడు మోహన్.



"సరిగ్గా నేనూ నీలాగే ఆలోచిస్తాను మోహన్. దేవుడనేవాడు వున్నాడా లేడా? అని ఆలోచన అసలు ఎందుకు? మంచిమా ర్గంలో నడుస్తూ, చేతనైనంత పరోపకారం చేయడంలోనే భగవంతుడు వున్నాడు. వేరే అన్వేషణ అవసరంలేదు. ఈమధ్య అర్థంలేని మూఢభక్తి పెరిగిపోయింది. ఎక్కడాలేని దేవుళ్ళు పుట్టుకొస్తున్నారు. ఒక్కోదేవుడికి ఒక్కో నియమం, దీక్ష, వ్రతం అంటూ ఒకటే పబ్లిసిటీ ఇస్తున్నారు. అసలే మనదేశంలో సవాలక్ష కులమత బేధాలు. దానికితోడు ఎందరో దేవుళ్ళు. పురాణ గ్రంథాలలోని మహర్షులను కూడా బయటికి తెచ్చి వారికీ దేవాలయాలు, నియమనిష్టలూ ఏర్పరచి ప్రదర్శనకు పెట్టడం ఒకటే మిగిలింది. అదీ ఏదోరోజు వస్తుందేమో! ఏమతం చెప్పినా, ఒక్కటే సూత్రమని గ్రహించుకుంటే ఇన్నిర కాల విగ్రహారాధన అవసరమా? నువ్వు చెప్పిన మంచిపని, పరోపకారబుద్ధీ, ఆప న్నులను ఆదుకోవడం, అందరినీ సమానభా వంతో చూడటం, సర్వమానవ సౌభాతృత్వం కలిగివుండమనే కదా ఒక జీసస్, అల్లా, రాముడూ చెప్పారు. మానవసేవలోనే భగ వంతుడూ వున్నాడని నేను నమ్ముతాను.

అలాకాక ధనంకోసం లక్ష్మీదేవిని, మరో కోరిక తీర్చడానికి వెంకటేశ్వరుడు, చదువు కోసం సరస్వతినీ పూజించాలనడం మళ్ళీ వర్గబేధాన్ని సృష్టించదా?

ఇటీవల బాసర సరస్వతీదేవిని పూజించి నవారికి చదువు వచ్చేస్తుందనే ప్రచారం ప్రారంభమయింది. ఒక జ్ఞానంరాని పదేళ్ల పిల్లవాడిని టెంపుల్ కి తీసుకెళ్ళి, 'ఒరేయ్ బాబూ! ఎప్పుడూ ఈ సరస్వతీ దేవిని పూజిస్తే నీకు చదువు బాగా వస్తుంది, ప్రతీ సంవత్సరం ఈ దేవాలయానికి వచ్చి దర్శనం చేసుకుందాం. సరస్వతి ఆశీస్సు లతో నీకు మంచి మార్కులు వస్తాయి. నువ్వు కోరుకున్న కోర్సులో సీటు వస్తుంది. కనుక ఎప్పుడూ ఈ దేవతనే పూజించు. స్మరించుకో' అని నూరిపోస్తే, ఆ వయసులో

పిల్లవాడికి ఓస్ ఇంతేనా ప్రతీపనికీ ముందు ఏదో ఒక దేవుడిపేరు తల్చుకుంటే చాలన్న మాట అనేభావం ఏర్పడిపోతుంది. ఇంతకు ముందు చదువులు వచ్చినవారంతా ఇలాచేయకుండా చదువుకోలేదా? ఇక వారి వ్యక్తిగత మేధస్సు ఏమైనట్టు? మేధస్సుకి కారణం జీన్స్. పూర్తిగా దేవుడిమీద భారం వేయడం మంచిదా?

కొందరు ఏ పనిచేసినా 'అంతా ఆ భగవంతుడి ఆదేశం ప్రకారమే జరుగుతుంది. మనం అలా చూస్తూ వుండటమే! అంతా ఆపైవాడే చూసుకుంటాడనో, లేకపోతే తాము నమ్మిన బాబా, గురువో మన సమస్యలూ, బాధ్యతలూ సునాయాసంగా తీర్చేస్తాడనో అనుకుంటూ చేయాల్సిన కృషి చేయరు. ఇటువంటి నమ్మకాల వలన అభివృద్ధి ఎలా సాధ్యమవుతుంది? మరీ అధ్వాన్నం అవుతుంది.

విచిత్రం! మళ్ళీ ప్రాంతాలవారీగా నమ్మకాలుంటాయి. అమావాస్య ఒకరికి చాలా చెడ్డది. ప్రాణాంతకం! కానీ అదే అమావాస్య తిథి, మరోప్రాంతంవారికి అత్యంత విలువైనది. శుభప్రదమైనదీను. అలాగే గృహవాస్తు. ఇరవై ఏళ్ళు ఒకే ఇంట్లో వుండి ఆ తర్వాత ఏదో జరిగిందని వాస్తు మంచిదికాదు, మార్చాలి! అని ఎవరైనా చెబితే సమూలంగా ఆ ఇంటిని కూల్చివేసే బలహీన మనస్కులున్నారు. జీవితంలో కష్ట-సుఖాలు, మంచి-చెడ్డలు, సంతోషం-విచారణ, అభివృద్ధి-పతనం అనేవి శాశ్వతాలుకావనీ, రెండూ కలగలసిన జీవిత సత్యాలని ఎందుకు తెలుసుకోరు? " ఆవేశంతో చెప్పింది రేణూ.

రేణూ! నువ్వు చాలా ఆలోచిస్తావ్. అదీ రీజన్‌బుల్‌గా. నాకంటే చిన్న అయినా, విజ్ఞానంలో చాలా ఎత్తుకు ఎదిగిపోయావు. నీలాటి మంచి విలువైన ఫ్రెండ్ ఎప్పుడో నాకు కనిపించి వుంటే..." మోహన్ కళ్ళలో తడి మెరిసింది.

రేణూ చప్పున లేచివచ్చి ఆ తడికళ్ళను ఒత్తింది. అతడ్ని దగ్గిరగా తీసుకుని, "మోహన్! వద్దు. నువ్విలా వీక్ అవద్దు. ఇప్పటికైనా నిన్ను నువ్వు తెలుసుకున్నావ్. నీలో పరివర్తన కలిగింది. తప్పు అనుకున్నది, సరిదిద్దుకున్నావ్" అంటూ ఓదార్చింది.

"ఏంలాభం రేణూ! జీవితం అంతా ముగింపుకి వచ్చాక ఏం తెలుసుకుని ప్రయోజనం...? "

"అవును. ఒకరకంగా నీకు ప్రయోజనం లేకపోవచ్చు. నీ వలన మాత్రం ఎందరికో ఉపయోగం కలిగింది కదా? నీ గురించి తెలుసుకున్న తర్వాత మరే అమ్మాయితో ఎటాచ్‌మెంట్ పెట్టుకోలేదూ అంటే అది మంచే కదూ? "

"మోహన్! డా. సింగ్, మధుకర్ వస్తున్నారు..." నర్స్ వచ్చి చెప్పింది. మరో పది నిముషాల్లో డాక్టర్స్ ఇద్దరూ వచ్చారు.

"మోహన్! ఈరోజు నీకు కొన్ని ఇంజక్షన్స్ చేయాలని అనుకుంటున్నాం..." అన్నాడు డా. సింగ్.

"అయామ్‌రెడీ డాక్టర్" మోహన్ చెప్పాడు.

"వెరీగుడ్! హౌ ఆర్‌యు రేణూ? " రేణూని పలకరించాడు సింగ్.

"గుడ్. థ్యాంక్యూ డాక్టర్" చెప్పింది రేణూ.

డా. మధుకర్, మోహన్‌కి ఇంజక్షన్స్ చేస్తూంటే, రేణూతో డా. సింగ్ చెప్పసాగాడు.

"రేణూ! ఈ ఇంజక్షన్ వలన మోహన్‌లో రకరకాల ఫీలింగ్స్ వస్తాయి.

వాటివలన అతడి బిహేవియర్‌లో వచ్చే మార్పును నువ్వు శ్రద్ధగా గమనించి పేపర్ మీద నోట్‌చెయ్. ఇదే నీకిచ్చే వర్క్"

"ఓ.కె. డాక్టర్" అంది రేణూ.

"నువ్విప్పుడు ఈ రూమ్ వదిలి రావద్దు. ఇదిగో ఈ స్పెషల్ డ్రస్ వేసుకో. దీన్ని

ప్రత్యేకమైన కెమికల్స్‌తో తయారుచేశాం. నీకు ఏరకమైన ఇన్‌ఫెక్షన్ రాకుండా. అంతే కాదు, నువ్వు ఇప్పుడు చాలా జాగ్రత్తగా వుండాలి. అతడిలో మార్పు తీవ్రంగా అని పిస్తే నాకు కాల్‌చెయ్. అప్పుడు కంట్రోల్ చేసే ఇంజక్షన్స్ చేయాల్సివుంటుంది. వాటిని నీకు రెడీగా వుంచుతాను. అతను ఎమోషనల్‌గా మారితే నువ్వు ఏమా త్రమూ జాలిపడరాదు. తప్పనిసరి అయి తేనే అతడ్ని టచ్ చేయాల్సి వుంటుంది. ఈ ట్రీట్‌మెంట్‌లో అతిముఖ్యమైన ఎక్స్‌పెరి మెంట్ ఇది. వివరంగా చెబుతాను విను.

అతడిలో ఒకసారి చాలా తీవ్రమైన సెక్స్ కోరికలు కలగవచ్చు. మరోసారి చచ్చిపోవా లనిపించే ఆలోచన, అంటే సూసైడ్ థింకింగ్ రావచ్చు. మరోసారి చలనం లేనట్టు బిగిసిపోయి ఆల్ మోస్ట్ మమ్మీ స్టేజ్‌లో వుండవచ్చు. ఇవేమీ కాకుండా అత డిలో రాక్షసబలం రావచ్చు. ఆ టైమ్‌లో ఏదైనా చేయవచ్చు. ఒకోసారి విపరీతంగా దుఃఖం కలగవచ్చు. ఇలా విభిన్నభావాలు ఏర్పడినప్పటి అతడి మూమెంట్స్ తెలుసు కోవడమే ఈ ఎక్స్‌పెరిమెంట్‌లోని వుద్దేశం. ఆర్ యు రెడీ? " అన్నాడు సింగ్.

"మరో విషయం రేణూ! ఈ ట్రీట్‌మెంట్ ఎంతటి ముఖ్యమైనదో అంతటి ప్రమాదకర మైనది. అంటే... నీక్కూడా HIV ఎటాక్ అయ్యే రిస్క్ వుంది. అందుకే మేం చాలా కాలంనుంచీ ఈ ఎక్స్‌పెరిమెంట్ చేయడా నికి సందేహిస్తూ వచ్చాం. నీపట్టుదల, మంచిమనసూ తెలిశాక, సిద్ధపడుతున్నాం. ఇప్పటికీ నువ్వు ఆలోచించుకోవచ్చు. మోహన్ ఒక స్పెసిమన్ మాత్రమే! అతడికి ఈ ఎక్స్‌పెరిమెంట్ వలన జరిగే నష్టం ఏమీలేదు. ఎటూ రిస్క్ వుండేది మరి నీకే. ఎనీ డవుట్ ఎబౌట్ ఇట్? " అడిగాడు మధుకర్.

"నెవ్వర్ డాక్టర్! నేను మీ దగ్గరకు వచ్చే ముందే, అన్నిటికీ సిద్ధపడ్డాను. అయితే మీరు ఈరోజు చెప్పిన విషయాలు మొదట నాకు చెప్పలేదు. బహుశా ఇన్నిరోజుల వరకూ నా నిశ్చయం మారకుండా నిలక డగా వుంటుందని మీరు అనుకుని వుండరు. ఎనీవే నాట్ ఛేంజింగ్ మై డిసె షన్. నో డవుట్ ఎబౌట్ ఇట్! అయ్ విల్ ప్రొసీడ్...!

బట్ డాక్టర్, మిమ్మల్ని ఒక్క విష యంలో రిక్వెస్ట్ చేస్తున్నాను. ఇప్పటికే మా పేరెంట్స్‌ని కాదని కొన్ని నిర్ణయాలు తీసు కున్నాను. నాకోసం అన్నిటికీ అంగీకరిం చారు. ఇక మీదట నా ఫ్యూచర్ ఎలా వుంటుందో మనకెవ్వరికీ తెలియదు. కనుక మా అమ్మా, నాన్నగారినీ ఇక్కడికి ఈ ఊరు తీసుకు రావాలనుకుంటున్నాను. మీరు అంగీకరిస్తారా? " అడిగింది రేణూ.

"ష్యూర్! అలాగే తీసుకురా రేణూ. వారికి తగిన బస ఏర్పాటు చేయిస్తాను" అన్నాడు డా. సింగ్.

"థాంక్స్ డాక్టర్. థాంక్స్ ఎలాట్. వెంటనే బయలుదేరి రమ్మని ఫోన్ చేస్తాను" అంది రేణూ.

పదిరోజుల తర్వాత రేణూ పేరెంట్స్ కూడా ఢిల్లీకి వచ్చేశారు. మంగళాదేవి వారికి ఎంతగానో కృతజ్ఞతలు తెలియచే సింది. "రేణూలాటి అమ్మాయిలు చాలా అరుదుగా వుంటారు. ఏరకంగానూ సంబం ధంలేని మా కుటుంబానికి ఆసరాగా నిలవ డానికి మహోన్నతమైన ఉపకారం చేయడా నికి సిద్ధపడిందంటే మా అదృష్టం అను కుంటాం. అయితే మా వలన మీ దంపతు లకు క్షోభ కలుగుతుంది. అదే విచారంగా వుంది" అంది మంగళ.

"మీరంత మాట అనవద్దు. మా రేణూ ఏ కారణంగా ఈ నిర్ణయం తీసుకుందో, అది ఫలిస్తే చాలు. అమ్మాయి ఆశయాన్ని ప్రోత్సహించడం మాకు ఆనందం. రేణూ చిన్ననాటినుంచీ అంతే! ఏదో చదవడం, ఆ

తర్వాత ఉద్యోగంలో చేరి పెళ్ళీ పిల్లలూ, జీవితం గడిపేయడమే మనిషికి కర్తవ్యం అనుకోలేదు. ఏది చేసినా, ఒక ప్రయోజ నాన్ని ఆశించే చేసేది" అన్నారు రేణూ తండ్రి రఘువీర్‌వర్మ.

"అవునండీ మంగళగారూ! రేణూ చేయ కూడనిదేమీ తలపెట్టలేదు. అందుకే మేము బాధపడటంలేదు. ఒకరికొకరు సహాయంగా వుండటంకంటే కావలసినది ఏముంది? దేశరక్షణకు నడుంకట్టిన ఆర్మీలో జవాన్లు, పరిశోధనలు చేస్తూ నిరంతరమూ అభివృద్ధి కోసం పాటుపడే శాస్త్రజ్ఞులూ, భూమినుంచి ఆకాశానికి నిచ్చెనలు వేసి ప్రగతి పథంలోకి దూసుకువెళ్ళి, అంతరిక్షంలోని రహస్యాలను తెలుసుకోడానికి ప్రాణాలు అర్పించిన కల్ప నాచావ్లా వంటి ధైర్యశాలురు, ఏదో సాధిం చాలనే పట్టుదలతో ముందుకు దూసుకు వెళ్లారు కనుకనే అభివృద్ధి ఆశావహంగా వుంది" అంటూ చెబుతున్న ఊర్మిళ ఆలోచ నలకు విస్తుపోయింది మంగళ. 'తల్లీ, తండ్రీ ఇంతటి విశాల భావాలు కలవారు గను కునే, రేణూలో కూడా కొత్తకొత్త ఆలోచన్లు ఊపిరి పోసుకున్నాయి. ఆ అమ్మాయి తప్ప కుండా సక్సెస్ కావాలి' అనుకుంది. మొదట్లో అరుణ్, రేఖల దృష్టిలో రేణూ ఒక మామూలు మనిషి. ఇప్పుడు ధైర్యసా హసాలు మూర్తీభవించిన ఆదర్శమూర్తి.

"అరుణ్! ఒకప్పుడు విశాఖలో కలసి చదువుకున్న నా స్నేహితురాలు. ఇప్పుడు మనకు ఇంత చేరువ అవుతుందనీ, మనతో కలసి వుంటుందనీ ఎప్పుడూ ఊహించ లేదు. మా స్నేహం ఛాందసులైన మా కుటుంబంలో వారికి నచ్చేదికాదు. ఆ కార ణంగా, ఇక విశాఖతో సరి! అనుకున్నాను. నేనంటే ఎంతో ప్రేమ చూపించే రేణూతో స్నేహం మానుకోలేనని అప్పుడు పిరికితనం వలన చెప్పలేకపోయాను. ఒకరి అదుపా జ్ఞలు ఇష్టపడని రేణూని మావాళ్ళంతా తెగించిన 'ఆడపిల్ల. ఆ అమ్మాయికి దూరంగా వుండాలి' అంటే తలవంచాను. అంతటితో మా ఇద్దరి స్నేహానికి తెరపడిం దనుకున్నాను.

కానీ అనుకోకుండా మనం వైజాగ్ వెళ్ళిన ప్పుడు కనబడింది. ఫోన్ నంబరు ఇచ్చాను. మీ ఇంటికి వస్తానంటే మోహన్ కారణంగా మనస్ఫూర్తిగా ఆహ్వానించలేకపో యాను. కాదనలేక తప్పనిసరిగా రమ్మ న్నాను. అదిగో ఆనాటినుంచీ, రేణూ తిరిగి మనకి ఆప్తురాలు అయింది. మనందరి కోసం ఎందరో ఆర్తులకోసం ఒక లక్ష్యాన్ని నిర్దేశించుకుని, డాక్టర్ల పరిశోధనలో భాగస్తు రాలు అయింది. ఎక్కడి రేణు, ఎవరికో సమో జీవితాన్ని పణంగా పెట్టింది" చలిం చిన మనసుతో తన భావాలను అరుణ్‌తో విప్పి చెప్పింది.

"అవును రేఖా! ఆమెను మొదటిసారి చూసినప్పుడు చాలా గౌరవప్రదంగా ప్రత్యే కమైన వ్యక్తిగా కనబడింది. వివాహం వ్యక్తి గతం అనుకున్నాను. కానీ ఆదర్శం కోసమే మానుకున్నదని అనుకోలేదు. ఇప్పుడు బాగా తెలిసింది. ఈ రేణూయే మొదట్లో మోహన్‌కి కనబడివుంటే, వాడి లైఫ్ ఎంత బాగుండేది రేఖా! వాడికి అంత అదృష్టం పట్టలేదు. అయితే ఏం ఇప్పుడు భక్తుడికి సేవచేసే దేవతామూర్తిగా, ఆదుకుంది. ఇదీ వాడి అదృష్టమేమరి. కానీ మోహన్‌వలన ఆమెకు ఎటువంటి అనర్థమూ జరగకూడ దని మనసారా కోరుకుంటున్నాను. ఏరోజు ఏం జరుగనుందో తెలియదు కానీ రేణూ పేరు ఆప్తులంతా తలుచుకునే రోజు నిశ్చ యంగా వస్తుంది. మనం చేయగలిగింది ఒక్కటే! ఆమె తల్లి, తండ్రులకు లోటురా కుండా చూడటం. నువ్వు, అమ్మా వారిని జాగ్రత్తగా కనిపెట్టి వుండండి" అన్నాడు అరుణ్.

"తప్పకుండా! ఒకప్పటి స్నేహానికి, ఈ అనుబంధం మరింత బలం చేకూర్చింది. నా చేతనైనంతగా, కనిపెట్టి వుంటాను. అది

నా ధర్మం" అంది రేఖ.

డాక్టర్ మధుకర్, సింగ్‌లు చెప్పినట్టు, మొదటి ఇంజక్షన్‌తో, మోహన్‌లో మార్పు మొదలైంది.

రేణు నిలువెల్లా కవర్ చేయబడింది. మామూలుగా అప్పుడు ఆమెను తెలిసిన వారే గుర్తించలేరు. ఇక ఈ ప్రత్యేకమైన జాకెట్‌లో అసలు తెలియదు.

కళ్లు తెరచిచూసిన మోహన్‌కి ఎదురుగా నిలబడిన ఆకారం ఎవరో తెలియలేదు.

"ఎవరు నువ్వు? " తీవ్రంగా అడిగాడు.

"మీకు సేవ చేయడానికి నియమించబడిన నర్స్‌ని" నిజం చెప్పలేదు రేణు.

"ఏదో చంద్రమండలయాత్రకి సిద్ధమైనట్టు ఈ డ్రస్ ఏమిటీ? " మొహం చిట్లించి అడిగాడు మోహన్.

"పోనీ అలాగే అనుకోండి. నేను గగనతలంలోకి ప్రయాణం అయ్యాననుకోండి. మీరూ వస్తారా? "

"వెళ్లి అక్కడ హాస్పిటల్ ఏమైనా నిర్మిస్తావా? "

"హాస్పిటల్ నిర్మించగలిగేటంత గొప్పవాళ్ళని డాక్టర్స్ అంటారు. నేను పేషెంట్స్‌కి పరిచర్యలు చేసే నర్స్‌ని మాత్రమే" అంది రేణు.

"ఎప్పుడూ హాస్పటల్, రోగాలు, ఎందుకులే ఏమైనా సినిమాలు చూశావా? " జాలీగా అన్నాడు.

"సినిమాలు చూస్తూ కూర్చుంటే ఉద్యోగ బాధ్యత నిర్వహించలేం" అంది రేణు.

"మరీ బోర్ కొట్టదా? నాకు ఇలా పడుకుని విసుగు వచ్చేసింది. ఇలారా దగ్గరికి..." పిల్చాడు మోహన్.

వచ్చింది రేణు.

"మనిద్దరం ఎవరూ చూడకుండా సినిమాకి పోదాం" రహస్యంగా అన్నాడు మోహన్.

"ఏ సినిమాకి వెడదాం? " అడిగింది రేణు.

"బ్యూటిఫుల్ మైండ్" అన్నాడతను.

"ఆ సినిమా నేను చూశాను. మరోటి చెప్పండి"

"మమ్మీ, కోయీ మిల్‌గయా, నువ్వు నాకు నచ్చావ్..." ఏమిటేమిటో పేర్లు చెప్పేశాడు మోహన్.

"అవన్నీ వద్దులెండి. మీరు నిద్రపోండి. మీ కళ్లకి స్ట్రెయిన్ పనికిరాదు"

"ఎప్పుడూ నిద్రపోతూనే వున్నాను. పోనీ టాంక్‌బండ్‌కి వాకింగ్‌కి వెడదాం"

"నేనెందుకు? మీరొక్కరూ వెళ్ళిరండి"

అమాంతం బెడ్‌దిగి, చుట్టూ తిరగసాగాడు మోహన్.

'సరే! ఇదీ డాక్టర్ చెప్పిన లక్షణాల్లో భాగమే కాబోలు. నడిస్తే మంచిదే' అని వూరుకుంది రేణు.

నడకల్లా పరుగులోకి దిగింది. స్పీడ్‌గా బెడ్‌చుట్టూ పరిగెట్టి, వగర్చసాగాడు. ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్దయింది.

"ఇక ఈరోజు వాకింగ్ చాల్లెండి. అబ్బో చాలా దూరమే నడిచారు" అంది రేణు.

ఏమనుకున్నాడో బుద్ధిగా బెడ్‌మీద పడుకున్నాడు. ఆ పరుగుకి అలసట కూడా వచ్చింది. స్పాంజ్, సోప్ వాటర్‌లో ముంచి, ఒళ్ళంతా తుడిచి పౌడర్ రాసింది. స్నానం చేయగల స్థితిలో లేనందుకు! అతడికి గాఢనిద్ర పట్టింది.

రేణు ఆరోజు అతడి ప్రవర్తన అంతా వివరంగా పేపర్ మీద రాసింది. తనేమో డాక్టర్ సింగ్ ఇచ్చిన జర్నల్ తీసి చదువుకోసాగింది.

ఇలా వారంరోజులపాటు మతి చలించినవాడిలా ప్రవర్తించాడు. ఇదంత బాధాకరం కాదు. కాకపోతే అతడి చైన్‌లింక్ క్వశ్చన్స్‌కి సహనంతో జవాబులు చెప్పాలి.

అరుణ్ డ్యూటీకి వెళ్ళిపోయాడు. మంగళాదేవి మోహన్ని చూడాలని వచ్చింది. కానీ ఆవిడను గుర్తుపట్టలేదు అతను.

"నమస్కారం డాక్టర్! మీరిచ్చిన మెడిసిన్ ఏం పనిచేయట్లేదు నిద్రపోవడానికి ఇచ్చారా? నాకు భోజనం ఎలా? ఆకలి దంచేస్తోంది" అన్నాడు.

"ఇదిగో బాబూ! భోజనం తెచ్చాను. తింటావా? " అంటూ తాను తెచ్చిన స్వీట్స్ పెట్టింది మంగళ. అప్పుడే భోజనం పెట్టినట్టు రేణు చెప్పినందువలన.

"బాగున్నాయ్. ఇంకా కావాలి. భోజనం చేయనివాళ్లకి, రెండు లడ్డూలు సరిపోతాయా? " ఆ బాక్స్ మొత్తం ఇచ్చేయండి అంటూ ఆవిడ చేతిలో బాక్స్ లాక్కుని మొత్తం తినేశాడు.

"అయ్యో రేణూ, అన్నీ తింటే ఏమైనా చేయదూ? " గాభరాగా అంది మంగళ.

"చూద్దాం ఏం చేస్తుందో! మనం మొత్తం అతని ఎదుటకు తీసుకురాకూడదు. సరే లెండి మీకు తెలియదుగా. ఈసారి ఏదైనా తెస్తే ముందుగా నాతో చెప్పండి" అంది రేణు.

కాసేపు కూర్చుని వెడుతూ, "రేణూ! మోహన్ నిన్ను పెట్టే బాధలు చూశాను. ఎంత డబ్బిచ్చినా నర్స్ కూడా ఇంత సహనంగా, విసుగు లేకుండా కనిపెట్టి వుండదు. నువ్వు... మా పాలిట దేవతవి" అంది.

"అలా అనకండి. దేవతలు, దెయ్యాలూ అంటే నాకు భయం. మీరు ఏకంగా పోలిక తెచ్చారంటే రాత్రంతా వణికి చచ్చిపోతాను" సరదాగా చెప్పింది రేణు.

"అవున్లే. నీకు పొగడ్తలంటే ఇష్టంలేదు. నేను చెప్పకపోతే మాత్రం, నా మనసులో మాట ఎటూ నీకు తెలుసు. జాగ్రత్తమరి. నేను వెడతాను" అంది మంగళ.

"రేఖ ఏం చేస్తోంది? ఇక ఇంటికి ఇప్పట్లో రాలేను. వీలువుంటే ఒకసారి రేఖనే రమ్మనండి" అంది రేణు.

"అలాగే చెబుతాను. వస్తానూ..." అంటూ ఇంటికి బయలుదేరింది మంగళ.

మోహన్ హాస్పటల్లో చేరాక రేఖ రాలేదు. ఆమెకు మనసులో అతడ్ని చూడాలనీ లేదు. ఎవరూ వెళదాం వస్తావా? అని అడగనూలేదు. కానీ రేణు ఇంటికి రాలేదు కనుక ఆమెను చూడాలనిపించి వచ్చింది.

"సారీ రేఖా! నిన్ను చూడాలనిపించి పిలిచాను. ఏం చేస్తున్నావ్? " అంది.

"ఏముంటాయ్! పూజా, రోజాలతోనూ సరిపోతోంది. అరుణ్ లేడు. ఈమధ్య చాలా లీవ్ వాడేసినందున ఇప్పట్లో రానని చెప్పాడు. ఏంబుక్ చదువుతున్నావ్? " అంది అక్కడే అన్ని మెడికల్ జర్నల్స్ చూసి!

మెడికల్ జర్నల్స్ చదువుతున్నాను. వైద్యరంగంలో మార్పులూ, దేశ, విదేశాల పరిశోధనలూ! నిర్మూలనకు ప్రయత్నం చేసేకొద్దీ, పుట్టుకువస్తున్న కొత్త వ్యాధులూ, ఏ కారణంగా, ఏదేశంలో ఎక్కువగా వస్తున్నాయో వివరణా... ఇదంతా ఒక మహాసముద్రం రేఖా! మనకి తెలిసింది చాలా తక్కువ. ఒకొక్క డిసీజ్‌లో, ఎన్నో రకాలు. ఒక్కటే బాధ! ఈ వ్యాధుల నిరోధానికి ప్రజలు ఏ రకంగానూ జాగ్రత్తలు తీసుకోవడంలేదు. వ్యాధి వచ్చిన తర్వాత ట్రీట్‌మెంట్‌కి ఖర్చు చేయలేని స్థితిలో వున్న సామాన్యుల గురించి అలా వుంచితే, ముందుజాగ్రత్తగా పుష్టికరమైన ఆహారాన్ని అతితక్కువ ధరలో తీసుకోవచ్చని తెలియని అజ్ఞానం నిరక్షరాస్యులైనవారికి శాపంగా పరిణమించింది.

ఇక మధ్యతరగతి ప్రజలు చదువుండి, కొంతవరకూ మంచి ఆహారాన్ని తీసుకోగలిగి నిర్లక్ష్యం చేస్తారు. వ్యాధి సక్రమించిన తర్వాత కాక ముందుజాగ్రత్తగా ప్రతీ సంవత్సరమూ చెకప్ చేయించుకుని ఆహార నియమాలు పాటించి, వెయిట్‌ని అదుపులో వుంచుకోగలిగితే, ఎంతో ఉపయోగం వుంటుంది. అయినా పట్టించుకోరు. ఈ విషయాలన్నీ తెలియకకాదు. పైగా మన తోటివాళ్ళం సలహా చెప్పినా, 'డాక్టర్ దగ్గ

రకి వెళ్ళడమా? హమ్మయ్యో... లేనిపోని జబ్బుల పేరుతో భయపెట్టి డబ్బు ఖర్చు చేయిస్తారు. లాయర్ చేతిలోనూ, డాక్టర్ చేతిలోనూ పడినవారికి ఒకసారే మోక్షం... అనేవారున్నారు. అయితే కొందరు డాక్టర్ల ప్రవర్తన కూడా ఇందుకు కొంత కారణం"

"నిన్ను పొగిడితే కోపం వస్తుందిగానీ, ఇల్లూ, నాన్నగారి బాధ్యత పంచుకోవడం, అమ్మకి పనిలో సాయం చేయడం, పెళ్ళీ, పిల్లలూ, వారి బాగోగులూ తప్ప, మరో ధ్యాసలేని కూపస్థ మండూకాన్ని నేను. కానీ నువ్వో చదువూ, విజ్ఞానం, లోకోపకారం, ఆదర్శం. ఎంత తేడా మనిద్దరికీ. అయినా స్నేహం కలిసింది. నీవలన నాకు ఎన్నో తెలిశాయి. నా పిల్లలను నీలాగే ఆదర్శవం తులుగా పెంచి, పెద్ద చేయాలనే నిశ్చయా నికి పునాది ఏర్పడింది.

"నువ్వు ఎన్నుకున్న మార్గమూ తప్పు కాదు రేఖా! అంతా నాలాగే లోకోపకారానికి బయలుదేరితే లైఫ్‌స్టైల్ మారిపోదూ? ఈ దేశానికి పెళ్లికాని నా వంటి ఆదర్శంగల అమ్మాయిలకన్నా, దేశరక్షణకు వీరుడు, వైద్యరంగాన్ని అవుపోశన పట్టడానికి డాక్టరు, ప్రజాసేవ చేసే రాజకీయనాయకుడు, సాహి తీమథనానికి ఒక రచయిత, కర్మభూమిని నిలబెట్టడానికి ఒకానొక దైవసంభూతుడు ఎందరో కావాలి. వారు ఉద్భవించాలంటే పెళ్ళీ, పిల్లలూ తప్పనిసరి. అందరూ నాలాగే అయితే కాలచక్రమే స్థంభించిపోదూ? అందుచేత ఓ అమ్మాయీ! అటూ ఇటూ వుండాలి. ఏదో ఒకటే మార్గంలో అందరూ నడుస్తాం... అంటే ఈ ప్రపంచమే వుండదు. నువ్వు పొరబాటున నన్ను కది లించావో ఇక అంతేమరి. నా వాగ్ధాటికి ఫుల్‌స్టాప్ అనేది వుండదు"

"నువ్వు చెప్పినమాట ఒకరకంగా కరక్టే అనుకో. పెళ్లీ, సంతానం సంసారంలో పడి పోయి దేశజనాభాను విపరీతంగా పెంచే యబట్టేకదా, దేశాభివృద్ధి కుంటుపడు తుంది. కాస్త అటూ ఇటూ కూడా వుండాలి కదమ్మాయ్. ఉపయోగంలేని వేలమంది జనాభాకంటే పనికొచ్చే వందలమంది కావాలి" ఇద్దరూ ఇలా కబుర్లలో పడి మోహన్ లేచి, రూమ్‌నుంచి బయటకు రావడం గమనించలేదు. వస్తూనే రేఖను చూసి, అమాంతం అక్కడే వున్న పూలమొ క్కలున్న తొట్టెను ఎత్తేసి రేఖకు గురిచూసి కొట్టాడు.

రేఖ చప్పున పక్కకు తప్పుకుంది కానీ లేకుంటే ప్రమాదం జరిగిపోయేది.

రేణు అతన్ని శాంతింపచేసి రూమ్‌లోకి తీసుకెళ్ళిపోయింది. బయటకు రాకుండా తలుపు బోల్ట్ వేసేసింది.

రేఖకు పరిస్థితి అర్థమై వెంటనే ఇంటికి వెళ్లిపోయింది. రేణు మోహన్ని ఎంతగా అనునయించాలని చూసినా వీలుకాలేదు. డాక్టర్ సింగ్‌కి మధుకర్‌కి ఫోన్ చేసింది. ఇద్దరూ వచ్చాక, జరిగిన విషయం చెప్పింది. ఇంకా మోహన్ రెస్ట్‌లెస్‌గానే వున్నాడు. నిద్రపోడానికి ఇంజక్షన్ చేసి, ఆ రేఖ ఎవరు? అతడికి బంధువా? లేక పరి చయస్థురాలా? నీకు తెలిసిన మనిషా? అంటూ అడిగారు.

జరిగిన కథనంతా వివరించింది రేణు. గతంలో రేఖను చూసినప్పుడు కూడా ఇలాగే ప్రవర్తించాడని చెప్పింది.

"అలాగా? ఇక రేఖను ఎన్నడూ హాస్పట ల్‌కి రావద్దని చెప్పు" అన్నాడు డా॥ సింగ్.

"నాదేనండీ పొరపాటు. రమ్మని కబురు చేశాను. బయటరూంలో వున్నాంకదా అను కున్నాను. అదీకాక రేఖ కారణంగా, మోహ న్‌లో ఫీలింగ్స్ మారుతాయనీ అనుకోలేదు" అంది రేణు.

"ఈ విషయాలు మాకు ముందుగా చెప్పి వుంటే రేఖను పొరబాటున కూడా రానీయ వద్దని చెప్పేవాళ్ళం" అన్నాడు మధుకర్.

"ఇప్పుడు ఏదైనా ప్రాబ్లమ్ వుంటుందా

డాక్టర్? "అడిగింది రేణూ గాభరాగా.

"చూద్దాం. ఇప్పటికిప్పుడు తెలియదు కదా? క్రమంగా అతనికి ఇష్టమైన వారెవరో, కానివారెవరో తెలుస్తుంది" అన్నారు డా. సింగ్.

"డాక్టర్! మొదట అతడు ఎవర్నీ గుర్తుపట్టనే లేదు. రేణూని, మంగళాదేవిని! ఇప్పుడు రేఖను ఎలా గుర్తించాడంటారు? " అడిగాడు మధుకర్.

ఇక్కడ ఆలోచించాల్సింది ఏమంటే, రేఖ, అతడి మనసులో గాఢంగా నిల్చిపోయింది. ఆమెను పొందలేక పోయాననే అసంతృప్తి, పోగొట్టుకోడానికి కారణమైన నిరాశా అతణ్ణి పూర్తిగా ఆవహించడంతో, అతడి మెదడులో ఆమె జ్ఞాపకాలు నిక్షిప్తమై నిలిచి పోయినట్టుగా మనం భావించాలి. అందుకే రేఖను చూడగానే ద్వేషం పొంగివచ్చింది. ఎవర్నైనా మరిచిపోతున్నాడు కానీ, ఆమెను మరువలేక పోయాడు" అన్నాడు డాక్టర్ సింగ్.

మోహన్ రూమ్‌నుంచి బయటకు వచ్చాక, "అంతా మనం అనుకున్న మార్పులు జరుగుతున్నాయ్. మొదటి దశ కంటే, రెండవ దశ ప్రమాదం. ఈ రెండు దశల కారణాలవలన రేణూకి నష్టం లేకపోయింది. కానీ ఇంతకంటే కష్టతరమైన దశ మరొకటి వుంది. అది భయంకరమైనది. అత్యంత ప్రమాదకరమైనది. నువ్వు రేణూకి అందుబాటులో వుండి గమనించు. ఎందుకంటే ఆ టైమ్‌లో రేణూ, మనకు కాల్ చేయలేని నిస్సహాయస్థితి రావచ్చు. మోహన్ చేతికి సెల్‌ఫోన్ దొరికినా అతడు దాన్ని బయటకు విసిరి కొట్టవచ్చు. ఎనీవే, మనం ముందుగానే ఊహించి, 'అలా జరిగితే, ఇలా జాగ్రత్త తీసుకోవాలనే సిద్ధంగా వుండాలి' యూనో... మిస్టర్ మధూ? వివరించాడు డా. సింగ్! "యస్ డాక్టర్. నేను రెడీగా వుంటాను" అన్నాడు మధుకర్.

తిరిగి ఇద్దరూ రేణు దగ్గరికి వచ్చి "డోంట్ వర్రీ రేణూ! నీకు ఏ రకమైన ఆపద కలిగినా అందుబాటులో వుంటాం. మేమే తరచుగా వచ్చి చూస్తుంటాం. అయితే ఒక ముఖ్య విషయం నీతో చెప్పాలి. రెండు దశల్లో అతడి ప్రవర్తన తెలుసుకున్నాం. ఈ రెండోదశ ఎంత కాలం వుంటుందో చెప్పలేం. మూడోది, నాలుగవది అటూ ఇటూగా రావచ్చు. అంటే అతిగా నిద్రపోవడం, మోహన్‌లో తీవ్రమైన సెక్స్ కోరికలు విజృంభించడం, ఏది ముందుగా వస్తుందో తెలియదు కనుక నువ్వు నీ జాగ్రత్తలో వుండు. రిస్కు కూడా లేకపోలేదు. మోహన్ నిన్ను చాలా సులువుగా ట్రాప్‌లో పడవేయవచ్చు. అప్పుడు నువ్వు హెల్ప్‌లెస్ కావచ్చు. అప్పుడు నీలో HIV ప్రవేశించడానికి చాలా అవకాశం వుంటుంది. ముందుగా నిన్ను హెచ్చరించింది ఈ స్టేజ్ గురించే. అయినా నువ్వు సిద్ధపడ్డావ్. ఇదే మా లాస్ట్ అండ్ ఫైనల్ ఎక్స్‌పెరిమెంట్. దీని రిజల్ట్ కోసమే మేము వేచివున్నాం. సక్సెస్ ఆర్ ఫెయిల్యూర్ జరగచ్చు. సక్సెస్ అయితే క్రెడిట్ మనం ఆశించిన పెద్ద ఉపకారం జరుగుతుంది. ఫెయిల్యూర్ అయితే నీకు డిసీజ్ ఎటాక్ అవుతుంది. మేము విధికి తలవంచాల్సివస్తుంది. 'టేక్ కేర్' అంటూ చెప్పి వెళ్ళిపోయారు.

ఇద్దరూ చెప్పిన విషయాన్ని, రేణు శ్రద్ధగా విని మరోసారి తనలో తనే తర్కించుకుంది. ఆమెకు ఏ రకమైన భయమూ, జంకూ కలగలేదు. 'నేను ఎన్నుకున్న మార్గానికి ఇదొక ముఖ్యమైన మలుపు. భయం దేనికి? ఈ మహాయజ్ఞంలో సమిధను కావడానికైనా నేను సిద్ధం. ఆశయాలు ఎన్ని అయినా వుండచ్చు. అవి నెరవేరడానికి అవకాశాలు కూడా కలిసిరావాలి. అవి అందరికీ రావు. నాకు వచ్చింది. నా వరకూ సరే! కానీ అమ్మా, నాన్నలకు శూన్యం మిగులుతుంది. మా అమ్మాయి కీర్తి గడించిందన్న పేరుగాని, ఒక ప్రయో

గంలో ఓటమి పాలైందనే బాధగానీ కలగ వచ్చు. దేశరక్షణకు ప్రాణాలు అర్పించిన సైనికులు తల్లిదండ్రులు ఎన్నడూ విచారిం చరు. అది వారికి గర్వకారణం. ఇది కూడా అటువంటిదే! ప్రయోగాలు కావచ్చును కానీ ఫలితం మాత్రం శాశ్వితమైనది!

మోహన్‌లో మోహావేశం విజృంభించి నన్ను పతనం చేయవచ్చునట. అంటే ఈ రక్షణ కవచం ఏమాత్రమూ పనిచేయదన్న మాట. ఈ ప్రయోగానికి కేవలం స్త్రీలే ఉప యోగపడతారు. అవును. వ్యాధి అటువం టిది. స్త్రీ, పురుషుల కలయికవల్లనే వ్యాపిం చనూ వచ్చు లేదా ఇంతటితో వారితోనే మాసిపోవచ్చు

డాక్టర్స్ చెప్పిన విషయంలో ఒక సందేహం కలిగింది రేణుకి. మోహన్‌లో మొహావేశం, సెక్స్ కోరికలూ కలగకపోతే ఇదే డ్రగ్‌ను వ్యాధి వున్న మరొకరిమీద ప్రయోగిస్తారా? అప్పుడు కొత్తగా ఈ వ్యాధికి అటాక్ అయ్యేవారు వుండరు కనుక, కొంతవరకూ వ్యాధి నియంత్రించబ డుతుందా?

ఇప్పుడు డాక్టర్‌ని అడగకపోయినా బాధ లేదు. కొద్ది కాలానికి అనుభవ పూర్వకంగా అదే తెలిసి వస్తుంది. ఇప్పుడు డాక్టర్‌ని డిస్టర్బ్ చేయడం దేనికీ? అనుకుంది.

మోహన్ రెండు రోజులుగా మామూలు గానే ఉన్నాడు. కొద్ది రోజులు నుంచీ ఒకటే పనిగా నిద్ర పోతున్నాడు. ఆ మగతలో రేఖ గురించి కలవరిస్తాడు. ఒకసారి అన్నయ్య అరుణ్‌ని దూషిస్తాడు. తండ్రిని ఊహించుకుని 'నాన్నగారూ! మీకు నేనంటే కోపం ఎందుకండీ? నన్ను చిన్నచూపు చూశారు. అన్నయ్యకు ప్రేమ పంచారు. చివరికి వాడు మీకేం చేశాడు? మీకు కని పించకూడదన్నట్లు దూరంగా వెళ్లిపో యాడు. అప్పుడయినా మీరు నన్ను అభి మానించలేదు. నేను చేసిన తప్పు ఏమి టండీ? మీరు కోరుకున్నట్టు పెద్ద కొడుకు ప్రేమనూ అనుభవించలేదు. నాకు తండ్రి ప్రేమను దూరం చేశారు. అసలు మన ఇంట్లో ప్రేమాభిమానాలు అచ్చిరావు. అందుకే నేను ప్రేమించాలనుకున్న వారంతా దూరమైపోయారు. చివరికి కన్న తల్లిని కూడా దూరం చేయగల భయంకర వ్యాధికి గురయ్యాను. ఆ రకంగా స్నేహి తులు, రేఖా అంతా నాకు కాకుండా పోయారు...' అంటున్నాడు.

'ఇతడి క్షోభను ఎవరు మాపగలరు? మనిషికి మతి లేకపోవచ్చు శరీరానికి వ్యాధి రావచ్చు కానీ మనసుకెప్పుడూ మలినం అంటదు. అది ఏ దశలో అయినా ఒకలాగే ఉంటుంది. ఒకరిని ప్రేమిస్తే మర చిపోదు. ద్వేషిస్తే మరొకర్ని దరిదాపులకు రానీయదు' అనుకుని జాలి పడింది రేణూ.

డా॥ మధుకర్ వచ్చాడు.

"రేణూ! మోహన్ ఎలా ఉన్నాడు? ఏదీ నువ్వు రాసిన నోట్. జెరాక్స్ తీసి, డా॥ సింగ్‌కి ఇవ్వమన్నారు. రెండు నెలలుగా పేపర్స్ మొత్తం ఇంచు మించు ఖాళీగా ఉన్నాయి. అంటే మోహన్ ఏమీ ఇబ్బంది కలిగించలేదన్న మాట..." అన్నాడు.

"లేదు డాక్టర్! మత్తుగా నిద్ర పోవడం, ఆ నిద్రలో కలవరింతలూ, వాటి గురించి రాశాను. అంత స్పష్టంగా లేవనుకోండి. కొన్ని ఊహించి రాశాను" చెప్పింది రేణూ.

"ఇదేదో ప్రళయం ముందు ప్రశాంత స్థితేమో! డా॥ సింగ్ రేపు అర్జెంట్ పని మీద యు.కె. వెళుతున్నారు. మనిద్దరమే మోహన్‌ని హేండిల్ చేయాలి. కొంత వరకూ రిస్కే. కాని ఆయన తిరిగి ఇండియా వచ్చే వరకూ, మన అదృష్టం బాగుండి ఎటువంటి ప్రమాదమూ రాకూ డదు. నేను కూడా నీకు తోడుగా ఇక్కడే ఉండి పోదామంటే నా వైఫ్‌కి పది రోజు లుగా బాగా లేదు. మా బంధువుల నెవ రినో తోడుగా ఉంచి, వచ్చాను. తరచుగా

ఫోన్ చేస్తూంటాను. ఇంజక్షన్స్ అన్నీ రెడీగా ఉంచాను. ఫరవా లేదనుకో..." అన్నాడు.

ఈ మాటకి రేణూ కొంత జడిసింది. డా॥ సింగ్, మధూ ఇద్దరూ లేని టైమ్‌లో ఏం జరుగుతుందో... అని!

రేణూ సంశయాన్ని గమనించి, "అలా అని, పూర్తిగా నీమీద బాధ్యత వదిలి పెట్టను. కొత్తగా వచ్చిన కిరణ్ అనే డాక్టర్ ఒకతనికి, అప్పగించాన్లే. ఎలాగో బ్రతిమి లాడి మా బంధువుని అట్టిపెట్టేస్తాను.

నా సహాయం నేనూ చేస్తాను" అన్నాడు ధైర్యం చెబుతూ మధుకర్. నిజానికి రేణూకి, డా॥ మధుకర్ మీద చాలా కోపం వచ్చింది. 'డా॥ సింగ్ అంటే మరో కంట్రీ వెళ్లారు. ఊళ్లోనే ఉండే ఈయన కూడా ఇప్పుడే మానేయాలా? అయినా పాపం ఆయన భార్యకి కేన్సర్. ఏం చేస్తాడు? నా బాధే ముఖ్యం అని మనం అనుకుంటాం. వాళ్లకి మాత్రం బాధలుండవా జరిగేది జర గనీ. నిండా మునిగిన వాడికి చలి ఏమిటీ? ' అనుకుంది.

ఈ విషయాలన్నీ తెలిసిన రేఖ చాలా టెన్షన్ పడింది. పాపం రేణూ ఏం ఇబ్బంది పడుతుందో అని!

'ఈ అమ్మాయికి, ఈ సాహసం ఏమిటో! ఎంతగా అభినందించినా, అనుభవంలోని కష్టం పైవాళ్ళకు ఏం తెలుస్తుంది? ఇంత మంది పరివారం ఉన్నా ఏమీ చేయలేని స్థితి. రేణూకి దైవ కృప కలిసి వచ్చి గండం గడిచి బయట పడాలి...' అను కుంది మంగళ.

"ఎన్ని ఆటంకాలు ఎదురైనా రేణూ విజయం సాధిస్తుంది. మనకి నమ్మకంగా తెలుసు" అనుకుంది రోహిణి.

"ఆటంకాలు రావడం, ఎదుర్కోవడం అనే ఆలోచనకంటే, ఏ ఆపదా రాదు అనే ఆలో చన వలన ధైర్యం కలుగుతుంది" అనుకు న్నారు రఘువీర్.

ఇలా రేణూ ఎదుర్కోబోయే సంఘటన గురించి అందరూ ఎక్సైటింగ్‌తో మనసులో ఆలోచిస్తూనే ఉన్నారు. ఎవరికి ఉన్న నమ్మ కంతో వారు ధ్యానం చేసుకుంటున్నారు.

డాక్టర్ సింగ్ దేశంలో లేకపోవడం ఒక్కటే అందరికీ అధైర్యం కలిగిస్తోంది. ముందుగా ఊహించి ఎన్ని జాగ్రత్తలు తీసు కున్నప్పటికీ సూత్రధారి అయిన సింగ్ ఉంటే ఆ పరిస్థితి వేరు. మధుకర్ కూడా మంచి డాక్టర్. తెలివైన వాడు. డా॥సింగ్‌కి సమఉజ్జీ అయినా, అందరూ సింగ్ త్వరగా రావాలని కోరుకుంటున్నారు.

ఫోన్ రింగ్ అయింది. రేఖ రిసీవర్ లిఫ్ట్ చేసింది.

మంగళ ఎవరా అని, ఆత్రంగా చూస్తోంది.

"నేను మధుకర్‌ని రేఖా! రేణూని ఒంట రిగా విడిచి పెట్టవద్దని, నా వైఫ్ గొడవ చేసి పంపింది. నేను వచ్చేశాను. మీరంతా ఏం టెన్షన్ పడతారో అని, చెబుతు న్నాను..." అన్నాడు.

"ఓ... మీ మిసెస్... అంత బాధలోనూ రేణూ గురించి ఆలోచిస్తున్నారంటే వెరీ గ్రేట్. నిజంగా మేమంతా చాలా వర్రీడ్‌గా ఉన్నాం. మీరున్నారు. ఇక భయం లేదు. థాంక్యూ డాక్టర్" అంది రేఖ.

మంగళ కోడలి సమాధానం విని, కుదుట పడింది.

"రేఖా! భర్త మనసు తెలుసుకుని సహక రించే భార్య లభించడం, డాక్టర్స్‌కి చాలా అవసరం. అతడు తెచ్చే సంపాదనకంటే, సాధించే విజయాలు ముఖ్యమని భావించే వారు తప్పక అనుకూలంగా ఉంటారు. డాక్టర్ గారి భార్యను మెచ్చుకోవాలి" అంది.

"అవును అత్తయ్యగారూ! భర్త విజయా నికి భార్య సహకారం చాలా అవసరం. ఇంట్లో తలనొప్పులుంటే, సర్జన్ ఆపరేషన్ చేయడం కష్టం. ఈ కాలం ఆడవాళ్లు మరీ అంత మూర్ఖులూ కాదు లెండి. అయితే

ఇక్కడ మధుకర్ భార్య పరిస్థితి కూడా అంత బాగా లేదు. ఆ స్థితిలో భర్త, దగ్గిర వుండాలని కోరు కోవడం తప్పు కాదు" అంది రేఖ.

"రేఖా! డాక్టర్, ఆర్మీలో పని చేసే వారు, ఎయిర్ ఫోర్స్, నేవీ ఉద్యోగాల వారు కుటుంబాలకి దూరంగా ఉండక తప్పనిసరి!

ఆ ఉద్యోగంలో చేరే ముందే వీర మరణానికి సిద్ధపడాలి. ఆ గుండె ధైర్యం మానసిక స్థైర్యమూ అలవర్చు కోవాలి" అంది మంగళ.

"అంతే కాదు అత్తయ్యా! మీలా ఒక కొడుకు యుద్ధ రంగంలో, మరో కొడుకు మృత్యు రంగంలో ఉన్నవారు కూడా..." మాట పూర్తి చేయలేని రేఖ ఆగిపోయింది. అయ్యో! అనుకో కుండా నోరు జారేను. ఆవిడ ఫీలవు తారేమో అని బాధ పడింది.

కానీ మంగళాదేవి పట్టించుకోలేదు. అంతదాకా చదువుతూ, వదిలి పెట్టిన జిడ్డు కృష్ణమూర్తిగారి ఫిలాసఫీ బుక్ చేతిలోకి తీసుకుని చదవడం మొదలు పెట్టింది. ఆవిడ మనసు వ్యాకులంగా ఉన్నప్పుడు వెంటనే చేసే పని పుస్తకం చదవడం. అందులో మోహన్ ప్రసక్తి వచ్చినప్పుడు ఫిలాసఫీని ఆశ్రయించడం రేఖకి తెలుసు.

పూజా, రోజాల రూమ్‌లో నుంచి అలికిడి వినబడితే అటు వెళ్లింది రేఖ.

మళ్ళీ ఫోన్ మోగింది.

రోహిణికి విసుగ్గా అనిపించింది. ఈ వేళ ఇది పదో సారి ఫోన్ రింగ్ అవడం! రేణూ ఫ్రెండ్స్, రేణూ గురించి చేశారు.

రఘువీర్ ఫ్రెండ్స్ చేశారు.

ఊర్మిళతో పరిచయం ఉన్నవారు చేశారు.

వారెవరికీ రేణూ నిశ్చయం గురించి తెలియదు కానీ, IAS సెలక్షన్ వదులుకుని ఏం చేస్తోందా ఢిల్లీలో ఉండి... అనే ఆత్రంతో, చేస్తుంటారు. రోహిణీ రఘువీర్‌లు ఈ మధ్యనే ఢిల్లీకి మకాం మార్చివేయడంతో పరిచయస్తులంతా బాగా అలవాటైన వారు ఊరు విడిచి వెళ్లారనగానే తరచుగా గుర్తు వచ్చి, ఏమీ తోచక ఫోన్ చేస్తారు. అందులోనూ, ఆ రఘువీర్ కుటుంబంలో వారంతా ఆదర్శప్రియులు. సోషల్ వర్క్ చేయడం అలవాటు కారణంగా ఎందరో పరిచయస్థులూ పెరిగారు.

ఈ ఫోన్ కాల్ కూడా అలాటిదే అయి వుంటుందని, ఆ రోజు ఉదయం నుంచీ రిసీవ్ చేసుకుని, ఇప్పుడిక రేణూ గురించిన ఆలోచనలతో కొద్దిగా టెన్షన్ ఫీలవడంతో ఫోన్ తీయలేదు రోహిణి. మళ్ళీ మళ్ళీ రింగ్ అవడం, అందులోనూ సెల్‌ఫోన్ కూడా రింగ్ అవడంతో, రఘువీర్ ఆన్ చేశాడు.



"గుడ్ న్యూస్ రఘువీర్! డా॥ సింగ్ అనుకున్న డేట్‌కి ముందుగా అక్కడ వర్క్ పూర్తి కావడంతో, ఈ రోజు తిరిగి వచ్చేస్తున్నారు. మీరు ఎంతగా టెన్షన్ పడుతున్నారో అని, ముందుగా మీకే కాల్ చేశాను. సారీ ఫర్ డిస్టర్బెన్స్" అన్నాడు మధుకర్.

"నో... నో... అలాటిది ఏమీ లేదు. నేను లిఫ్ట్ చేస్తానని ఊర్మిళా, తను లిఫ్ట్ చేస్తుంధిలే... అని నేనూ, పిక్ చేయడం లేట్ అయింది. థ్యాంక్స్ ఫర్ ది ఇన్‌ఫర్మేషన్, డా॥ మధుకర్..." అన్నాడు రఘువీర్.

"రోహిణీ! డా॥ సింగ్ వెనక్కి వచ్చే శార్త. మధుకర్ చెప్పాడు" అంటూ భార్యకి న్యూస్ అందించాడు రఘువీర్.

"హమ్మయ్య! మంచి వార్త చెప్పారండి. రేఖతో కూడా చెప్పండి. పాపం వాళ్లు కూడా వర్రీలో వున్నారు" అంది రోహిణి. అందరికీ డా॥ సింగ్ రాక సంతోషాన్ని కలగచేసింది. కొంత రిలీఫ్ ఫీలయ్యారు.

డా॥ సింగ్ ఫ్లయిట్ దిగీదిగగానే హాస్పటల్‌కి వచ్చేశారు. రేణూని, మధుకర్‌ని కలిసి, "ఎనీ ప్రాబ్లమ్? " అంటూ అడిగారు.

"నో డాక్టర్. నో ప్రాబ్లమ్..." అంటూ చెప్పింది రేణు. "ఎనీ హౌ... ఇంతలా నిద్ర పోవడం మంచిది కాదు. నేను పొరబాటున డోస్ ఎక్కువ చేశానా? " తన్లో తను అనుకున్నట్టు అన్నాడు సింగ్.

రేణూ, మధుకర్ మాట్లాడలేదు.

మరో రెండు ఇంజక్షన్స్ చేశాక, మోహన్

కనురెప్పలు విడివడ్డాయి. కానీ కనుగుడ్ల కదలిక మాత్రం లేదు.

మధుకర్ గిల్లి చూశాడు.

రేణూ "మోహన్... మోహన్..." అంటూ చెవి దగ్గిర నోరు పెట్టి, పిల్చింది..

ఊహు... అతడిలో ఏ మాత్రమూ చలనం లేదు.

అలా కళ్లు తెరవగానే చూసిన గోడవైపే దృష్టి నిల్చిపోయింది.

అనుకోని ఈ స్థితికి మధుకర్ కలవరంగా డా॥ సింగ్ వైపు చూశాడు.

డా॥ సింగ్ ఏ మాత్రమూ కలవరపడలేదు. అతడి వదనంలో ఏ రకమైన భావమూ కనబడలేదు మధుకర్‌కి.

డా॥ సింగ్ చేతికున్న వాచ్ వైపు, మోహన్ వైపు చూస్తున్నాడు.

మరోసారి బి.పి. చెక్ చేయమని మధుకర్‌కి చెప్పాడు.

పల్స్, హార్ట్ బీట్ రీడింగ్ వరుసగా పరిశీలించాడు.

అలా ముప్పై నిముషాలు గడిచిపోయాయ్.

రేణూ, మధుకర్ సైలెంట్‌గా డా॥ సింగ్‌నే గమనిస్తూ, ఆయన సూచనలు, సైగలూ అమలు చేస్తున్నారు. సెకండ్లు, నిముషాలూ, గంటా గడిచింది. క్రమంగా మోహన్ కనుగుడ్లు అటూ, ఇటూ కదలసాగాయి.

అటు, ఇటు, తలతిప్పి చూశాడు.

డా॥! సింగ్‌ని, డా॥ మధుకర్‌నీ, రేణూని మార్చి మార్చి చూడసాగాడు.

అలా మరో పదిహేను నిముషాలు గడిచాయ్.

"డా॥ మోహన్ కోమాలోకి వెళ్లే సూచనలు వున్నాయంటారా? " అడిగాడు మధుకర్.

అడ్డంగా తల వూపాడు డాక్టర్ సింగ్.

కానీ మధుకర్‌కి మాత్రం ఆ లక్షణాలు స్పష్టంగా కోమా స్థితినే సూచించాయ్. డా॥ సింగ్ అనుభవానికి, మధుకర్ అనుభవానికి అక్కడే వుంది తేడా!

మధుకర్ ఆలోచించకుండానే నిర్ణయానికి వచ్చేస్తాడు. మనసులో గూఢంగా దాచుకోలేడు. బయటికి చెప్పేదాకా తోచదతనికి. అందుకే వెంటనే కోమాలోకి వెడతాడనే సందేహాన్ని వెల్లడించాడు. మరో ముప్పై నిముషాలు గడిచాయ్.

అప్పుడు... ముగ్గుర్నీ గుర్తుపట్టి, పేరుపేరునా విష్ చేశాడు మోహన్.

తన తొందరపాటుకి, సిగ్గుపడ్డాడు మధుకర్.

డా॥ సింగ్ వైపు మన్నించమన్నట్టు చూశాడు.

ఆయన చిరునవ్వుతో, "మిస్టర్ మధూ! నువ్వు చెప్పింది కూడా ఒక రకంగా కరక్టే! అయితే పేషెంట్‌కి మార్ఫియా ఇస్తే, బిపి ఎక్కువై, సడన్‌గా పెరాలసిస్ స్ట్రోక్ వచ్చినా, ముందు అతడి అనారోగ్య లక్షణాలు తెలియకపోయినా, నువ్వు చెప్పిన లక్షణాలు కనబడినప్పుడు, కోమాకి గురి అవుతాడు. అయితే వీటిలో ఏదీ మోహన్‌కి లేవు. కనుక కాదని చెప్పగలిగాను. ఏ పేషెంట్‌కైనా ఈ లక్షణాలు కనబడితే, నువ్వు వెంటనే తగిన ట్రీట్‌మెంట్ ఇవ్వాల్సిన విషయం మాత్రం మరచిపోవద్దు" అంటూ చెప్పారు. బయటకు వచ్చాక, తన రూమ్‌లో కూర్చోబెట్టి!

"సారీ డాక్టర్! నన్ను నేను కంట్రోల్ చేసుకోలేని వీక్నెస్ ఎలా పోతుందో తెలియడం లేదు. ఒకసారి మీరు పూర్తిగా చెకప్ చేసి, అడ్వయిజ్ ఇవ్వండి" అన్నాడు మధుకర్ నిజాయితీగా!

"మరేమీ ఫర్వాలేదోయ్. ఒకొక్కరికి ఒకో లక్షణం వుంటుంది. కొందరు అనుకున్నవి చెప్పాల్సి వచ్చినా, పెదవి విప్పరు. అంతా అయిపోయాక, 'నేను సరిగ్గా ఇదే అనుకున్నాను. కానీ సంశయం వలన చెప్పలేదు' అంటూ వుంటారు. ఒక రకంగా ముందుగా

అనుకున్నది చెప్పడం మంచిదే!

అయితే మనిద్దరం మాట్లాడుకునేప్పుడే చెప్పాలి సుమా! లేకుంటే, అప్పుడే స్పృహ లోకి వచ్చే పేషెంట్ నీ మాటలకు భయ పడి, నిజంగానే స్పృహ తప్పుతాడు.

నీ వైఫ్ ఆరోగ్యం ఎలా ఉందిప్పుడు? నువ్వసలు మోహన్ దగ్గిరకి అటెండవు తావో లేదో... అయ్‌మీన్ అటెండ్ కాలే వేమో అని ఆలోచిస్తూనే వున్నాను" అన్నాడు డా॥ సింగ్.

"బాగాలేని మాట నిజమే! నేను రేణూతో ఇదే విషయం చెప్పి, డాక్టర్ కిరణ్‌ని చూస్తుండమన్నాను. కానీ నా వైఫ్ ఒప్పుకో లేదు డాక్టర్! 'డాక్టర్ సాబ్ మీకు అప్పగిం చిన బాధ్యత ముఖ్యమైనది. నాకేమీ ఫర్వా లేదు. వెళ్ళమని' బలవంతాన పంపిం చింది. అటు ఆమెను వదలలేక, ఇటు రేణూ ఎటువంటి ప్రమాదంలో పడుతుందో అని, నా మైండ్ పనిచేయనే లేదు. అయితే అంతా కుదుటపడింది. మీరు వచ్చేశారు. నేను కూడా మా బంధువుని పిల్చి, నా వైఫ్‌కి తోడు వుంచాను" అన్నాడు మధుకర్ అప్పుడు జరిగినదంతా వివరించి.

"మిస్టర్ మధూ! నేను వెళ్లాక, కెనడాలో కూడా, కొందరు డాక్టర్స్‌తో మోహన్ గురించి డిస్కస్ చేశాను. రేణూ గురించి చెప్పలేద నుకో. ఎటొచ్చి, ఏం జరిగినా ఆ అమ్మాయి మధ్యలో నలిగిపోతుందని! మన ప్లాన్, ఎక్స్ పెరిమెంట్ గురించి ముఖ్యమైన పాయింట్స్ మాత్రం చెప్పాను. వాళ్లు కూడా ఎంక రేజ్‌మెంట్‌గానే మాట్లాడారు. కొందరు. హేళన చేయక పోలేదు. మేము కూడా ఎన్నో రకాలుగా, రీసెర్చి చేస్తున్నాం. అమెరి కాలో అయితే చెప్పక్కర్లేదు. అక్కడ ఎంకరే జ్‌మెంట్‌కి, ఫైనాన్స్‌కి, ఇంటెలిజన్స్‌కి లోటు లేదు. ఆఫ్టాల్ మీరు ఏ రకంగా సాధించగ లరో చూద్దాం" అన్నట్టు మాట్లాడేరు.

మధూ! ఈ మహాయజ్ఞంలో పాల్గొన్న వారందరినీ ప్రోత్సహించి అందువలన దక్కే సంతృప్తిని దృష్టిలో ఉంచుకుని, తగిన సలహాలు ఇస్తారని ఆశతో డిస్కస్ చేస్తే, మనకు 'అసాధ్యం' అన్నట్టు మాట్లాడారు చూడు. ఎంత బాడ్ థింగ్?"

"యస్ డాక్టర్! అందుక్కారణం, మన దేశంలోని మేధావులు కొందరు విదేశాల మోజుతో, మన దేశాన్ని విడిచివెళ్ళడం! మన దేశం వీసాలు ఇవ్వకుంటే, వక్రమా ర్గంలో విదేశీ అమ్మాయిలను పెళ్ళి చేసుకుని మరీ వెళ్లిపోతున్నారు. పోనీ నిజంగానే అక్కడ వనరులు, అవకాశాలు అందిపుచ్చు కోడానికి పెళ్లి చేసుకున్నారని అనుకున్నా, తీరా అవసరం తీరాక, గ్రీన్ కార్డ్ హోల్డర్ అయిన తర్వాత డైవోర్స్ ఇస్తున్నారు. అంటే నిజాయితీగా కట్టుబడి వుండటం లేదు. ఈ రోజు మనకు తెలుసు. విదేశాలకి దీటుగా మన దేశంలోనూ వైద్య సదుపాయాలు, హాస్పిటల్లో సౌకర్యాలు లభిస్తున్నాయి. మీవంటి-వృత్తినే ధర్మంగా నమ్ముకున్న గొప్ప వ్యక్తులు వున్నారని, నమ్మకంతో నైబర్ కంట్రీస్‌లో వారంతా ట్రీట్‌మెంట్‌కి మన దేశానికి వస్తున్నారు.

డాక్టర్! టాపిక్ వచ్చింది కనుక మాట్లాడ తాను. ఇటీవల డబ్బుకోసం నీచానికి ఒడి గట్టే డాక్టర్స్ కొందరు. విపరీతంగా పెరిగి పోయారు. పూర్ పీపుల్స్‌కి అందే సహా యాన్ని అక్రమంగా దిగమింగుతున్నారు. పదోక్లాస్ ఫెయిలైన వాడు, కాస్త తెలివి అంటూ వుంటే దాన్ని అక్రమాలకీ, మోసం చేయడానికీ వినియోగిస్తున్నారు. వీరిలో డిగ్రీలు, డాక్టరేట్స్, గోల్డ్‌మెడలిస్ట్స్ కూడా వుండటం విచారించతగ్గ విషయం.

డాక్టర్ వృత్తిని ఎంచుకునేటప్పుడు ఒక ప్రాణదాతగా, తన చదువును సద్విని యోగం చేయగల మహాభాగ్యంగా, పేదల పాలిట," ఆత్మీయుడిగా, న్యాయం చేయాల నుకునేవారు తక్కువగా వున్నారు.

సీటునుంచి డిగ్రీ డాక్టరేట్, గోల్డ్‌మెడల్

కూడా డబ్బుతో 'కొనగల'వాళ్ళు బయలు దేరడంతో, విద్య ఈరోజు బిజినెస్‌గా, చీప్‌గా మారిపోయింది. అంతేకాదు డాక్టర్! మాకజిన్ ఒకామె పేరు గడించిన కార్పొరేట్ హాస్పటల్లో, ఎంతో పేరు ప్రఖ్యాతులు గల డాక్టర్ దగ్గిరకి జనరల్ చెకప్‌కి వెళ్ళిందట. ఆమెకు డాక్టర్ అంటే ప్రాణదాత అనీ, దేవుడనీ, నమ్మకం. ఆ నమ్మకంతో వెళ్ళిన ఆమె పాలిట ఈ డాక్టర్, అపరకీచకుడిగా మారి అసభ్యంగా ప్రవర్తించడంతో, హాస్పటల్ ఛైర్మన్‌కి కంప్లయింట్ చేసింది. ఆ తర్వాత వాళ్ళంతా మాకజిన్ కాళ్ళమీద పడి, సారీలు చెప్పి, మరో డాక్టర్‌ని పిలిపించి, ఫ్రీగా A టు Z టెస్ట్స్ అన్నీ చేయించి, ఈ విషయం ఎవరికి చెప్పవద్దని అయిదు లక్షలు ఇచ్చారట. చూడండి డాక్టర్ సింగ్! ఎంత సిగ్గుమాలిన పనో!" ఆవేశంగా అన్నాడు మధుకర్.

"అవును మధూ! కొందరి పేరు వినడానికే కంపరంగా వుంటుంది. మనలాటి వాళ్ళం సిగ్గుతో తలవంచుకోవల్సిన పరిస్థితిని తెస్తారు. నాకు తెలుసునోయ్! నా దగ్గిర అలాంటి వాళ్ళ పేర్లు లిస్ట్ వుంది. అందుకే మావాళ్ళు ఎవరేనా ఏ డాక్టర్ పేరు సజస్ట్ చేస్తారని అడిగితే 'వెళ్ళకూడని' వాళ్ళ పేర్లు చెబుతూంటాను. ఈ విషయాలన్నీ మన దేశం ఎంతో గొప్పదని, శాంతి, సహనం, మంచితనం ఉదారబుద్ధి, ఆవహించిన కర్మభూమి అనీ, పురాణాలు వేదాలూ, దేవుడూ మన దేశంలో పుట్టి, ప్రజలకు రక్షగా వున్నాయని విదేశీయులంతా అనుకుంటూంటే, ఒకోసారి తెల్లమొహం వేయాల్సి వస్తుంది. వాటితోపాటు, మోసం, దగా, కుట్ర, హత్యారాజకీయాలు, గూండాయిజంతో పరిపాలించే లీడర్స్, అవినీతి కంపుకొట్టే పరిపాలనా... ఎవరికి చెప్పుకోగలం? అందుకే, మనవరకూ ఒక సిద్ధాంతాన్ని నమ్ముకుని, ఆచరించడం ఒక్కటే మనం చేయగల మంచి పని!

ఇంతకీ హాస్పిటల్ ఆఫర్ చేసిన మనీని మీకజిన్ తీసుకున్నారంటావా?"

"ఆ... తీసుకుంది. తీసుకుని, దాన్ని పత్రికలవాళ్ళకి చూపించి మరింత యాగీ చేసింది. ఆ డబ్బును అనాధ బాలల సేవా సదనానికి డొనేట్ చేసింది".

"మంచిపని చేసింది. పబ్లిక్ వూరుకోకూడదు. ఇటువంటి వారిని నడివీధిలో నిలబెట్టాల్సిందే! అప్పుడుగాని అక్రమాలకు అడ్డు వుండదు" అన్నాడు డాక్టర్ సింగ్.

ఈ మధ్య పదిరోజులుగా డా॥ సింగ్ దేశంలోనే లేకపోవడంతో, ఇద్దరూ చాలా సేపు అలా మాట్లాడుకుంటూ వుండిపోయారు.

హఠాత్తుగా మధుకర్‌కి గుర్తువచ్చింది. డా॥ సింగ్ ఫ్లయిట్ దిగి, సరాసరి ఇక్కడికే వచ్చారని!

"సారీ డాక్టర్... మాటల్లోపడి మరచిపోయాను. మీరు లంచ్ తీసుకున్నారా ఇప్పుడే వెళ్ళి, ఏమైనా తెస్తాను..." అంటూ బయటకు వెడుతున్న మధూని, వారించి, "వద్దు మధూ! ఆకలిగాలేదు. ఇంటికెళ్ళి వస్తాను" అన్నాడు డా॥ సింగ్.

"ఇంటికెళ్ళి, రెస్ట్ తీసుకోండి. నేను వుంటానిక్కడ. అవసరం అయితే పిలుస్తాను" అన్నాడు మధు.

అంతలో మధుకర్ ఇంటి నుంచి భోజనం కారేజ్ తీసుకుని వచ్చిన మనిషి "డాక్టర్ సాబ్! కారియర్ తెచ్చాను. ఇంటికి వస్తారా? ఇక్కడ వుంచమన్నారా" అన్నాడు.

ఆరోగ్యం బాగుండకపోయినా హాస్పిటల్, పేషెంట్స్ ముఖ్యం అనుకుని వృత్తిపట్ల బాధ్యత విస్మరించని మధుకర్, భార్య, అతని సదుపాయాలను అనుక్షణమూ కనిపెట్టుకుని వుండటం చూసిన డా॥ సింగ్‌కి మనసు ద్రవించింది.

"నీ మిసెస్‌కి ఎలా వుంది మధూ? ఆవిడ నీకోసం భోజనం పంపించారు.

ఇంట్లో తోడు ఎవరైనా వున్నారా?" అడిగాడు సింగ్ అభిమానంగా!

"అవును డాక్టర్. వున్నారు. నా వైఫ్ ఆరోగ్యం అలాగే వుంది. అయినా నా గురించి ఆలోచిస్తూనే వుంటుంది. ఎటూ కారియర్ తెచ్చాడు. ఇక్కడే మీరుకూడా భోజనం చేద్దురుగాని రండి..." అన్నాడు మధుకర్.

కారియర్ అక్కడ టేబుల్ మీద పెట్టి వెళ్ళాడా మనిషి.

"సరే! ఇక ఇంటికి వెళ్ళి మాత్రం ఏంచేయాలి? ఇక్కడే స్నానంచేసి, డ్రస్ ఛేంజ్ చేసుకుంటాను. ఇద్దరూ కలసి డిన్నర్ చేద్దాం..." అంటూ డాక్టర్ సింగ్ ఇంటికి వెళ్ళే ప్రయత్నం మానుకున్నాడు.

డిన్నర్ చేసిన వెంటనే నిద్ర ముంచుకొచ్చింది ఆయనకు. స్పెషల్ రూంలో కాసేపు పడుకుంటానంటూ వెళ్ళాడు.

మధుకర్‌కి నైట్ డ్యూటీస్ అలవాటే కనుక పేషెంట్స్‌ని చూసి వద్దామని రౌండ్స్‌కి బయలుదేరాడు.

'హాస్పిటల్ అంటేనే అదో ప్రపంచం. దేశంలో జనాభా పెరుగుతోంది. అందుకు సాక్ష్యంగా హాస్పిటల్స్ ఎన్నివున్నా, అంతకు మించి రోగులూ వస్తూనే వున్నారు. రకరకాల డిసీజస్, ప్రాణాంతకమైనవి కొన్ని. ప్రాణాలు తీయకపోయినా, జీవితకాలం వేధించే రుగ్మతలు కొన్ని. ఇవికాక ఎన్నో కొత్త కొత్త జబ్బులు పుట్టుకొస్తూనే వున్నాయి. ఒకప్పుడు ప్లేగు, క్షయ, కేన్సర్, గుండె జబ్బులులాంటి ప్రాణాంతక వ్యాధులకు కాలక్రమంలో నివారణ చర్యలు వ్యాధి తీవ్రత తగ్గించే ఔషధాలు వచ్చాయి. నిరంతర పరిశోధనల్లో కేన్సర్, గుండె జబ్బుల్లో అనేక రకాలున్నట్టు, వంశపారంపర్యంగా వచ్చినవి కొన్ని, అని తెలుసుకుని కేవలం ఆయుః ప్రమాణాన్ని పొడిగించే మందులు కనుగొన్నారు. కేన్సర్‌లో కొన్ని రకాలు మనిషి మరణాన్ని ధృవీకరిస్తే, మరి కొన్ని రకాలు ముందుగా గుర్తించబడినందు వలన నివారణకు మార్గాలు కనిపిస్తున్నాయి. తాతలనాడు గడ్డ పెరుగు, వెన్న, మీగడలతో సుష్టుగా భోజనం చేసి ఎనభై సంవత్సరాలు సునాయాసంగా జీవించగలవారు,'మా కాలంలో ఈ మాయదారి జబ్బులు ఏమిటో ఎరుగుదుమా?" అనుకుంటారు. ఇప్పుడు అతి జాగ్రత్తగా వుంటున్నా, ఎక్సర్‌సైజ్, యోగా, న్యూట్రిషియస్ ఫుడ్ అంటూ ఆహార నియమాలు పాటిస్తూ కంట్రోల్డ్‌గా వుంటున్నా, ఎక్కడో సౌతాఫ్రికా కోతుల్నుంచి వచ్చే డిసీజస్ మానవాళిని అతలాకుతలం చేసి, అదరగొడుతున్నాయి.

పూర్వకాలం ఈ రకమైన జబ్బులు లేవా? వుండేవుండవచ్చు ఈ రోజుల్లో కామన్ అయిన హైపర్ టెన్షన్, డయాబెటిస్, కేన్సర్ నూటికో కోటికో వున్నా, సరియైన డాక్టర్స్, వైద్య సైదుపాయమూ లేక అవి గుర్తింపబడలేదేమో! ఎవరికి తోచిన పేరు వాళ్ళు పెట్టి, వాళ్ళకు తెలిసిన, అందుబాటులో వున్న, వైద్యం చేసుకునేవారు. అందుకే తగ్గటానికి చాలాటైమ్ తీసుకునేది. లేదా వ్యాధి ముదిరిపోయి మనిషి క్షీణదశకు చేరుకునేవాడు'.

రేఖ, మంగళ, రోహిణి కలుసుకున్నప్పుడు ఈ రకంగా చర్చించుకోవడం మొదలు పెట్టారు. మంగళ తాను విన్నవి చూసినవి చెప్పింది. "మా నాన్నమ్మ ఒకావిడకు పార్శ్వపు నొప్పి అనేవారు. పాపం ఆవిడ యమబాధతో అరిచేది. విపరీతమైన తలనొప్పి అంటూ ఏడ్చి రాగాలు పెట్టేది. అప్పట్లో ఆయుర్వేద డాక్టర్ ట్రీట్‌మెంట్ ఇచ్చేవారు. అవి కాలకూట విషం లాంటి గుళికలు. ఎన్ని మింగినా ఆవిడ బాధ తగ్గేదికాదు. అదే ఇప్పుడు మైగ్రెయిన్ అంటున్నారు. దీన్నిబట్టి అప్పుడు జబ్బులు రాలేదని అనుకోడానికి లేదుకదా? అంది".

"నిజమే! నాకు మా అమ్మగారు చెప్పడం గుర్తువస్తోంది. ఆవిడ తండ్రికి వీపుమీద రాచపుండు అంటూ వుండేదట. ఆయనకూడా చాలా బాధపడేవార్ట. కోపం, చిరాకు, అసహనంతో, తాను తప్ప అందరూ సుఖంగా ఉన్నారని తిట్టిపోసేవా రట. అది 'కేన్సర్' కావచ్చు క్రమంగా ఆనాటి నుంచి ఈనాటి వరకు ఆహారపు అలవాట్లు మారుతూ వచ్చాయి. పరిస రాలు, వాతావరణం కలుషితమైపోయి అంతుపట్టని వ్యాధులు ఎటాక్ అవుతు న్నాయి. వీటితోబాటు ట్రీట్‌మెంట్‌కి కావల సిన మార్గం అన్వేషించాలి కనుక, వ్యాధు లను అదుపు చేయాలి కనుక, సహజంగానే మెడికల్ కోర్స్‌ల్లో కొత్త సిలబస్‌ను ప్రవేశ పెట్టడం, స్పెషలైజేషన్ కోర్స్‌లకు ప్రతిభ కల వారిని విదేశాలకు అనుమతించడం, కాన్ఫరెన్స్‌లో చర్చలూ, పరిశోధనలకు డాక్ట ర్స్‌ను ప్రోత్సహించడం, ఇలా ఎన్నో రకాల మార్పులు చోటు చేసుకోవడం మనం చూస్తున్నాం" అంటూ చెప్పారు రోహిణి.

"మా అక్కలకు గైనిక్ ప్రాబ్లమ్స్ వస్తే, మాన్నాగారి చాదస్తం, అమ్మ అమాయ కత్వం కారణంగా, లేడీ డాక్టర్‌కి చూపించు కోవాలని కూడా వాళ్లకి తెలిసేది కాదు. చివరకి వాళ్లు ఎన్నో మాగజైన్స్, న్యూస్ పేపర్స్‌లో వచ్చే ఆర్టికల్స్ చదివి, వారి బాధలకు పరిష్కారాలను తెలుసుకున్నారు. ధైర్యంగా డాక్టర్‌తో చర్చించగలిగారు. ఈ రోజు ఏ బాధవున్నా, నివారణ అసాధ్యం కాదు అనేటంతగా వైద్య సదుపాయాలు వున్నాయి. పూర్వపు రోజుల్లో మహిళలకు మెనోపాజ్ దశ అనేది ఉంటుందని తెలి యదు. బాధలకు వృద్ధాప్యమే కారణంగా భావించే వారు. ఇప్పుడో, అన్నీ తెలుసుకో గల విజ్ఞానం మన ముందుకు వచ్చింది" అంటూ తనకు తెలిసిన విషయాలు చెప్పింది రేఖ.

ఎన్ని మాట్లాడుకున్నా చివరికి ప్రసంగం రేణు వైపు మళ్ళింది. "రోహిణిగారూ! మీలో ఎన్ని ఆలోచనలు వున్నాయండి. మీరు బాగా పుస్తకాలు చదువుతారా? " అడిగింది మంగళ.

"బుక్స్ ఒకటే కాదు అత్తయ్యా! ఆవిడ బాగా చదువుకున్నారు. ఎంబిబియస్ చదు వుతూండగా యాక్సిడెంట్ అయింది. చాలా కాలం హాస్పటల్లో వుండాల్సి వచ్చింది. తలకు బాగా గాయాలు తగలడంతో, చదువు మధ్యలో ఆగిపోయింది! అందుకే ఆవిడకు వైద్యరంగమంటే చాలా ఇష్టం" అంటూ చెప్పింది రేఖ.

"అందుకే రేణూ కూడా ధైర్యంగా, శ్రద్ధగా, పేషెంట్స్ మధ్య వుండిపోయింది" అంటూ మెచ్చుకుంది మంగళ.

డా॥ మధుకర్ హాస్పిటల్లో తన రౌండ్సు పూర్తి చేసుకుని చివరగా, మోహన్ రూమ్ దగ్గిరకి వచ్చాడు. అక్కడ రేణూ పరిస్థితి ఏమిటో అతడికి ముందు తెలియలేదు. ఒక్క క్షణం తానెక్కడున్నదీ మరచిపో యాడు మధు ఆలోచనల్లో పడి! అంతకు ముందే ఎందరో నిర్భాగ్యులను ఆదరంగా పలకరించాడు. వారిని చూసినప్పుడు మనసు చెదిరిపోతుంది. ఎవరో తప్పు చేస్తారు. మరెవరో శిక్ష అనుభవిస్తూం టారు. ఎలా ఈ దారుణమైన వ్యాధిని అరి కట్టడం? ఇది అన్ని జబ్బుల్లాగ డాక్టర్ ట్రీట్‌మెంట్‌తో, స్వస్తత చేకూరే వ్యాధి కాదు. మనుషుల నడవడి, సౌశీల్యం, నియ మాలకు సంబంధించిన ప్రమాదకారి. ప్రకృతి సహజమైన కోరికలను అదుపు చేయలేని మనిషి క్షణికావేశంలో విచక్షణ కోల్పోయి, ఎయిడ్స్ కోరలకు బలి అవుతు న్నాడు. పాపమో - పుణ్యమో, తప్పో - ఒప్పో ఒకసారి ఎయిడ్స్ సోకిన వ్యక్తిని గనుక గుర్తించగలిగితే, బర్త్ కంట్రోల్ ఆప రేషన్ విధానంలా, మానవుడికి, సెక్స్ కోరిక కలగకుండా చర్య తీసుకోక తప్పదు. ఇందుకు ఎన్నో అడ్డంకులు, చట్టాలు ఏర్పడ

వచ్చు. అయినా సరే సాధించి తీరాలని అనుకుంటున్నాం. ఇప్పటికే జరగరాని నష్టం జరిగిపోయింది. ఎంత త్వరగా మేల్కొగలిగితే అంత మంచిది. అను కుంటూ రేణూ పరిస్థితి గ్రహించి త్వరత్వ రగా డాక్టర్ సింగ్‌ను పిలుచుకుని రావడా నికి ఆయన రూమ్‌లో అడుగు పెట్టాడు.

"ప్లీజ్ మోహన్... మృగంలా ప్రవర్తిం చకు. ఇప్పటివరకూ బుద్ధిగా నేను చెప్పి నట్టు విన్నావు. డాక్టర్స్‌కి ఎంతగానో సహకరించావు. ఇప్పుడు ఏమైంది నీకు? " సహనంతో బ్రతిమాలింది రేణు.

"నాకీ లైఫ్ బోర్ కొడుతోంది. అసలే నాది ఒకచోట జడపదార్థంలా ఉండే స్వభావం కాదు. ఈ ప్రపంచంలో ఎన్నో అనుభవాలున్నాయి. చాలా కాలంగా అమ్మ, నువ్వు సెంటిమెంట్స్‌తో నన్ను కట్టి



పడేశారు. చాలా రోజులు వేస్ట్ చేసుకున్నాను. నేను అనుకున్నది జరగడమే నాకు తెలుసు. అయితే రేఖ విషయంలో నేను అనుకున్నది జరగలేదు. నీ గురించి పైకి చెప్పుకోలేదు కానీ... వచ్చిన ఈ సదావకాశాన్ని వదులుకోను. రేణూ ఎంత అసాధ్యమైనదైనా దారికి తెచ్చుకోగల నేర్పు నాకుంది. అటువంటిది ఇంత దగ్గరగా అందుబాటులో ఉన్న నీ అందాలు అనుభవించకపోతే ఈ మోహన్‌కి అవమానం..." అంటూ రేణూ చేతులు పట్టుకున్నాడు.

"మోహన్! నువ్వు కావాలని చెడిపోయావా? లేదు. తీవ్రమైన మానసిక వేదనతో ఎవరి మీదనో కసితో, నీ లైఫ్‌ని పాడుచేసుకున్నావు. అది తప్పని రేఖని చూశాక తెలుసుకున్నావు. రేఖతో నీ జీవితం ముడిపడివుంటే నువ్వు చాలా మంచి వాడిగా మారిపోయే వాడివి. నీ లైఫ్ అందరిలాగే ఆనందంగా సాగిపోయేది. ఉన్నతుడిగా మిగిలిపోయే వాడివి. తెలిసో, తెలియకో, ఇంటి వాతావరణమో, దురదృష్టవశాత్తు నిన్ను అనారోగ్యానికి గురి చేసింది. దాంతో రేఖని తప్పనిసరిగా దూరం చేసుకోవలసి వచ్చింది. ఇటువంటి విఘాతం నిన్ను పిచ్చివాణ్ణి చేసింది. మీ అమ్మగారు, రేఖ నిన్ను చాలా శ్రమపడి మామూలు మనిషిగా చేయడానికి ప్రయత్నించారు. కొంతవరకూ విజయం సాధించారు. నేను కూడా వాళ్ళిద్దరికి తోడు కావాలనుకున్నాను. కావాలని నేనొక లక్ష్యాన్ని నిర్దేశించుకుని ఈ ఢిల్లీకి వచ్చాను. నాపట్ల ప్రవర్తించాల్సిన తీరు ఇదేనా?" మృదుమధురంగా చెప్పింది రేణు.

"రేణూ! మీరంతా నాలో ఏ మార్పుకోరి త్యాగాలు చేశారో, శ్రమ పడ్డారో, ఇంకేదో చేశారో నాకు అవసరం లేదు. నాక్కావలసింది నువ్వు! ఇప్పుడు నేనింక ఎవరి గురించీ ఆలోచించను. నువ్వేం చెప్పినా ప్రయోజనం లేదు". మోహన్ ఆవేశంతో రేణూని స్వాధీనంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించసాగాడు. రేణూ ఎక్కడా లేని బలం తెచ్చుకుంది. 'డా॥ సింగ్ చెప్పిన విపరీత ధోరణి మోహన్‌లో కనబడుతోంది. 'నన్ను నేను రక్షించుకోకపోతే ఇంత కాలం పడిన శ్రమంతా వృథా అవుతుంది. ఇప్పటికే పెరిగిపోతున్న ఈ ఎయిడ్స్ మహమ్మారి నన్ను కూడా సోకుతుంది. మోహన్‌ని ఏం చేసి అయినా నన్ను నేను రక్షించుకోవాలి' అనుకుంటూ డాక్టర్ ఇచ్చిన ఇంజక్షన్ మాటల్లో పెట్టి, అతడికి ఇవ్వాలని చూసింది. మోహన్‌ని వారించి రెచ్చగొట్టకుండా అంగీకరించినట్టు నటించి దారిలోకి తీసుకురావాలని అనుకుంటూ.

"మోహన్! నువ్వు నిజంగా మోహనుడివే. సరే! నేను ఇక్కడకు వచ్చే ముందు అన్నిటికీ సిద్ధపడే వచ్చాను. నా కోసం అలమటించిపోతూ, ఇంతదాకా చవిచూడని సుఖాన్ని ఇస్తానంటూ వచ్చిన నిన్ను వదులుకోవడం నా తెలివితక్కువే. అందుకే నేను ఏమైనా ఫర్వాలేదు. నీ కోరిక తప్పకుండా తీరుతుంది. అయితే నాకు ఈ వాతావరణంలో, హాస్పిటల్లో మొదటిసారి ఈ అనుభవాన్ని పొందటం ఇష్టం లేదు. మరో ఆలోచన చెప్పు. సంతోషంగా నీ ముచ్చట తీర్చుకుందువుగాని" అంది.

"నిజంగానా రేణూ! నా మీద నీక్కూడా దయ కలిగిందా? నా కోసం ఏదైనా చేయాలని సిద్ధంగా వున్నావా? నేనింత కాలం దౌర్భాగ్యుణ్ణి అనుకున్నాను. కాదని అదృష్టవంతుణ్ణి కూడానని అర్థమైంది. రా రేణూ. మన మధ్య పోరాటం ఎందుకు? నిన్ను అపురూపంగా నా గుండెల్లో దాచుకుంటాను. ఈ ఒక్క అనుభవంతో హాయిగా చచ్చిపోతాను. నాకేమీ వద్దు" ఒక రకమైన ట్రాన్స్‌లో చెప్పాడు మోహన్.

"అలాగే మోహన్! స్త్రీ, పురుషుల మధ్య ఆకర్షణా, కోరిక ప్రకృతి సిద్ధమైనది. అలా అని మృగంలా ప్రవర్తించలేం కదా?

అందుకే పెళ్ళని, ఒక స్త్రీ, ఒక పురుషుణ్ణి, ఒక పురుషుడు ఒకే స్త్రీని అనుభవించడం అవసరమని మనకు తెలుసు. కానీ నువ్వు ఆ ధర్మాన్ని అతిక్రమించబట్టే కదా? ఇన్ని బాధలు పడ్డావు. మోహన్ నువ్వొక విష యాన్ని మరచిపోతున్నావు. నీకెన్నో అను భవాలున్నాయి. ఆ కారణంగా జీవిత కాలం అనుభవాన్ని పోగొట్టుకున్నావు. కానీ నేను ఏం తప్పు చేశానని ఒకే ఒక్క అనుభవంతో జీవితాన్ని కోల్పోవాలో ఆలోచించగలవా?

మోహన్! మనిషి జన్మ అత్యంత వున్నత మైనది అంటారు. అందులో నిజం ఎంతో నాకు తెలియదు కాని, మంచి పని చేయడం, జీవిత కాలం మనశ్శాంతితో ఆద ర్శవంతంగా వుండటమే మహోన్నతమని నేను భావిస్తాను. అందుకే పెళ్ళి, సంసారం అనే జంఝాటం పెట్టుకోలేదు. పెళ్ళికి ఇంకో పేరు శారీరకానందమే కదా? ఇదే కావాలని అనుకుంటే ఇంతదాకా ఆగాల్సిన అవసరం లేదు. కాని, నువ్వు మాత్రం రక రకాల అమ్మాయిలతో, అనుభవమే శాశ్వితానందంగా భావించావు. ఇప్పుడు కూడా ఇంకా అదే ఆలోచనలో ఉండటం బాధగా ఉంది. ఒక్కటి ఆలోచించు. నేను ఎవరు? ఎందుకోసం అతిప్రమాదమైన నీ చేరువలో ఉంటున్నాను? ఇందువలన నాకు లభించేది ఏమిటనే విచక్షణ కోల్పో వద్దు మోహన్. గతంలో జరిగినదాన్ని దృష్టిలో ఉంచుకుని, ఇప్పటికైనా పరిశుద్ధ మైన, పవిత్రమైన, లైఫ్‌ని గడపాలని ఎందుకు కోరుకోవు? "

"రేణూ! నువ్వు చెప్పే నీతి సూత్రాలు నా బాధను చల్లార్చవు. రెట్టింపు చేస్తాయి. నిజమే! నా జీవితం, నా పుట్టుకా అను భవం కోసం అని భావించాను. అందులోనే నాకు పరిపూర్ణ ఆనందం కలుగుతుంది. ఎందరో ఎన్నో కోరుకుంటారు. అవి వారి వారి మనస్థితినిబట్టి ఉండవచ్చు కోరుకు న్నది సాధించడమే వారికి తృప్తి, సంతోష మూను. నీది కంఠ శోష తప్పితే, నాలో మార్పు రాదు. ఈరోజు నువ్వు తప్పించుకో లేవు" అంతదాకా దూరంగా కూర్చుని మాట్లాడిన మోహన్ తిరిగి రేణూ వైపు అడుగులు వేయసాగాడు.

"మోహన్! నేను చెప్పినవి నీతి సూత్రాలు కానేకావు. నిన్ను రెచ్చగొట్టడమూ కాదు. నువ్వు కోరుకున్న క్షణికానందం, మరో మనిషిని కాటు వేస్తుంది" ఆగు. అక్కడే ఉండు. నిగ్రహాన్ని కోల్పోవద్దు. ఉన్నతమైన ఆశయం కోసం మానవాళికి జరిగే ఉపకారం కోసం అహర్నిశలూ నిద్రా హారాలు మాని, కృషి చేసే డాక్టర్స్ కోసం ఆలోచించు. మా అందరికీ సహకరించు" వేడికోలుగా చెప్పింది రేణు.

అతను ఏమనుకున్నాడో, అక్కడే ఆగిపో యాడు.

రేణు తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. గండం గడిచిందనుకుంది.

కాని మరుక్షణంలో అతడికి ఇవ్వాలని సిద్ధం చేసిన ఇంజక్షన్ సిరంజిని ఒడుపుగా అంది పుచ్చుకుని, రేణుకే చేస్తానంటూ వికృ తంగా నవ్వుతూ, వెంట పడ్డాడు మోహన్.

తలుపు తీసుకుని బయటకు వెళ్లడానికి లేదు. వారించిన వాళ్లకి మోహన్ చేతిలోని సిరంజితో ఇంజక్షన్ చేసే ప్రమాదం ఉంది. లేదా అతను ఎక్కడికైనా పారిపోవచ్చు డాక్టర్‌కి మెసేజ్ పంపడానికి షర్ట్ పాకె ట్‌లో ఉన్న సెల్ ఫోన్ తీసి, మాట్లాడే అవకాశం లేకుండా ఉంది. ఏం చేయాలో పాలు పోని రేణూకి, లాక్ చేసిన డోర్ బయట డా॥ సింగ్, మధుకర్‌లు కనిపిం చాక ధైర్యం వచ్చింది. విచిత్రం, వాళ్లిద్దరు డోర్ ఓపెన్ చేసి, లోనికి రాగానే అంత అల్లరి చేసిన మోహన్, ఏమీ తెలియనట్టు వెళ్ళి, బెడ్ మీద పడుక్కున్నాడు. డాక్టర్ క్షణం ఆలస్యం చేయకుండా తెచ్చిన ఇంజ క్షన్ చేసేశారు.

రూమ్‌లో రక్షణ కోసం పరుగులు పెట్టి, అలసిపోయిన రేణూని తీసుకుని డాక్టర్స్ ఇద్దరూ బయటికి వచ్చారు. పర్సనల్ రూమ్‌లోకి తీసుకు వెళ్ళి తాగటానికి వేడిగా కాఫీ ఇచ్చి, "రిలాక్స్ రేణూ..." అంటూ సముదాయించారు. కొద్దిసేపటికి రేణూ తేరుకుంది.

"రేణూ! మన పరిశోధనల్లో అత్యంత ప్రమాదకరమైనది ఇప్పటి మోహన్ పరిస్థితి! మధుకర్ నీ పరిస్థితి చూసి, నాతో చెప్పగానే వచ్చాను. ఈ ఇంజక్షన్ రోజంతా ఇస్తూంటే తప్ప. అతడికి మెలకువ వస్తే, చాలా కష్టం. అలా అని, ఇంజక్షన్ డోస్ ఇంక్రీజ్ చేయడం వలన మోహన్ కోమాలోకి వెళ్లిపోతాడు. నువ్వు ఇంటికెళ్ళి నాలుగు రోజులు రెస్ట్ తీసుకో అతణ్ణి మేము చూసుకుంటాం" అన్నాడు డాక్టర్ సింగ్.

"ఈ రోజు నైట్ మీరు ఇంటికి వెళ్లకుండా చేసింది మా ఇంటి నుంచి వచ్చిన భోజనం కారియర్. లేకపోతే మోహన్‌ని అదుపు చేయడం నా తరం అయ్యేది కాదు. నా మాట అస్సలు వినడు అతను. థాంక్ గాడ్" అన్నాడు మధుకర్.

"మనం థాంక్స్ చెప్పాల్సింది నీ వైఫ్‌కి మధూ!" అన్నాడు డా॥ సింగ్ నవ్వుతూ.

కాని అదే సమయానికి మధూ వైఫ్‌కి ఇంట్లో సీరియస్‌గా ఉంది. మధుకర్ బంధువు ఫోన్ చేసింది. మధూ, డా॥ సింగ్ బయలుదేరి వెడుతూ, మోహన్‌ని కనిపెట్టి ఉండమని మరో డాక్టర్‌కి అప్పగిచ్చి, రేణూని ఇంటికి పంపిస్తామన్నారు.

"నేనూ వస్తాను మేడమ్‌ని చూస్తాను డాక్టర్" అంటూ వారిని అనుసరించింది రేణూ. ఎనిమిది సంవత్సరాలుగా వ్యాధితో పోరాడి మృత్యువు విజయం సాధించింది. ముగ్గురూ ఇంటికి చేరుకునే సరికే ఆమె ఈ లోకాన్ని విడిచి వెళ్లింది. మధుకర్ గంభీరంగా బాధనంతా మనసులోనే దాచుకున్నాడు. డాక్టర్ సింగ్, రేణూ, అతడి భుజం మీద చేయి వేసి, మౌనంగా సంతాపం తెలియచేశారు. చావు పుట్టుకలు అతి సహజమైనవి. అందులోనూ డాక్టర్ వృత్తిలో ఉన్నవారు ఎందర్నో చూశాను. దీనావస్థలో అనుక్షణం జీవితాశ పెంచుకుంటూ, 'డాక్టర్ నన్ను బ్రతికించరూ?' అంటూ కొందరు వేడుకుంటే, 'ఈ బాధ భరించలేను. నన్ను త్వరగా పంపివేయండి డాక్టర్. అదే పెద్ద ఉపకారం' అని, మరి కొందరు కన్నీటితో అర్థిస్తారు. 'నవ్వుతూండే ఈ మనిషి పేషంటా? పొరబాటున రాంగ్ రిపోర్ట్ వచ్చి ఉంటుంది' అన్నట్టు కనిపించే వారు కళ్ల ఎదుటనే ప్రాణాలు కోల్పోతూ ఉంటారు. ఎక్కడో చాలా రేర్‌గా సరియైన టైమ్‌లో వ్యాధిని కనుక్కోవడం, ఆపరేషన్, ట్రీట్‌మెంట్ ద్వారా బాధగా వచ్చినవాడు కొండంత సంతోషంతో ఇంటికి వెళ్లడం... అదంతా ఒక మిరకిల్‌గా కనిపించేదే హాస్పటల్. అహోరాత్రులు చేసే పరిశోధనలు, సంజీవినిలాటి అవుషధాలు, అందుబాటులోకి వచ్చిన అత్యంత అధునాతనమైన పరికరాలు పేషెంట్స్ పాలిట వరాలు! అయినా ఒకోసారి మనిషి చేతిలో ఏదీ లేదన్నట్టు అంతు పట్టని, దిక్కు తోచనీయని ఆత్మ స్థయిర్యాన్ని దెబ్బ తీసే వ్యాధులూ వైద్య రంగానికి పెను సవాల్‌గా ఉంటూనే ఉంటాయి.

అలాటిదే ఎయిడ్స్! "డాక్టర్! ఈ వ్యాధి వ్యాపించకుండా ఏమీ చేయలేమా? మనిషి తెలిసీ ఎందుకు విఫలమవుతాడు? క్షణికానందం కోసం మరో లైఫ్‌ని నిలువునా కాల్చి పోతాడు?" అంది రేణూ విషాదంగా.

"డాక్టర్స్ కర్మ సిద్ధాంతాన్ని వల్లిస్తే హాస్యాస్పదంగా ఉంటుంది రేణూ! నువ్వు చెప్పినట్టు ఆత్మ పరిశీలన చేసుకునేది ఎవరు? ఏమీ తెలియని నిరక్షరాస్యుడు, అడవి మనిషి, మూర్ఖుడూ తప్పు చేశాడను

కోవచ్చు కాని మోహన్ వంటి వాళ్ళు ఎవరి మీదనో కసితో, అర్థం లేని ఆలోచనలతో జీవితాన్ని పాడు చేసుకోవడం విచారకరం. సాధారణంగా కింది తరగతి వారే తొందర పాటు చర్యగా ఈ వ్యాధి బారిన పడతారనుకోవడమూ పొరబాటే! హైక్లాస్ సొసైటీలో కూడా ఎయిడ్స్‌కి గురి అవుతున్నారంటే ఏమనుకోవాలి? చాలా కాలం వరకూ ప్రజల్లో ఎయిడ్స్ పట్ల అవగాహన లేని కారణంగానూ, సెక్స్ వర్కర్‌ల అజాగ్రత్త వల్లనూ ఈ వ్యాధి త్వరితంగా వ్యాపించిందని అనుకున్నారు. ప్రచారాన్ని ఎక్కువ చేశారు. ఇదొక గాలి వాటుగా సంవత్సరానికోసారి గుర్తు చేసుకుని, అదీ ఎవరో ఫారిన్ డెలిగేట్ వచ్చి గుర్తు చేస్తేనే హంగామా చేస్తుంది ప్రభుత్వం. అలా అని అన్నిటికీ ప్రభుత్వానిదే తప్పనీ అనలేం. ఆరోగ్యకరమైన నియమాలకు, కట్టుబడి ఉండాలనేది ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసిన విషయం. సకాలంలో పెళ్ళి, సంసారం, క్రమబద్ధమైన జీవితం కొనసాగించినపుడు, ఏ వ్యాధి గురించీ భయపడాల్సింది లేదు. ఈ లింక్ ఎలాంటిదంటే, ఎక్కడ పుట్టి, ఎక్కడ వ్యాపించి, ఎందర్ని కబళిస్తుందో! నివారించడం కష్టంతో కూడుకున్నది. కేవలం వ్యక్తి తనను తాను కంట్రోల్ చేసుకోగల విజ్ఞత కలిగి ఉండటమే వారికి రక్ష". రేణూ ఇల్లు చేరేవరకూ డాక్టర్ సింగ్ తన ఆలోచన్లు చెబుతూనే ఉన్నాడు.

"డాక్టర్! మీరు చెప్పే ప్రతీ మాటా నాకొక లెసన్. రండి. కాసేపు కూర్చుని వెడుదురుగాని" అంది కారు దిగిన రేణూ.

డా॥ సింగ్ కూడా ఆమెను అనుసరించాడు.

రేణూ ఫాదర్‌ని, మదర్‌ని పలకరించి, ఆ రోజు జరిగిన విషయాలు చెప్పాడు డా॥ సింగ్.

"మా రేణూ గురించి మాకేమీ దిగుల్లేదు డాక్టర్. అందులోనూ, మీవంటి ఉదాత్త హృదయుల చేదోడు ఉంది. మీ వంటివారి సాహచర్యంలో ఎన్నో నేర్చుకుంటుంది అనుక్షణం అమ్మాయిని కనిపెట్టుకుని ఉంటున్నారు. మీరంతా సాధించాలనుకున్న ప్రయత్నం నెరవేరితే మాకు అంతకంటే ఆనందం ఉండదు" అన్నారు భార్యాభర్తలిద్దరూ.

"ప్రయత్నాలు ఎన్నో చేస్తాం. సహకరించే వారు లభించడమూ అరుదే. రేణూ ఆ సహకారాన్ని అందించడం వలన, మా ప్రయత్నం ఫలించే అవకాశం లభించింది. ఎనీవే! మీరు చెప్పినట్టు అంతా అనుకున్నట్టే జరిగితే, అందరమూ భాగస్థులం అవుతాం. రేణూని నాలుగు రోజులు ఇంటి దగ్గర రెస్ట్ తీసుకోమని చెప్పాం. దిగ విడిచి వెళ్ళాలని వచ్చాను. మరి నేను వెళ్ళి వస్తాను. చాలా లేట్ అయిపోయింది" అంటూ డాక్టర్ సింగ్ లేచి నిలబడ్డాడు.

చాలా రోజుల తర్వాత అమ్మ చేతి వంట తిని, కంటి నిండా నిద్ర పోయింది రేణూ. తెల్లవారగట్ల మెలకువ వచ్చి, గతాన్ని తల్చుకుంది. 'నిన్న రాత్రి గనుక మోహన్ చేతిలో పడి ఉంటే, నా పని ఏమయ్యేది? శాశ్వితంగా అదే హాస్పిటల్లో మోహన్‌తో పాటు మరో రూమ్‌లో నివాసం ఏర్పరచుకోవలసి వచ్చేది. మామూలుగానే మగవాడిది బలమైన ఆకృతి. బలహీనుడైనా, మనసులో చెలరేగే కాంక్ష అతడికి మరింత బలాన్ని, తెగువను ఇస్తుందేమో! పిచ్చిబలంతో చెలరేగుతాడు. దినదినగండంగా ఇలా గడచిపోవలసిందేనా? నేను ఆశించిన సత్ఫలితాలే వస్తాయా? దీర్ఘకాల ప్రయోగాల్లో విసుగు చెందక, నా ఆశయాన్ని సాధించుకోగలుగుతానా? ఏమో! ఎవరు చెప్పగలరు? మాట లవలన వచ్చే మార్పు అయితే బాధలేదు. ఇది అలా కాదు. మోహన్ శరీరంలో మార్పులు క్షుణంగా పరిశీలిస్తొండాలి. ఒక్క కూతుర్ని అయినా, నాతో సహకరించిన అమ్మా-నాన్నలకు చివరికి దక్కే ప్రతి

ఫలం ఏమిటో' అనుకుంది.

రేణూని చూడాలని మంగళ, రేఖా వచ్చారు. చాలా రోజులుగా, వారిని హాస్పటల్‌కి రానీయకపోతే, రేణూ ఇంటికి వచ్చారు. రేణు, రేఖ వేరేరూంలో మాట్లాడుకున్నారు.

"రేణూ! నువ్వు చాలా అలసిపోయినట్టు కనిపిస్తున్నావ్". అంది రేఖ అభిమానంగా.

"డాక్టర్ సింగ్, మధుకర్‌ల ముందు నేనెంత రేఖా! అయితే ఒక గండం గడిచింది" అంది రేణూ... జరిగినదంతా చెప్పి.

"అరే! అంతపని జరిగిందా? పాపం మీ పేరెంట్స్ ఇది విని చాలా తల్లడిల్లిపోయి వుంటారు అవునా? " అంది రేఖ.

"అది సహజం కదూ? అయినా నా కోసం అదేమీ బయటపడకుండా గంభీరంగా వుండిపోయారు. నేనిలా వున్నందుకు నాకు బాధలేదు. కానీ వాళ్ళకి నా కారణంగా ఏ సంతోషమూ కలగటంలేదని ఒకోసారి అనిపిస్తుంది. ఇంకా నయమేలే! ఇక్కడ నువ్వూ, పూజా, రోజా, మంగళ గారూ వున్నారు. నాలుగు రోజులు ఇలా మీమధ్య వుంటానని అనుకోలేదు. పాపం! మధుకర్ భార్య మరణించారు. చివరిగా మధుకర్ ఆమెకు దగ్గరగాలేనేలేరు. డాక్టర్స్‌కి వృత్తిధర్మంలో, ఇవి మామూలే కావచ్చు మనకి బాధగా వుంటుంది. నేనూ, అత్తయ్యా ఫోన్‌చేసి కండోలెన్స్ చెప్పాం. ఆయన ఎమన్నారో తెల్సా? చివరిసారి దగ్గరగా లేననే బాధకంటే, 'ఆమె అలా తన రూమ్‌లో కూర్చుని ఏదో చదువుకుంటోంది' అనే భావన నా స్మృతి పథంలో మిగిలిపోయింది అని! ఆవిడకు సాహిత్యమంటే పంచప్రాణాలు. చివరిరోజుల్లో ఆమెకు ఆ బుక్సే మనశ్శాంతినిచ్చాయి. ఆవిడ చాలా ఆర్టికల్స్ రాశారు. అయితే అవన్నీ ఫిలాసఫీ. మామూలు వాళ్ళకి అర్థంకావు" అన్నారు.

"అవును రేఖా! మనిషి ఒకదశలో మానసిక విశ్రాంతి కోసం, ఒక ఆలంబన వెతుక్కుంటాడు. వారికి అందులోనే ఆనందం లభించగలదు. తెలిసినవాళ్ళు అయితే బాధ కలుగుతుంది. లేకపోతే ఇది సహజం. వెనకో ముందో తప్పదు అనుకుంటాం" అంది రేణూ.

"అరుణ్ వస్తున్నాడు. తరచు నీగురించే అడుగుతాడు. మోహన్ ఏరకంగా బాధిస్తున్నాడో అని, బాధ పడుతూంటాడు" చెప్పింది రేఖ.

"నేను మోహన్ని తప్పుపట్టలేను రేఖా! అతనేమీ కావాలని అలా ప్రవర్తించడు. నాకుగా నేను అతని దగ్గిర వుండాలని వచ్చానుకదా? మీరంతా నాకోసం ఆలోచిస్తున్నారు. మోహన్ గురించి ఆలోచించరా? "

"ఆలోచించి ప్రయోజనం లేదుకదా రేణూ! అదీకాకుండా మీరంతా శ్రమపడేది ఒకరి నుంచి మరొకరకి ఆ వ్యాధి వ్యాపించకుండా చేసే ప్రత్నాలేకాని, నివారణకు కాదుకదా? " అంది రేఖ.

"పొరబాటు రేఖా! రెండిటికీ ప్రయత్నాలు వేరు వేరుగా చేయక్కర్లేదు. ఈ ఎక్స్‌పెరిమెంట్స్‌లో, వ్యాధి నివారణకు మార్గమూ కనిపించవచ్చు అదే ఫలించిన ట్లైతే, మోహన్ అందరిలా మనమధ్య తిరుగుతాడు. పరిపూర్ణ జీవితాన్ని గడుపుతాడు. అలా జరగాలనే మా అందరి ప్రయత్నం.

"అలా జరిగితే కావలసింది ఏముంది రేణూ. అందరికీ ఆనందమే! మళ్ళీ ఎప్పుడు కలుస్తామో! ఈసారి మనందరి కలయికా శుభసూచనకు నాంది కావాలి. వెళ్ళనా మరి...? " అంటూ లేచింది రేఖ.

రెండురోజులు ఇంట్లో వుండేసరికి, ఏమీ తోచలేదు రేణూకి. హాస్పటల్‌కి ఫోన్‌చేసి, "నేను వచ్చేస్తాను డాక్టర్. ఇంట్లో బోర్‌గా వుంది" అంటూ చెప్పింది

"సరే నీ ఇయిష్టం". అన్నారు డాక్టర్

సింగ్.

మళ్ళీ మామూలుగా ఫ్రెష్‌గా కనిపించిన రేణూని చూశాక, "ఈ మాత్రం రెస్ట్ అయినా లేకుంటే ఎలా రేణూ! బోర్‌గా వుందంటూ వచ్చేశావ్. ఎవరైనా హాస్పటల్లో పేషెంట్‌ని చూడాలని ఒకరోజు మాత్రమే రాగలరు" అన్నాడు డాక్టర్ మధుకర్.

"అది ఫార్మాలిటీ అనుకునేవారు చేసేపని! డ్యూటీ అనుకునేవారు, హాస్పిటల్‌లో ఎంత కాలమైనా వుండాలని ఆత్రపడతారు" అంది రేణూ నవ్వుతూ.

"మోహన్, ఇప్పుడు బాగున్నాడు. వీక్‌గా కనిపిస్తున్నాడు కానీ, సెల్ఫ్ కంట్రోల్‌లో వున్నాడు. 'రేణూ ఏది? అంటూ అడిగాడు కూడా. 'నీ అల్లరికి దూరంగా పారిపోయింది' అన్నాను. 'ఇక రాదా?' అన్నాడు. ఏమో...? అన్నాను. అలికిడి అయినప్పుడు నువ్వే అనుకుంటూంటాడు" అంటూ చెప్పాడు డాక్టర్ సింగ్.

"రేణుని ఇంటికి పంపించేయడం మంచి పని అయింది డాక్టర్. మోహన్‌లో తన ప్రవర్తనకు పశ్చాత్తాపం కలగాలి. అప్పుడే రేణూపట్ల జాగ్రత్తగా వుంటాడేమో..." అన్నాడు మధుకర్.

"రేణూ! నువ్విప్పుడు కోపం నటించు. నీ ఆగడం భరించలేకనే ఇంటికి వెళ్ళిపోయానని చెప్పు. రెండు రోజుల క్రితం పరిస్థితి వస్తే ఇక రానేరానని బెదిరించు. ఫలితం ఏమిటో చూద్దాం! ఓకే" అన్నాడు డా॥ సింగ్.

"ఎస్ డాక్టర్. అయ్ విల్ ట్రై..." అంది రేణూ.

డ్రస్ ఛేంజ్ చేసుకుని మోహన్ రూంలో అడుగుపెట్టింది రేణూ. అతడి కేస్ రిజిస్టర్‌ను చదివి, రూమ్ సర్దుతూన్నట్టుండిపోయింది తప్ప, 'ఎలా వున్నావ్?' అని పలకరించలేదు. సీరియస్‌గా ముఖం పెట్టి గంభీరగా వుండి తనదారిన తను ఓ బుక్ చేతబట్టుకుని కూర్చుంది.

రేణూలో మార్పు కనిపెట్టి, అపరాధ భావంతో, పలకరించాలని వున్నా, పూరకుండిపోయాడు మోహన్.

అలా అని, ఎదురుగా కూర్చున్న రేణూను చూస్తూంటే, బాధగానూ అనిపించి, "రేణూ! అయామ్ వెరీసారీ...", అన్నాడు, మొహమాట పడుతూ. రేణూ మాట్లాడలేదు. అతను కనిపించకుండా, పక్కకు తిరిగి కూర్చుంది.

"ఏం? నామొహం చూడకూడనంత అసహ్యంగా మారిపోయిందా రెండు రోజులకే" అన్నాడు.

అయినా మాట్లాడలేదామె.

"సారీ చెప్పానుగా...! అయినా కోపమేనా? అవున్లేమరి. నేను చేసిన తప్పుకి నీకూ, డాక్టర్ సింగ్‌కి, మధుకర్‌కీ అందరికీ కోపం వస్తుంది. అయినా వాళ్ళు క్షమించేశారు. నీకుమాత్రం కోపం పోదు. అది న్యాయమే. నువ్వు నాకోసం ఎన్నో వదులుకుని వచ్చినా, నేను అన్నీ మరచిపోయి, మృగంలా ప్రవర్తించాను. నాలో ఇలాంటి ఊహలు రాకుండా, నేను ఎవర్ని ఇష్టపడకుండా చేయమని డాక్టర్ గారితో చెబుతాను" అన్నాడు మోహన్.

అక్కడ్నించి లేచి వెళ్ళి, దూరంగా మరో కుర్చీలో, కర్టెన్ చాటున కూర్చుంది రేణూ. ఇప్పుడతను కనపడడు.

"డాక్టర్‌గారి చేతులు పట్టుకుని" డాక్టర్! రేణూని నేను క్షమాపణ కోరుకోవాలి. పిలిపించండి" అన్నాను. బహుశా ఆయన పిలిచినందువల్లనే వచ్చివుంటావు. నేనో రాస్కెల్‌ని మంచివాణ్ణి కాదు. అయినా నువ్వెంతో సహనంగా, ధైర్యంగా నాకు సేవ చేస్తూ వచ్చావ్ అలాంటి నిన్ను కళ్ళుమూసుకుపోయి, కాటువేయాలని చూశాను. అవును అందుకు నీకు కోపం రావడంలో అర్థం వుంది.

నేనిక బాగుపడను. నాకోసం మీరంతా శ్రమపడటం వృథా. ఆ మృత్యువేదో

# ఏరిన ముత్యాలు

- మిమ్మల్ని గురించి మీరు తెలుసుకోవడం అన్నదే జీవితంలో అతికష్టతరమైన పని.

– థేలెస్

- ఆలోచనల ఫలితమే మనిషి. మన ఆలోచనల ప్రకారమే మనం తయారవుతాము.

– మహాత్మా గాంధీ

- తన వంతు వాటాకన్నా కొంత ఎక్కువ నిందనూ, తన వంతు వాటా కన్నా కొంత తక్కువ ప్రశంసను కోరేవాడే మంచి నాయకుడు

– ఎ. హెచ్.గ్లాస్గో

- అంతరంగ ఓటమి తప్ప మరే ఓటమి లేదు. మీలోని ఆదర్శపు బలహీనతకు మించి మిమ్మల్ని కట్టివేయగల బంధం నిజంగానే లేదు.

– రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

- వేడుకలలో మీ పక్కన నిలబడి, ఆపదలలో మీ శత్రువును ఎదుర్కొని, కోర్టు వ్యవహారాలతోపాటు నీ సమాధి పక్కన నిలబడగల వాడే మీ మిత్రుడు.

– సంస్కృత సామెత

- ఆలోచనలను మీ అదుపులో ఉంచుకోండి, ఆలోచనలను మీపై సవారి చేయడానికి అవకాశం ఇవ్వకండి

– జె.పి.వాస్వాని

- తెలుసుకోదగ్గ ఉత్తమమైన విషయాన్ని తెలుసుకోవడం, చేయదగ్గ ఉత్తమమైన పని ఏదో తెలుసుకొని దానిని చేయడం అన్నదే నిజమైన వివేకం.

– లారిన్స్ హంఫ్రే

- సగం మూర్ఖత్వం సగం పాండిత్యం గల వారి వల్లే గొప్ప ముప్పు వాటిల్లుతుంది.

– శంకరాచార్య

- ఈనాడు ఆత్మ శాంతి లేని వారెందరో ప్రపంచ శాంతికి ప్రాకులాడుతున్నారు.

– స్వామి శివానంద

- జీవితం పరిపుష్టమయ్యేది విజ్ఞానంతో కాదు, కార్యాచరణతో.

– మాక్స్లీ

- ముందుచూపు లేని మనిషి చేరువలోనే బాధలన్నీ ఉంటాయి.

– కన్ఫ్యూషియస్

- అలలను, కాలాన్నీ ఎవరూ ఆపలేరు.

– రాబర్ట్ బర్న్స్

సేకరణ: దాసరి వెంకటరమణారావు

త్వరగా వచ్చేస్తే బాగుండును. అలా ఎందుకు జరుగుతుంది? మీ అందర్నీ ఇంకా ఎంతకాలం బాధించాలో. నేను బాగుపడటం వట్టిది. రేణూ నన్ను క్షమించి, ఏ పాయిజనో ఇంజక్ట్ చేసెయ్. అప్పుడు ఎవ్వరికీ నాతో సమస్య వుండదు.

రేణూ! నేనసలు పుట్టకూడదు. పుట్టాను. నావలన ఎవరికీ సంతోషం కలగలేదు. అమ్మ, నాన్న, అన్నయ్య, రేఖా, నువ్వూ అందరూ నన్ను చీదరించుకునేలా చేసుకున్నాను. ఒకరకంగా నాది స్వయంకృతమే! అందుకే నాకు శిక్ష సాధ్యమైనంత త్వరగా ఈ లోకం విడిచిపోవడం. మీరెవరూ నన్ను పోనీయరెందుకు? నీకు గుర్తుందా రేణూ? అమ్మ ఓసారి మా ఫ్యామ్లీ డాక్టర్‌ని అడిగింది. నా చిన్న కొడుకును సాధ్యమైనంత తొందరగా మాకు దూరం చేయమని! ఎంత విసిగిపోయిందో. రేఖ పైకి అన్లేకపోయింది మనసులో అనుకునే వుంటుంది. ఇక అరుణ్ అన్నయ్య, నువ్వు ఇంతకు ముందు ఏమనుకున్నా, ఇప్పుడు ఖచ్చితంగా కోరుకుంటారు. అదే... ఈ మోహన్‌గారి వేధింపులు భరించలేం. ఈ పీడ త్వరగా పోవాలని!

ఇంతమంది నాఒక్కడి కారణంగా బాధపడటం కన్నా, మీ అందరికోసం నేను వెళ్ళిపోవడం చాలా మంచిది. రేణూ! నన్నెవరూ బాగుచేయలేరని నాకు తెలుసు. అందుకే నిన్ను వేడుకుంటున్నాను. నాకు విముక్తి కలగించు. అయితే పోయేముందు నన్ను క్షమించానని ఒక్కమాట చెప్పు చాలు. అదే నాకు అత్యంత సంతోషకరం..." మాట్లాడటం ఆపేడు మోహన్.

కోపం నటించిన రేణూ, మరింక నటించలేకపోయింది. మోహన్ నిజంగానే పశ్చాత్తాపంతో విలపిస్తున్నాడు. బింకం సడలిపోయింది ఆమెకి. మెల్లిగా కర్టెన్ పక్కకు జరిపి చూసింది. మోహన్ లేడు. ఎక్కడికి వెళ్ళాడు? బాత్‌రూమ్‌లోకి వెళ్లి వుంటే తలుపు తీసిన శబ్దం వినిపించేది. మరి కొంచెం జరిపి లేచి నిలబడింది నాలుగు వైపులా ఆత్రంగా చూస్తూ.

రెండో వైపు కర్టెన్ వెనక నుంచి వచ్చిన మోహన్, రేణూ కాళ్ళ మీద పడిపోయాడు. కన్నీటితో ఆమె పాదాలను తడిపి, తన తొందరపాటు చర్యకి పరిహారంగా అభిషేకం చేశాడు.

అనుకోని ఈ ప్రవర్తనకి, రేణూ కరిగిపోయింది. మోహన్ పక్కనే కూలబడి, అతణ్ణి హృదయానికి హత్తుకుంది. ఒక్క క్షణం వివశులయ్యారు ఇద్దరూ. మోహన్ ముందుగా తేరుకుని 'సారీ రేణూ... అంటూ ఆమె నుంచి విడివడి, దూరంగా పోయి నిల్చున్నాడు. అతడి శరీరమంతా ధారాపాతంగా చమటతో తడిసి ముద్దయింది. వెంటనే డాక్టర్ సింగ్‌ను పిలిచింది రేణూ.

ఆయన వచ్చాడు. మోహన్‌లో ఊహించని మార్పు. కాసేపు ఆయనను విభ్రాంతికి గురిచేసింది. 'మధూ... త్వరగా రా..., అంటూ పిలిచాడు. మధూ కొన్ని ఇంజక్షన్స్ తీసుకువచ్చి, వెంట వెంటనే చేశాడు. మోహన్ శరీరంలో కొద్దిగా వేడి రాజుకుంది. చమట ఆరిపోయింది. అప్పుడు డాక్టర్ సింగ్‌లోని స్థిరత్వం చూశాక, మధుకర్, రేణూలకు కంగారు తగ్గింది.

"డాక్టర్...?" అన్నారు ఒకేసారి ఆత్రంగా, ప్రశ్నార్థకంగా చూస్తూ! "ఏం భయం లేదు. హి ఈజ్ ఆల్‌రైట్" అన్నాడు డాక్టర్ సింగ్.

"మీరు చెప్పినట్టే చేశాను. అతడెంత బతిమాలినా మాట్లాడలేదు" అంది రేణూ.

"మంచి పని చేశావ్. నా ప్లాన్ సక్సెస్ అయింది. కేవలం మెడిసిన్‌తో కాక, మానసికంగా మోహన్‌లో మార్పు తీసుకురావచ్చునేమో తెలుసుకోడానికి ఇది చిన్న టెస్ట్. అతని మూడ్స్ కనిపెట్టి, సీరియస్‌గా

వుండు. అతను గనుక బాధపడినట్టు కనబడితే, ఓదార్చు" అన్నాడు డాక్టర్ సింగ్.

"అంటే మీ ప్లాన్‌లో ఈ సక్సెస్ శుభసూచకం అన్న మాట. కంగ్రాట్స్ డాక్టర్" అన్నాడు మధుకర్.

"అప్పుడే తొందరపడకు మధూ! ఈ సక్సెస్ ఒక్క స్టెప్ ముందుకు నడిచింది. ఇంకా ఎన్నో మెట్లు మనం అధిగమించాల్సి వుంటుంది" అన్నాడు డాక్టర్ సింగ్.

"ఉత్సాహానికి ఊపిరి పోయడంలో ఆవగింజంత సక్సెస్ అయినా గొప్ప విషయమే డాక్టర్!" అన్నాడు మధుకర్.

"డాక్టర్ మధుకర్ చెప్పిన మాట అక్షరాలా నిజం. ఇక ముందు నేనేం చేయాలో చెప్పండి" అంది రేణూ ఉత్సాహంగా.

"చెప్పాను కదా? అతణ్ణి హేండిల్ చేయడంలో, సులువైన మార్గం తెలిసి వచ్చింది. నువ్వు నీకు తోచినట్టు చాకచక్యంగా ప్రవర్తించు" అన్నాడు డాక్టర్ సింగ్.

నిజంగా వాళ్ల ముగ్గురికీ ఈ ఎక్స్‌పెరిమెంట్ చాలా ఆనందాన్నిచ్చింది. అయితే ఈ విషయాన్ని వాళ్లు మనసులోనే వుంచుకోవాలనుకున్నారు.

అరుణ్ చాలా రోజుల తర్వాత లీవ్ మీద వచ్చాడు. మర్నాడు "మనం మోహన్‌ని చూద్దామా?" అన్నాడు. ఇటీవల జరిగిన పరిణామాలు తల్లి మంగళ ద్వారా విన్నాక.

"డాక్టర్ పర్మిషన్ తీసుకుని అలాగే వెడదాం మనిద్దరమూ" అంది మంగళ.

"అరుణ్ అన్నయ్యా! నిన్ను చూసి చాలా కాలమైంది. ఎలా వున్నావ్?" అభిమానంగా పలకరించాడు మోహన్, దూరాన్నుంచే!

"బాగున్నాన్రా మోహన్...!" అంతకంటే నోట మాట రాలేదు అరుణ్‌కి. కొడుకులిద్దర్నీ ఒకేచోట చూసుకున్న మంగళకు మనసు తృప్తిగా అనిపించింది. కొద్దిసేపు అన్నదమ్ములు మాట్లాడుకున్నారు. వచ్చే ముందు డాక్టర్ సింగ్‌ని, మధుకర్‌ని కలిశాడు అరుణ్.

"డాక్టర్ చాలా కాలం తర్వాత మేమిద్దరమూ ఆప్యాయంగా మాట్లాడుకున్నాం. ఆరోగ్యం బాగున్న రోజుల్లో, నేనంటే మోహన్ ఇష్టపడే వాడు కాదు. శత్రువులా చూసేవాడు. మానసికంగా వాడిలో మార్పు వచ్చినట్టుంది" అన్నాడు అరుణ్.

"అవును అరుణ్! రేణూ మీ కుటుంబ విషయాలు చెప్పింది. మోహన్ ఆరోగ్యం కుదుటపడే సూచనలు తలవెంట్రుక వాసి ఆశాపూర్వకంగా కనిపిస్తున్నాయ్. అమెరికాలోనూ, మరికొన్ని దేశాల్లోనూ, రీసెర్చి జరగడం నీకు తెలిసిందే. ఆ పరిశోధనలో భాగంగా, కొందరు వివిధ దేశాల నుంచి మన కంట్రీకి వచ్చారు. వారు కూడా ఈ ఆలిండియా మెడికల్స్‌లో మా ప్రయత్నాలకు పూర్తి సహకారం అందించగలమని, మీ ఆశయంలో పాలుపంచుకుంటామని చెప్పారు. అయితే మాకు వీరు వస్తున్నట్టు, ముందుగా సమాచారం ఏమీ రాలేదు. జనరల్‌గా వారు, మన కంట్రీ రావడానికి ప్లాన్ చేసుకోవడం, మనకు తెలియచేయడం, మన వాళ్లు, అందుకు తగిన సౌకర్యాలు ఏర్పాటు చేయడం, ఎంత కాలంగానో వస్తున్న ఫార్మాలిటీ. చాలా రేర్‌గా సడన్ డిసెషన్ తీసుకోవడం, అప్పటికప్పుడు తెలియజేయడం జరుగుతుంది. అందువలన మాతో షేర్ చేసుకోవడం, అంటూ జరిగితే, ఇంతవరకూ మా ఎక్స్‌పెరిమెంట్ డిటెయిల్స్ వారితో చెప్పడానికి, ఇష్టం లేకపోయింది. వారిని ఇక్కడే కొంత కాలం ఆగమని చెప్పి, ఎంక్వైరీ చేశాం. వారు నమ్మతగ్గ వారేనని, త్వరితంగా వ్యాపించే ఎయిడ్స్‌ను సాధ్యమైనంత త్వరగా నశింపచేయాలనే ఆలోచనతో, ముందుగా ఎటువంటి సమాచారం అందచేయలేదని తెలిసింది" అన్నారు డా॥ సింగ్.

"డాక్టర్! మోహన్ మీకు కోఆపరేట్ చేస్తు

న్నాడా?" అడిగాడు అరుణ్.

"చాలా! అతనికి తెలిసి, తెలివి ఉన్నంత వరకూ కండిషన్ స్టెబిలైజ్డ్‌గా వున్నట్లే" అన్నాడు మధుకర్.

"కానీ నేను విన్నది, రేఖను గొడవ పెట్టాడని...?' అర్థోక్తిగా అన్నాడు అరుణ్.

"అది మేమిచ్చే మెడిసిన్ ప్రభావం తప్పితే, తెలిసి చేసింది కాదు కనుక, మేమంత సీరియస్‌గా తీసుకోలేదు" చెప్పాడు సింగ్.

"నా బాధ అంతా, రేణుకి కలిగే ఇన్‌కన్వీనియన్స్..."

"తప్పదు అరుణ్. ఆమెకి ముందుగానే అన్ని విషయాలూ చెప్పాం. ముందు జాగ్రత్తగా హెచ్చరించాం కూడా! సో... తనేమీ భయపడలేదు" అన్నాడు డా॥ సింగ్.

"డాక్టర్! నాకు కొన్ని సందేహాలు ఉన్నాయి. అడగమంటారా?"

"తప్పకుండా. మీలాంటి వారు తెలుసుకుని, తెలియని వారికి చెప్పడం చాలా అవసరం. జనరల్‌గా మీ వంటి ఎడ్యుకేటెడ్, ఇంటెలిజెంట్స్ తెలుసుకోగలరు. అయితే అందరికీ అవగాహన ఉండదు. కనుక మీరంతా ఒక ఉద్యమంలా దీని గురించిన ఫలితాలను ప్రజల్లోకి, మారుమూల ప్రాంతాలలోని నిరక్షరాస్యుల దగ్గిరకు వెళ్లి ఎయిడ్స్ నిరోధానికి తీసుకోవలసిన జాగ్రత్తల గురించి వివరించాల్సిన అవసరం ప్రభుత్వానికి, స్వచ్ఛంద సంస్థలకూ ఉంది. అయితే మొక్కుబడిగా ఏడాదికోసారి హంగామా జరుగుతోంది తప్ప. అత్యంత ముఖ్యమైన బాధ్యతగా ఎవరూ భావించక పోవడం విచారకరం" అన్నారు డా॥ సింగ్.

"మీరు చెప్పింది నిజమే డాక్టర్. ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థల బాధ్యతతో పాటు పబ్లిక్‌లోనూ అవగాహన అవసరం. పబ్లిక్ చేయాల్సింది ఏమిటో కూడా వివరించండి"

"వ్యాధి నిరోధించడానికి మార్గాలు చాలా ఉన్నాయి. నివారణకు చికిత్స లేదని అందరికీ తెలియచెప్పాలి".

"మొదట్లో ఉన్న తీవ్రత తగ్గిందంటారా, లేక అవగాహనా లోపం వలన ఈ సంఖ్య పెరుగుతోందంటారా?"

"విదేశీ ప్రతినిధులతో చర్చించిన తరువాత తెలిసింది ఏమంటే, ఈ వైరస్‌కి అంకురార్పణ జరిగిన ప్రాంతం అయిన తూర్పు ఆఫ్రికా నగరాల్లో ఈ సంవత్సరం ఎయిడ్స్ సోకిన వారి సంఖ్య తగ్గుముఖం పట్టింది. ఇందుకు ఎయిడ్స్ నిరోధ కార్యక్రమ ఫలితం అనవచ్చు. ఈ వ్యాధి నిరోధానికి భారీగా నిధులు కూడా వారికి అందడం ఒక కారణం. అయితే ఎంతగా మనీ పోగుపడ్డా, అదుపు చేయడానికి ఈ మొత్తం చాలదు. నిరంతరమూ అందుతూనే ఉండాలి.

జనాభా ఎక్కువగా గల చైనా, ఇండియా, రష్యా, ఇండోనేషియా వంటి దేశాలకు ఈ ఎయిడ్స్ ప్రమాదం ఎక్కువ. యునైటెడ్ నేషన్ ఎయిడ్స్ ప్రోగ్రాం డైరెక్టర్ పీటర్ పీయుట్ ఏమన్నారంటే, 'ఎప్పుడూ లేనంత మందికి ఎయిడ్స్ సోకింది. ఈ సంవత్సరం అనేక మంది, ఈ వ్యాధికి బలి అయిపోయారు. వరల్డ్ మొత్తం మీద రోజుకి 14 వేల మందికి ఈ వైరస్ సోకితే, వీరిలో రెండు వేల మంది అభం శుభం తెలియని పసిపిల్లలు.

95 శాతం మంది వ్యాధి పీడితులుగా రికార్డ్ అయింది. ఎక్కువ మంది ఇండియా, చైనా దేశస్థులే, ఉన్నారంటే పరిస్థితి ఎంత దారుణమో తెలుస్తుంది. ఆఫ్రికాతో కంపేర్ చేస్తే, ఏషియన్ కంట్రీస్‌లో తక్కువే అయినా, ముందు ముందు తక్షణ జాగ్రత్తలను తీసుకోవలసిన కర్తవ్యాన్ని సూచిస్తోంది.

ప్రపంచం మొత్తం మీద నాలుగు కోట్ల మంది ఎయిడ్స్ వ్యాధి బారిన పడినవారు ఉన్నారు. అందులో ఇరవై అయిదు లక్షల మంది పదిహేనేళ్ల లోపు పిల్లలు. మొత్తం

సంఖ్యలో మూడో వంతు మహిళలు. చైనా, ఇండోనేషియా, వియత్నాంలలో వైరస్ ఉధృత రూపం దాల్చింది. అయితే ప్రతి సంవత్సరం లెక్కలు చెబుతున్నారు కాని, అవి ఖచ్చితమైన సమాచారం కాదనుకో వచ్చు. అదెలాగ అంటే, ప్రతి సంవత్సరం నివేదికలకు అందని కేసులు ఎన్నో ఉంటాయి. వీరిలో సమాజం దూరం చేస్తుందని భయపడేవారు. వ్యాధి సోకిం దని తెలుసుకోలేని వారు లెక్కల్లోకి రావడం లేదు"

"మన దేశంలో పరిస్థితి ఎలా వుందో చెప్పండి డాక్టర్" శ్రద్ధగా సింగ్ చెప్పిన విష యాలు వింటూన్న అరుణ్ అడిగాడు.

"ఆంధ్రప్రదేశ్, కర్ణాటకా, మహారాష్ట్ర, మణిపూర్, నాగాలాండ్ వంటి రాష్ట్రాల్లోని గర్భవతుల్లో హెచ్.ఐ.వి. రేటు ఒక శాతం దాటిందని నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గ నైజేషన్ రిపోర్ట్ వలన తెలిసింది. ఆ రాష్ట్రాల్లో ఎయిడ్స్ అదుపులో ఉందని చెప్ప డానికి ఏ రకమైన ప్రూఫ్ లేదు అని, యు.ఎన్. ఎయిడ్స్ చెప్పిన ప్రబలమైన కారణంలో ఎటువంటి అనుమానం లేదు".

"ఎయిడ్స్ కారణాలు కొంత వరకూ తెలి సినవే అయినా, మీ ద్వారా వినాలనుకుంటు న్నాను. వివరంగా చెప్పండి" అడిగాడు అరుణ్.

అంతవరకూ విని ఊరుకున్న డా॥ మధు కర్ పేపర్స్, పెన్ తెచ్చి, డాక్టర్ సింగ్ చెప్పే విషయాలను నోట్ చేయడం మొద లుపెట్టాడు.

"యు.ఎన్. ఎయిడ్స్ సంస్థ చెప్పిన విష యాలలో ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహా రాష్ట్ర, మణిపూర్, నాగాలాండ్‌లలో ఎయిడ్స్ నిరోధక కార్యక్రమంలో ఏ విధంగానూ పురోగతి లేదనేది వాస్తవమే! సెక్స్ ఎడ్యుకే షన్ తప్పనిసరి అని, ఇంజక్షన్ ద్వారా వ్యాపించే ఈ వైరస్ గురించి అందరికీ తప్ప నిసరిగా అవగాహన కలిగించాలని యు.ఎన్. ఎయిడ్స్ సంస్థ సూచిస్తోంది.

ఎయిడ్స్‌కి కారణం ఫ్రీ సెక్స్, డయాలసిస్, ఇంజక్షన్ చేసేప్పుడు నీడిల్ మార్చకుండా చేసే ఇంజక్షన్స్, డ్రగ్ ఎడిక్ట్ అయినవారు తీసుకునే ఇంజక్షన్ ద్వారా వ్యాధి వ్యాపిం చడం ఇలా ఎన్నో కారణాలుగా ఈ ప్రాణాంతక వ్యాధికి కారకులు కావడం. అవగాహన లేనివారు, వ్యాధి పీడితులను చిన్నచూపు చూడటంతో, రోగులు తమకు ఎయిడ్స్ సోకిందనే విషయాన్ని మరుగు పరుస్తున్నారు. ఎయిడ్స్ మరింతగా ప్రబ లేందుకు కారకులవుతున్నారు. మొదట సమాజాన్ని మార్చ గలిగితే, కొంత వరకూ వ్యాధి అదుపులో ఉంటుంది. ఎయిడ్స్ నిరో ధానికి తీసుకోవలసిన జాగ్రత్తలు, రోగుల పట్ల చూపవలసిన ఆదరాభిమానాలు విస్తృ తంగా ప్రచారం చేయాల్సిన విషయాన్ని కేంద్ర ప్రభుత్వం నిర్లక్ష్యం చేసి, రోగుల ఆలంబన కోసం పథకాన్ని ప్రారంభించ నుంది. దిసీజ్ వెరీ బాడ్!"

"గవర్నమెంట్ ఇంకా ఏ రకంగా రోగు లకు సహాయం అందజేయాలి డాక్టర్?" అరుణ్ అడిగాడు.

"ఇప్పటికి నూట యాభై జిల్లాలతో పాటు ఢిల్లీలో 'గవర్నమెంట్ స్పాన్సర్ ఎయిడ్స్ ట్రీట్‌మెంట్ ప్రోగ్రామ్ చేపట్టడానికి సిద్ధంగా ఉంది. హెచ్.ఐ.వి. ఎయిడ్స్ మెడిసిన్ తక్కువ ధరకు సప్లై చేసేలా, ప్రోడక్ట్ కంపెనీలను ఒప్పించింది. పధ్నా లుగు సంవత్సరాల లోపు పిల్లలకు ఫ్రీ ట్రీట్‌మెంట్ చేయాలని ఆదేశాలిచ్చింది. ఇంతదాకా చేసిన మంచి పని ఇది! వ్యాధి సంక్రమించిన వారికి ఈ డ్రగ్ వాడటం వలన ఇరవై సంవత్సరాల లైఫ్‌ను ఎక్స్ టెండ్ చేసే ఈ ట్రీట్‌మెంట్ మూడు వందల కోట్లు ఖర్చు అవుతుందని అంచనా! ఆఫ్రికా దేశాల్లో ఎయిడ్స్ వలన ఆర్థిక వ్యవస్థ పడిపోకముందే మన దేశం

మేల్కొని ఎయిడ్స్ నిరోధక లక్ష్యాన్ని స్వచ్ఛంద సంస్థల సాయంతో సాధించాల్సిన అవసరం చాలా ఉంది"

"భార్యా-భర్త లిద్దరూ సక్రమ జీవితాన్ని గడుపుతూన్నా కూడా, మరో కారణం వలన ఈ వ్యాధికి గురైనప్పుడు ఏం చేయాలి? "

"పరస్పరావగాహనతో సహకరించుకో వాలి. పెళ్లికి ముందు భర్తకి ఎయిడ్స్ ఉండి దాచిపెట్టి, పెళ్లి చేసుకుని భార్యకు, పిల్లలకూ ఈ వ్యాధిని సంక్రమించేటందుకు కారకుడు కాకూడదు. వ్యాధి ఉందని తెలిసి నప్పుడు, పెళ్ళికి, సెక్సువల్ లైఫ్‌కి దూరంగా ఉండి, మహత్తరమైన మరో మార్గానికి మనసు మళ్లించుకుని, స్వచ్ఛంద సంస్థలతో పాటు ప్రజలకు అవగాహన కల్పించేందుకు కృషి చేయడం, మానవ జాతికి మహోప కారం కాగలదు. భార్యకు ఉద్యోగ భద్రత, ఆర్థిక సహాయము కల్పించి తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చడం మంచిది"

"సెక్స్ వర్కర్స్ ద్వారా వ్యాధి వ్యాపించ కుండా, వ్యాధి ఉన్నవారి చేత వ్యభిచారం మాన్పించి, తగిన బ్రతుకు తెరువును చూపించడం ప్రభుత్వ బాధ్యత. ఎవరూ కావాలని తప్పుదారిన నడవరు. ఎయిడ్స్ వ్యాధిని కొని తెచ్చుకోరు. పరిస్థితులు, పేద రికం, స్వార్థపరులైన కొందరు వ్యక్తులు ఇందుకు కారకులు కావచ్చు. వారు కూడా సంపాదనే ధ్యేయంగా భావించక, ఆరో గ్యము, మంచి వసతి, చక్కని జీవితం కోరు కుని, చెడుకు దూరంగా ఉండటం, క్రమబ ద్ధమైన జీవితాన్ని గడపటం అవసరం" డా॥ మధుకర్ కూడా తన అభిప్రాయాన్ని తెలి యజెప్పాడు.

"పూర్వపు రోజులకంటే, ఇప్పటి ప్రజల్లో చాలా మార్పు వచ్చింది. మా చిన్న తనంలో వింటూండే వాళ్ళం. వేశ్యలకంటూ ప్రత్యేక వీధులు, భవనాలు ఉండటం, వారిని ధనవంతులు తమ ఇష్టానుసారం చెప్పుచేతల్లోకి మార్చుకుని, కుటుంబ భారాన్ని వహించటం ఉండేదట. క్రమంగా వారు కూడా పెళ్లిళ్ళు చేసుకుని, తమ బిడ్డ లకు చదువు, సంస్కారం నేర్పి ఉద్యోగాలు చేయించే స్థితికి చేరుకోవడం హర్షణీయం. అలాగే, ముందు ముందు ఈ ఎయిడ్స్ నుంచి తప్పించుకుని, క్రమబద్ధంగా జీవించ డానికి ఇష్టపడే రోజు తప్పక వస్తుంది. ఇప్పటికే ఎక్కడో, మార్పు మొదలై ఉండి ఉండవచ్చును కూడా!" అన్నాడు డాక్టర్ సింగ్. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో పౌష్టి కాహార లోపం, ఇన్‌ఫెక్షన్స్ కారణంగా వ్యాధి అంకురించిన వారికి ప్రభుత్వం ఎన్నో సదుపాయాలను కల్పించింది. వీటిని జాగ్రత్తగా పాటించి జీవితం సుఖమయం చేసుకోవాలి. ఎయిడ్స్ రాకుండా ఉండటా నికి భార్యా, భర్తలిద్దరూ వివాహేతర సంబంధాల వైపు ఆకర్షితులు కాకూడదు. క్రమం తప్పకుండా వైద్య పర్యవేక్షణ తప్పని పరిస్థితిలో ఆరోగ్యకరమైన రక్త మార్పిడి, ఇంజక్షన్ చేసేటప్పుడు ఒక సూదిని ఒక సారే వాడటం వంటి జాగ్రత్తలు అందరినీ ఈ భయంకరమైన వ్యాధినుంచి తప్పక రక్షించగలవు. నిర్లక్ష్యం ఎంత మందిని మట్టు పెడుతుందో ఈ లెక్కలు వివరి స్తాయి. ప్రపంచ వ్యాప్తంగా ముప్పై వేల మిలియన్ల ప్రజలు ఎయిడ్స్ బారిన పడతా రని, ఏటా ఒక మిలియన్ జనాభా ఈ వ్యాధి కారణంగా చనిపోతారని ఇందులో నాల్గవ వంతు ఏషియన్స్ననీ వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ అంచనా! అంతేకాక యంగ్ జనరేషన్‌కి హెల్ప్‌లెస్ సిట్యుయేషన్‌లో డెత్ సంభవిస్తే దేశాభివృద్ధికి గొడ్డలిపెట్టు అవు తుంది. నవశకానికి ప్రయోజనకరమైన యువత ఉత్పత్తిని పెంచే స్త్రీ, పురుషులు అనారోగ్యం పాలైతే ఆర్థిక వ్యవస్థ, దేశ పురోభివృద్ధి దెబ్బ తింటుంది" ఇది నా అభి ప్రాయం.

సారీ... డాక్టర్ సింగ్! మీ అనుమతి కోరకుండా, నేను కొన్ని మాటలు చెప్పాను.

ఏదో ఒక భావావేశంలో..." అన్నాడు డా॥ మధుకర్. అప్పటి వరకూ అతనికి, డా॥ సింగ్ మాటలకు అడ్డు వచ్చానా, అనే ఆలోచన రాలేదు.

"అలాంటిది ఏమీ లేదు మధూ! నువ్వు చెప్పినా, నేను చెప్పినా జరుగుతున్నది, భవిష్యత్‌లో జరగాల్సింది మనం తెలుసుకున్నది, విడమరచి చెప్పడం! ఒక రకంగా నేనే నీకు అవకాశం ఇవ్వనందుకు సిగ్గు పడుతున్నాను..." అన్నాడు డా॥ సింగ్ నిజాయితీగా.

"నో సర్... మీరలా అనద్దు. మేధావుల దగ్గిర ఎంత నేర్చుకున్నా, నేర్చుకోవలసింది వుంటూనే ఉంటుంది. మీ ప్రోత్సాహం, ఉత్సాహం, మావంటి వారికి మార్గదర్శకాలు" అన్నాడు మధుకర్ వినయంగా.

డాక్టర్స్! మీవంటి మేధావులను కలుసుకోగల అవకాశం లభించినందుకు చాలా సంతోషంగా ఉంది. మీరు ఇంత విపులంగా, శ్రద్ధగా నా అనుమానాలు తీర్చినందుకు థాంక్స్ ఎలాట్. చివరగా ఒక్క డవుట్. వ్యాధి పీడితులు ఏయే జాగ్రత్తలు తీసుకోవాలి? చెప్పండి డాక్టర్".

"ప్రతి ఒక్కరు మీలాగ తెలుసుకోవాలని అనుకుంటే బాగుండును అరుణ్. అందరూ కలసికట్టుగా పని చేయాలి. విద్యావంతులు, ఆర్థిక వనరులు కలిగినవారు జీవితాన్ని సక్రమంగా గడపగలుగుతారు. కింది తరగతి ప్రజలు, తగిన సలహాలు తీసుకుని, ఆయా ఊళ్ళలో మెడికల్ కాలేజీలకు అనుబంధం చేయబడిన హాస్పిటల్స్, జిల్లా హెడ్ క్వార్టర్ హాస్పిటల్స్ ఏరియా, తాలూకా, జిల్లా హాస్పిటల్స్‌లో, కొన్ని ప్రైవేట్ హాస్పిటల్స్‌లో ఏర్పరచిన సదుపాయాలను వినియోగించుకుంటే, రాబోయే కాలానికి ఎయిడ్స్ వ్యాధి ఉధృతం తగ్గుముఖం పట్టవచ్చు"

"డాక్టర్ సింగ్! మీరు ఎంతో టైమ్ తీసుకుని చక్కని తెలుగులో ఎంతో వివరంగా చెప్పేరు. ఈ విధంగా ప్రతి చోటా డాక్టర్స్ కూడా పేషెంట్స్‌కి, సహకరించినప్పుడు ఎంతటి ప్రాణాంతక వ్యాధి అయినా నయం కావడానికీ, మీరు చెప్పినట్టుగా తగ్గుతూ రావడానికీ అవకాశాలున్నాయి. కొంత వరకూ అవగాహనా లోపం కూడా ఈ వ్యాధి స్ప్రెడ్ అవడానికి కారణం అని నేను అనుకుంటాను. నేను వెళ్ళి వస్తాను డాక్టర్. శెలవ్" అంటూ లేచాడు అరుణ్.

"అరుణకీ, తమ్ముడు మోహన్‌కి ఎంత తేడాయో చూడు మధూ! ఒక తల్లి పిల్లలే మళ్ళీ..." అన్నాడు డాక్టర్ సింగ్ అరుణ్ వెళ్ళిపోయాక.

"అవును డాక్టర్. ఎక్కడో ఫ్యామ్లీ జనరేషన్ నుంచి వచ్చిన కొన్ని జీన్స్ కారణంగా మనిషి స్వభావం ఏర్పడుతూ ఉంటుంది. కొన్ని పరిసరాలు, వ్యక్తిత్వం కారణంగా మార్చుకోగల అవకాశం ఉన్నా, ఆ ప్రయత్నం చేయక పోవడమే దురదృష్టం" అన్నాడు మధుకర్.

"మధూ! మనిద్దరం కాసేపు ఫ్రాంక్‌గా మాట్లాడు కుందాం. మన ఎక్స్‌పెరిమెంట్ సక్సెస్ అవుతుందన్న నమ్మకం నీకు వుందా? " అడిగాడు సింగ్.

"నిజంచెప్పమంటారా సింగ్? మనం సక్సెస్ కాగలమనే నేను అనుకుంటున్నాను. అయితే అందుక్కారణం మాత్రం మోహన్ కంటే ఎక్కువ రేణూ అవుతుంది" అన్నాడు మధుకర్.

మధూ మాటకు డా॥ సింగ్‌లో విశ్వాసం బలపడింది. అయినప్పటికీ, బయట పడకుండా, "ఏమో మధూ! నేను ఏ ఆశయంతో ఈ రంగంలో ప్రవేశించానో అది నెరవేరితే కావలసింది ఏముంది? మన కృషి, ఫలించినట్టే" అన్నాడు.

"మీరు కోరుకున్న ఆశయం నెరవేరడానికి పెళ్ళి, సంసారం ఎక్కడ అవరోధంగా నిలుస్తాయో, స్వార్థంతో రోగులకు తగిన

న్యాయం చేయలేకపోతానో, ఏ బంధాలు అడ్డుగా వచ్చి, వృత్తికి భంగం కలిగిస్తాయో అనే ఆలోచనతో, జీవితాన్ని మెడికల్ ప్రొఫెషన్‌కి అంకితం చేసిన మహామనీషి మీరు డాక్టర్ సింగ్! మీకు తప్పక విజయం సిద్ధిస్తుంది. ఎందరో పేషెంట్స్‌కి పునర్జన్మ ప్రాప్తిస్తుంది. మీపేరు వారు జీవితకాలమూ స్మరించుకుంటారు. నాసిక్స్‌సెన్స్ చెబుతోంది డాక్టర్..." ఆరాధనాపూర్వకంగా మనసులో అనుకున్నాడు మధుకర్.

మర్నాటి నుంచి పది రోజులవరకూ డాక్టర్ సింగ్ తన తల్లిని చూడటానికి వెళ్ళాల్సివచ్చి, మధుకర్ మీద భరోసాతో, మోహన్‌ని అప్పగించి వెళ్ళిపోయాడు.

డా॥ మధుకర్‌కి మనసులో సంకోచం కలిగినా ఆ పరిస్థితిలో ఏమీచేయలేక ధైర్యం చిక్కబట్టుకుని, మోహన్‌ని కనిపెట్టుకుని వున్నాడు. అతడికి భార్యా బంధం అంటూ తెగిపోయింది. పిల్లలు లేరు. ఇక హాస్పిటల్ నుంచి ఇంటికి వెళ్ళాల్సిన అవసరం లేదు. దూరపు బంధువులావిడ, భార్యకు సాయంగా వచ్చి, మధుకర్‌ని ఆశ్రయించుకుని వుండిపోయింది. ఆవిడతో మనవరాలు బంధం. ఆ అమ్మాయికి చదువు చెప్పించి, తన కాళ్ళమీద నిలబడేలా చేయాలని మధూ స్కూల్లో చేర్పించాడు. అందుకు కృతజ్ఞతగా ఆవిడ తన కన్న బిడ్డలా మధూని అభిమానిస్తుంది. ఇంటికి వచ్చిన రోజు అన్నీ అమర్చి పెడుతుంది. రాకపోతే కారియర్ పంపుతుంది. ఆవిడ హద్దులో ఆవిడ వుంటూ, చేతనైన పనిచేస్తుంది. ఇది మధూకి ఒక రకమైన సంతృప్తి.

అప్పుడప్పుడు తీరిక దొరికితే, రేణూ, మధూ మాట్లాడుకుంటూ వుంటారు. "డాక్టర్ మధూ! మీరు, పేషెంట్స్ పాలిట దేవతామూర్తి. మీలాగ వృత్తికే అంకితం అయినవారు చాలా అరుదుగా వుంటారు" అంది ఓసారి మాటల్లో రేణూ.

"అదేమంత గొప్పవిషయం రేణూ!అది మా కర్తవ్యం. వృత్తిధర్మం. అందుకు బహుశా, మా పరిస్థితులు కూడా సహకరించాయేమో కూడా! అలా అని డాక్టర్స్ అంతా పెళ్ళీ, సంసారం, సంతోషం లేకుండా వుండమనీ కాదనుకో. అటూ ఇటూ కూడా వారి వారి బాధ్యతను నిర్వహించేవారూ వుంటారు. అయితే ఫ్యామిలీ కలిసిరావడం చాలా కష్టం. డాక్టర్ ఆలోచన, అతడి భార్యకీ వుంటుందనుకోవడం పొరపాటు. ఆవిడ ఆశలూ, కోరికలూ ఆవిడకు వుండవచ్చు".

"భార్యా, భర్త లిద్దరిదీ సేమ్ ప్రొఫెషన్ అయితే ఎలా వుంటుందంటారు? " అడిగింది రేణూ.

"అందులో ఇబ్బందులు అందులో వుంటాయేమో! పిల్లలు ఒక్కరున్నా, వారి గురించి తల్లి, తండ్రిగా శ్రద్ధ పట్టలేరేమో! అందువలన ఏ హాస్టల్‌కో పంపాల్సి వుండి, ఆ పిల్లలు తల్లితండ్రుల ప్రేమానురాగాలు కోల్పోయే అవకాశమూ వుంది. ప్రతీ విషయంలోనూ ఇబ్బందులు వుండవచ్చు" అన్నాడు మధు.

"ఒక్క విషయం అడుగుతాను ఏమీ అనుకోరుకదా? మిమ్మల్ని అర్థం చేసుకోగల వ్యక్తి మీ భార్య. ఆమెలేని లోటును మీరెలా భావిస్తారు? " అడిగింది రేణూ. తీరా అడిగాక, 'అతడి పర్సనల్ మేటర్ గురించి తెలుసుకోవాలనే కుతూహలం నాకెందుకు? ' అనుకుంది.

"రేణూ! ట్రీట్‌మెంట్‌కి ఎందరో పేషెంట్స్ వస్తారు. మేము వారిపట్ల కేవలం వృత్తిధర్మాన్ని పాటించి మసలుకుంటా. కానీ, నువ్వు, అరుణ్ కుటుంబాలతో మాకు పరిచయం అటువంటిది కాదు. ఒక కుటుంబ సభ్యులం మాదిరిగా వుంటుంది. అందుకే నువ్వు ఏమి అడిగినా బాధలేదు. నా గురించి చెబుతాను.

నా భార్య ఇందుమతికి డాక్టర్ అంటే సదభిప్రాయం లేదు. అందుకు ఆమె చదువుకునే

రోజుల్లో జరిగిన ఒక సంఘటన కారణమని చెప్పింది. అయితే నన్నెలా పెళ్ళి చేసుకుందని నువ్వు అడగవచ్చు. అదంతా మామూలే. చాలా కుటుంబాల్లో మాదిరి తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధం చేసుకోవల్సి రావడం. నేను చదువుకునే రోజుల్లో నా క్లాస్‌మేట్‌ని ప్రేమించి పెళ్ళిచేసుకోవాలనుకున్నాను. కానీ ఆ అమ్మాయి అయిశ్వర్యం చూశాక నన్ను ప్రేమించదని భయపడి, ఆ ఆలోచన వదులుకున్నాను. అలా ఇందుమతి నాజీవితంలో ప్రవేశించింది. చెప్పానుగా. ఆమెకు నాపట్ల ద్వేషము. దురభిప్రాయమూ, అనురాగం లేదు. నన్నెందుకు చేసుకోడానికి అంగీకరించా



వంటే 'డాక్టర్‌కి బుద్ధిచెప్పడానికి' అంది. అంటే ఏమిటో నాకు అర్థంకా లేదు. చివరికి తనకు జరిగిన పరాభవం చెప్పింది. అందుకు నేనెంతవరకూ బాధ్యుణ్ణి చెప్పురేణూ! నామీద

అలా వ్యతిరేక భావంతోనే వుండిపోయింది. చివరికి తను మనసుమార్చుకున్నా, నా మనసు విరిగిపోయింది. ఆ తర్వాత ఆమెకు క్యాన్సర్ సోకడం, జీవితాన్ని చేజేతులా సర్వ నాశనం చేసుకోవడం, చివరకు ఏమీ అనుభ వించకుండా ఈలోకాన్ని వదిలిపోవడం నీకు తెలిసిందే!"

"ఏవిధంగా డాక్టర్ ఆమెను పరాభవిం చారో తెలుసుకోవచ్చా? " అడిగింది రేణూ.

"ఎవరో అవకాశవాది, నీచుడు మోహావే శంలో, అనౌచిత్యంగా ప్రవర్తించడంవలన, అందరూ ఒక్కలాగే వుంటారనుకోవడం ఆమె పొరబాటు" ఆ విషయం తెలిసేసరికి ఆమె జీవితాన్ని కోల్పోయింది. కొందరి జీవి తాలంతే!"

"ఆమె కారణంగా, ఏ కళంకమూలేని మీరు కూడా బలి అయ్యారుకదా? " సాను భూతిగా అంది రేణూ.

"అలా అని నేను అనుకోలేదు రేణూ! దాన్ని వరంగా మార్చుకుని, హాస్పిటల్ కే అంకితం అయి పోయాను. ఇటువంటి గొడ వలు లేకుండా, డా॥ సింగ్ అసలు ప్రేమా, పెళ్ళి జోలికి పోనేలేదు" అన్నాడు మధుకర్.

అందరికీ దూరంగా వుంటూ, నాదారిన నేను వుంటాను అనుకునే వారు కూడా తన ఆలోచనలకు అనుగుణంగా వుండేవార్ని, లోన్లీనెస్‌తో బోర్‌గా అనిపించినప్పుడూ, సంతోషాన్నీ, దుఃఖాన్ని షేర్ చేసుకోవాలని పించినప్పుడు, మరోమనిషి స్నేహాన్ని కోరు కుంటారు. అందులోనూ ఎయిడ్స్ అనే మహ మ్మారిని, నిరోధించే మహా యజ్ఞంలో తోడుగా నిల్చిన రేణూ వంటి అమ్మాయితో, మనసులోని భావాలు పంచుకోవాలనిపిం చడం మధుకర్ తప్పుకాదు. అతడికి రేణూ పట్ల ఒక ఆత్మీయతాభావం ఏర్పడింది. అందుకే ఎప్పుడూ పర్సనల్ మేటర్స్ సింగ్‌తో చెప్పనివాడు, రేణూకి చెప్పాడు. 'డా॥ మధు కర్ లైఫ్‌లో పోగొట్టుకున్న సంతోషాన్ని, నేను తిరిగి అతడికి ఇవ్వలేకపోవచ్చు. కానీ మన సుకి కాస్తంత స్వాంతన చేకూర్చడానికి ప్రయత్నం చేయాలి' అనుకుంది ఆమె.

డా॥సింగ్ కూడా మంచి వ్యక్తి! అయినా ఎందుకో అతడి మనస్తత్వం ఎదుటివార్ని కాస్త దూరంగా వుంచుతుంది. 'జాగ్రత్తగా మాట్లాడాలి. ఆయనను విసిగించకూడదు-' అనే అనిపిస్తుంది తప్ప. అతి చనువు తీసు కోనివ్వదు. కొందర్ని చూడగానే మనసు విప్పి చెప్పాలనిపిస్తే. మరి కొందర్ని గౌరవ భావంతో చూడాలనిపిస్తుంది. మరి కొందర్ని చూసినప్పుడు అరమరికలు లేకుండా, వయసనే తేడా లేకుండా, ఆదరా భిమానాలతో కలసిపోవాలనిపిస్తుంది. ఇదంతా మనసుకి సంబంధించిన భావన.

జీవితంలో బాల్యం, చదువు, పూర్తయి ఉద్యోగంలో స్థిరపడిన ఆడ అయినా, మగ అయినా మెచ్యూరిటీ వచ్చి లైఫ్‌పట్ల ఒక అవగాహన ఏర్పడుతుంది. పదహారేళ్ళ నుంచి ఇరవై రెండేళ్ళ వయసు వరకు ఒక ఆకర్షణ, ఆవేశం, ఆపోజిట్ సెక్స్‌ంటే ఇంట్రెస్ట్ ఏర్పడవచ్చు. అప్పుడు తీసుకునే నిర్ణయాలు తొందరపాటుతో కూడినవి. వాటికి ఒక రూపం, స్థిరత్వం అంటూ వుండవు. మనసు గందరగోళంగా అటూ ఇటూ కాని స్థితిలో తప్పటడుగు వేయచ్చు. నిజానికి ఈ వయసు చాలా ప్రమాదకరమైనది.

విదేశాలలో తల్లి, తండ్రులమీద ఆధారపడే పిల్లలు తక్కువ మంది కావడంవలన, వాళ్ళు చెడుత్రోవన పోయే అవకాశాలు ఎక్కువ. ఎవరికివారు సంపాదించుకుని, చదువుకో వాలి. పదహారు సంవత్సరాల వరకే పేరెంట్స్ పిల్లల్ని దగ్గిర వుంచుకుంటారు. దానికితోడు భార్యా, భర్తలు తరచుగా విడి పోతూండటం వలన పిల్లల భవిష్యత్ దెబ్బ తింటుంది. అందరూ అలావుండరు. కాని, చాలావరకు ఆర్ఫనేజ్డ్ చిల్డ్రన్ ఎక్కువకా వడం వలన వారు అలాగే మిగిలిపోతారు.

మన దేశంలో అలా కాదు. ఉద్యోగంలో స్థిర పడేవరకూ తల్లిదండ్రులే వారి బాధ్యత వహిస్తారు. ఒకరకంగా ఇది రక్షణ కల్పిస్తే, కొందరికి అలసత్వాన్ని, జీవితం పట్ల నిరాసక్తను కూడా కలిగిస్తోంది. ముందుకుపోయే అవకాశాలకు కళ్ళెమూ వేస్తుంది. మనిషి మేథస్సు అందరిలో ఒకలాగ వుండదు. కుటుంబంలోని వ్యక్తుల జీన్స్ ప్రభావం, పరిసరాల ప్రభావం కారణంగా కూడా మనిషికి తెలివితేటలు వస్తాయి. వాటి ఆధారంగా తల్లిదండ్రులు బిడ్డలను ప్రోత్సహించాలి. స్నేహితుల్లా, మంచి సలహాలు ఇవ్వాలి-తప్ప, నీ గురించి నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. వాటిని తీర్చకపోవడం నీ చేతకాని తనం' అని చిన్నబుచ్చకూడదు. వాటి ప్రభావం చిన్నప్పుడు తెలియదు. భవిష్యత్‌లో ఎప్పుడో బయటపడవచ్చు!

నా క్లాస్‌మేట్ ఒకతను మా కుటుంబంతో చాలా క్లోజ్‌గా వుండేవాడు. మేం అదంత సీరియస్‌గా తీసుకోలేదు. ఆ తర్వాత అతను చదువుకోవాలని ఉన్నా ఫాదర్ చెప్పినట్టు విని, ఉద్యోగంలో చేరిపోయాడు. పోనీ అందులో అయినా పైకివెళ్లే అవకాశాలు వెదుక్కోలేదు. పెళ్ళిచేసుకున్నాడు. నలుగురు బిడ్డల తండ్రి అయ్యాడు. ఆ పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు అయేసరికి అతడికి చేసిన పొరబాటు తెలిసివచ్చింది. పోనీ ఆ కాలంలో అవకాశాలు లేవనుకుందామా అంటే, అతడి క్లాస్‌మేట్స్ బాగా సెటిల్ అయ్యారు. విదేశాలు వెళ్ళారు. పెద్ద ఇండస్ట్రియలిస్ట్స్, డాక్టర్స్ అయ్యారు. అంటే అతడిపైన తల్లి, తండ్రుల ప్రభావం అంతగా వుంది. అతను తన గురించి ఆలోచించలేదు. త్వరగా ఉద్యోగంలో చేరి తండ్రిని ఆర్థికంగా ఆదుకోవాలని మాత్రమే ఆలోచించాడు. నిజానికి అతడి తండ్రి రిటైర్ అవకముందే ఇతను ఉద్యోగంలో చేరాడు. కూతుళ్ళ పెళ్ళిళ్ళూ ఆయనే చేశాడు. పెన్షన్‌తోనూ, స్వంత ఇల్లు, కొద్దిపాటి ఆస్థితోనూ, ఆయనకు ఆఫ్టర్ రిటైర్‌మెంట్ లైఫ్ బాగానే జరిగే అవకాశం వుంది. ఎటొచ్చీ నా ఫ్రెండ్ భవిష్యత్ అగమ్యగోచరంగా వుంది. పెళ్ళి చేసుకుని వెంటనే పిల్లల్ని కనడం ఎంత పొరబాటో ఆలస్యంగా అతడికి తెలిసివచ్చింది. ఇక డబ్బు సంపాదించే మార్గాన్వేషణలో తనమునకలైపోయాడు.

చాలా కాలానికి మేమిద్దరం కలుసుకున్నప్పుడు చెప్పాడు అతను. "రేణూ! అమ్మాయివై వుండి నీ లైఫ్‌ని చక్కగా ప్లాన్ చేసుకున్నావు. అందుకు నీ పేరెంట్స్ సహకారమూ వుండి వుండచ్చు. నేను బాధ్యత అనేది ఎంతసేపూ. తల్లి తండ్రుల వరకే! అని ఆలోచించాను. వాళ్లకి ఇష్టమైనట్టు చదివి, ఉద్యోగంలో చేరి, వాళ్ళ ఆనందం కోసం పెళ్ళిచేసుకుని, తండ్రినయ్యాను. అంతటితో వాళ్ళ బాధ్యత తీర్చుకున్న అసలైన కొడుకుని... అని చాలా గొప్పగా ఫీలయ్యాను. కానీ నా కోసం నిస్సహాయంగా ఏమీ చేతకాని వాడిలా మిగిలిపోయాను...' అంటూ విచారించాడు.

ఇంతకీ నీ బాధ ఏమిటోయ్? అంటే, 'ఫ్యామిలీ ప్లానింగ్ లేకపోవడం, బాగా డబ్బు సంపాదించేటంత చదువు చదవకపోవడం... అన్నిటికంటే ముఖ్యంగా నిన్ను పోగొట్టుకోవడం అన్నాడు. నాకు నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు. 'అంటే. నీ ఒక్కడి ఇష్టమూ సరిపోతుందా? నా ఇష్టాయిష్టాలతో పనిలేదా? అన్నాను కోపంగా!

"నాకు తెలుసు రేణూ! ధైర్యం చేసి నిన్ను పెళ్ళి చేసుకుంటానని మావాళ్ళతో చెప్పలేని పిరికితనం కారణంగానే నువ్వా ఇలా ఒంటరిగా మిగిలిపోయావని....!" అన్నాడు.

అప్పుడు నాకు ఒళ్ళు మండిపోయింది. అతగాడంటే ఏదో పడి చచ్చిపోయినట్టు, మరెవ్వరూ అతనిలాటి వాళ్ళు దొరక్క నా ప్రేమని త్యాగం చేసినట్టూ వూహించుకునే అతడి పిచ్చితనానికి పగలబడి నవ్వాను.

"ఎందుకూ నవ్వుతావ్...?" కంగారుగా అడిగాడు.

"ఎందుకంటే, నువ్వు ప్రేమించానని, పెళ్ళి చేసుకుంటానని నన్ను అడిగితే నా సమాధానం ఏమిటో తెల్చుకుని నవ్వొచ్చింది" అన్నాను.

అంతే ఇక మళ్ళీ అతను నాకు కనిపించలేదు. కనిపించడని, కనిపించకూడదనే తగిన సమాధానం చెప్పాను" రేణూ తన మనసు విప్పి చెప్పింది మధుకర్‌కి.

"అవును రేణూ! ప్రతివారికీ ఒక వ్యక్తిగతం అంటూ వుంటుంది. అది వింత ఏమీ కాదు. అసలు నేను అనుకుంటాను. ఒక అబ్బాయి, అమ్మాయి, పరిచయం ప్రేమగా మారి, ఆ ప్రేమ పెళ్ళికి దారితీసినా, అందులో ఏమీ ప్రత్యేకత వుండకపోవచ్చునని! ఎందుకంటే పెళ్ళికి ముందు ప్రేమ ఒక్కటే ఆలోచన! తీయగా కబుర్లు చెప్పుకోవడం, హాయిగా తిరగటం, సంపాదించే డబ్బుతో ఎంజాయ్ చేయడమూను. తీరా పెళ్ళి అయ్యాక, మీద పడిన బాధ్యతలు, ప్రేమని చంపేసి, ట్రాన్స్‌పరెంట్‌గా కనిపించే నిజజీవిత నగ్నసత్యాలను ఎదుర్కోవలసి వచ్చేసరికి, లవ్ అనేది భ్రాంతి అని, ఇద్దర్ని కట్టిపడేసే ఆయుధమని తెలిసివస్తుంది. అప్పుడు పెద్దవాళ్ళు కుదిర్చి చేసిన పెళ్ళయినా అంతేకదా! తేడా ఏముంది? కాకపోతే, వద్దంటూంటే ఒప్పించి కట్టబెట్టారని, నెపం వాళ్ళమీదకు నెట్టేయచ్చు. అదే ఎవరికి వారు ఇష్టపడి చేసుకున్న పెళ్ళయితే, పెద్దవాళ్లని అనకుండా, ఒకర్నొకరు అనుకుంటే సరిపోతుంది. అవునంటావా రేణూ!" అన్నాడు డా॥ మధుకర్.

"నేనేం చెప్పగలను మధూ? రెండు విషయాల్లోనూ నాకు అనుభవం కాలేదు" అంది రేణూ.

మోహన్ కారణంగా ఒకచోట కలుసుకున్న డాక్టర్ మధుకర్, రేణూ అనుకోకుండా దగ్గిరయ్యారు. ఆప్తులయ్యారు. ఒకరి సమస్యను మరొకరు పంచుకునేంతగా చేరువయ్యారు. అందులోనూ డాక్టర్ సింగ్ లేని టైమ్‌లో పూర్తి కాలాన్ని మధుకర్ హాస్పిటల్లోనే వుండాల్సిన అవసరం కూడా మరో కారణం. అందుకే ఇద్దరూ పూర్తిగా ఒకరి గురించి మరొకరు అర్థంచేసుకోగల అవకాశమూ ఏర్పడింది. ఒకరు కనిపించకపోతే, మరొకరికి తోచని పరిస్థితీ ఏర్పడింది.

ఈ విషయాన్ని డా॥ సింగ్ గ్రహించాడు.

మోహన్ ఈమధ్య బాగా వీక్ అయిపోయాడు. ఎప్పుడూ బెడ్‌మీదనే వుండిపోతున్నాడు. ఇందుకు కారణం వ్యాధి తీవ్రతా, లేక మానసికమైన వ్యథా అనే విషయం తెలుసుకోమని రేణూతో చెప్పాడు.

"మోహన్...! ఈ టాబ్‌లెట్స్ వేసుకో..." ట్రీట్‌మెంట్‌లో పార్ట్‌గా చెప్పింది రేణూ.

అతను మాట్లాడలేదు.

దగ్గిరగా వచ్చి, లేపి కూర్చోబెట్టి, పిల్స్ వేసి వాటర్ పట్టించింది. తన భుజానికి ఆనుకుని వున్న మోహన్‌ని, అలాగే పొదివి పట్టుకుని, "మోహన్! నువ్వీ మధ్య చాలా డల్‌గా వుంటున్నావ్. ఎందుకని? ఏమైనా బాధగా వుందా? " అని అడిగింది.

"బాధ అంటూ ఏమీ లేదు కానీ, ఇలా నాలుగ్గోడల మధ్యా ఎంతకాలం? అనే నిస్పృహ నన్ను కృంగదీస్తోంది రేణూ..." అన్నాడు.

"అంటే మానసికమైన ఆందోళన అన్నమాట. మనందరి ఆరాటమూ మరచిపోయావా మోహన్? నాలుగు గోడలు మధ్యా పుట్టుక నుంచీ వుండటంలేదుగా. మనతో కంపేర్ చేస్తే, డాక్టర్ ఏమనుకోవాలి? పేషెంట్స్ అనేవారు, రోగగ్రస్థులయినప్పుడే ఇలా వుంటారు. కాని డాక్టర్ ఎప్పుడూ మన మధ్య రకరకాల బాధల మధ్యా వుండాల్సి వస్తుంది. ఇవిగాక వ్యక్తిగతమైన సమస్యలు వున్నవారికి మరింత బాధ కదా? అలా అని వారు కృంగిపోతారా? డిసీజ్‌తో ఫైట్ చేయటం ఒక ఛాలెంజ్‌గా

# పరిసముత్యాలు

- క్లిష్టంగా కనిపించేది ఏదీ గొప్ప విషయం కాబోదు

  – థామస్ ఆక్వినాస్

- ఉత్తముల చరిత్ర తెలుసుకోవడం అల్పులకు సాధ్యమా?

  – మహాభారతం

- మాట తర్వాత సమాజాన్ని బంధించి ఉంచగల అత్యంత శక్తిగలది నవ్వు ఒక్కటే.

  – మాక్స్ ఈస్ట్‌మన్

- తెలివిగల మనిషికి డబ్బు మెదడులో ఉంటుంది. పర్సులో కాదు.

  – బాసిల్

- ఊగిసలాడే మనసు నిరుపయోగమైన సంపద వంటిది.

  – యురిపిడస్

- మౌనంగా ఉండు లేదా మౌనంకంటే మంచి మాటలు చెప్పు.

  – సెర్వాంటిస్

- బాధ్యత లేకుండా మసలేవారిని దేవుడు విస్మరిస్తాడు.

  – ఫిసిండన్

- శీలం, శౌర్య గుణాలుగల మహాత్ముల శక్తి సామర్థ్యాలు ఊహకు అందవు.

  – భర్తృహరి

- తనని తాను తెలుసుకోవటమే నిజమైన గెలుపు.

  –ప్లేటో

- గెలవాలన్న తపన నీలో సడలిన తక్షణమే ఓటమి నిన్ను ఆశ్రయిస్తుంది.

  – హెరాల్డ్ లాస్కీ

- విజయంకంటే ఆ విజయ సాధనకు చేసిన కృషే మనిషికి తృప్తినిస్తుంది.

  – బ్లాసీ పాస్కల్

- ప్రతిదానిలో లోపాలు చూడటం కూడా మానసిక రోగమే.

  – వాల్టైర్

- ఉపయోగించుకునే తెలివి ఉండాలేగానీ ఈ సృష్టిలో నిరుపయోగమైంది ఏదీ లేదు.

  – డ్రకర్

- చింత మాని పనిలో పడితే అంతా ఆనందమే.

  – మెటర్‌లింక్

- సుఖాలకు దూరమైనపుడే శిరస్సుమీద కిరీటం చేరుతుంది

  – షేక్స్‌పియర్

సేకరణ: దాసరి వెంకటరమణారావు

తీసుకుని, రోగి బాధను పోగొట్టడానికి ఆరాటపడతారు. అది వృత్తిధర్మం కావచ్చు. మానవత్వం కావచ్చు మరో భావన కావచ్చు కానీ నిరాశా, నిస్పృహ, పలాయనవాదం అనేది వుండదు. ఇది ఆలోచించు మోహన్" అంది రేణూ.

"డాక్టర్ అయితే ఒక ఆశతో, నమ్మకంతో, భవిష్యత్‌లో జరిగే మంచి కోసం అనే భావంతో వుండచ్చు కానీ పేషెంట్‌కి తన వ్యాధి ఏమిటో తెలిసి, దానికి మృత్యువు మాత్రమే పరిష్కారమని తెలిసి, ఎలా సంతోషంగా, ధైర్యంగా, మనశ్శాంతిగా వుండగలడు రేణూ? చెప్పినంత సులువు కాదు" అసహనంతో అన్నాడు మోహన్.

"అదే వద్దు మోహన్! నువ్వు మృత్యువు తలంపు మనసులోకి రానీయకు. ప్రతి మనిషికి, అందులో ఈ హాస్పిటల్లో వుండే ప్రతి పేషెంట్‌కి భవిష్యత్ మీద ఆశ అనేది వుండాలి. ఏమో ఎవరు చెప్పగలం? నువ్వీ మృత్యువును దూరంగా తరిమివేస్తావేమో! ఈ డిసీజ్‌ని జయించిన అద్భుత వ్యక్తివి అవుతావేమో! ఎవరు చెప్పగలరు? జరిగిన సంఘటన నాకు తెలిసింది చెబుతాను విను.

మా బంధువుల కుటుంబం వుంది. ఆ కుటుంబంలో ఒక వ్యక్తికి తరచూ తలనెప్పి వస్తూ వుండేది. అతను రిచ్ మాన్. ట్రీట్‌మెంట్‌కి ఎంతైనా ఖర్చుచేయగలవాడు. డాక్టర్స్‌కీ కొదవలేదు. ఎన్నో టెస్ట్సు చేశారు. మందులు వాడారు. స్కానింగ్, ఎం.ఆర్.ఐ.లు తీశారు. కొంతకాలం అసలు వ్యాధి ఏమిటో అంతుపట్టలేదు. ఎందుకంటే ఏ రిపోర్ట్ చూసినా నార్మల్‌గా వుండేది. మందులు దారిన మందులు నిష్ఫలం అయ్యేవి. అతడికి రోజుల తరబడి మత్తు మందులు వాడినా నిద్ర అనేది లేకుండా, రాత్రీ పగలూ తలనెప్పి బాధిస్తూనే వుండేది. ఆయన బాధ ఎవరమూ చూడలేకపోయాం. ఎన్నో నగరాలు తిప్పారు. డాక్టర్స్ ఎక్స్‌పెరిమెంట్స్ చేశారు. చివరికి సంవత్సరం బాధపడిన అతనికి మరణం ఒక్కటే శాశ్వత పరిష్కారం అనే స్థితికి వచ్చారు. అది రేపవచ్చు ఈ క్షణంలోనే అవచ్చు అని నిర్ధారణ చేశారు. ఏ మూలనో కొద్దిపాటి ఆశ చివరి ప్రయత్నంగా ఈ హాస్పిటల్లోనే కొందరు సర్జన్స్ ఆపరేషన్ చేశారు. ఆపరేషన్ సక్సెస్ అయినా 'పేషెంట్ కండిషన్ బెటర్ నౌ. బట్ నాట్ అవుటాఫ్ డేంజర్' అన్నారు. మరో రెండు సంవత్సరాలు మృత్యుభయంతోనే గడిచాయి. అంతవరకూ పరిపూర్ణ ఆరోగ్యంగా వున్న అతని భార్యకి బ్రెయిన్ ట్యూమర్ అని తెలిసింది. ఎంతో ట్రీట్‌మెంట్ చేయించారు. విపరీతంగా డబ్బు ఖర్చు చేశారు. అంతా కలిపి వారం రోజులు అయినా గడవకుండా, ఆమె మరణించింది. విచిత్రం చూడు మోహన్! ఆశ వదిలేసుకున్న ఆయన కోలుకోవడం, ఆరోగ్యంగా ఉండే ఆవిడ క్షణాల్లో మృత్యువాత పడటం. దీన్ని కర్మ సిద్ధాంతానికి అన్వయించుకున్నా, ఎప్పుడూ అనారోగ్యంతో వుండే వ్యక్తి గురించి ఆలోచిస్తారు తప్ప, ఆరోగ్యంగావున్న వ్యక్తివైపు దృష్టి వుండదు. నేను చెప్పేది ఏమంటే నీ విషయంలో కూడా, ఆరోగ్యం బాగుపడవచ్చుననే అవకాశం గురించి! ముఖ్యంగా ముందు, ముందు నీకారణంగా ఎంతో ప్రయోజనం చేకూరగలదనే ఆశాదృక్పథంతో వుండు మోహన్.

ఆర్మీలో జవాన్లు, దేశాన్ని శత్రువుల నుంచి కాపాడాలనే పట్టుదలతో వుంటారు కానీ, స్వలాభం గురించి ఆలోచించరు. అలాగే నువ్వు కూడా రాబోయే తరం పరిపూర్ణమైన ఆరోగ్యంతో వుండాలని కోరుకో. అందుకు 'నేను సమిధను' అనుకోవద్దు. ఒక్కరి త్యాగం కోట్లమందికి జీవితాశను కలిగిస్తుంది. మోహన్ నామాటలు నీకు నచ్చలేదా? " అంది రేణూ

"ఏమో రేణూ! నా మనసు నువ్వు చెప్పిన విషయాల గురించి ఆలోచించడం

లేదు. పదిమంది స్నేహితులతో, స్వేచ్ఛగా నాకు నచ్చినట్టుండే నాజీవితం ఒక్కసారి మారిపోయింది. అందరూ దూరం అయి పోయారు. ఈ హాస్పిటల్, బెడ్, నా చుట్టూ డాక్టర్స్ శాశ్వితం అయిపోయారు" బాధగా అన్నాడు మోహన్.

"మోహన్! నీ బాధలోనే అందుకు కారణం కూడా కలిసివుంది. పనికిమాలిన స్నేహితులూ, స్వేచ్ఛా జీవితం, నిన్నీ స్థితికి తీసుకువచ్చిందని నువ్వు అనుకోవడంలేదా? వారు నీ మనసుకు దగ్గరగా వచ్చినవారు కాదు. నిన్ను హీనస్థితికి తీసుకువచ్చిన వారు. ఇది గ్రహించవేం! అన్నీవున్న నీలాంటి వారికి తండ్రి మమకారం లభ్యంకా లేధనేది పెద్ద లోపమా? నువ్వది ఒక నెపంగా భావించావంతే! అన్నిటికీ మించి అమ్మప్రేమ వుందికదా మోహన్. చాలా కుటుంబాల్లో తండ్రి ఒక నియంత. అందులోనూ రిచ్ ఫ్యామిలీస్‌లో అది సర్వసాధారణం. తండ్రి తర్వాత అన్న వున్నాడు కదా? అతడికి నువ్వెందుకు చేరువకాలేకపోయావు? జలసీ వలన. నీతండ్రి అతణ్ణి అభిమానిస్తున్నాడనే అసూయవలన. ఎప్పుడూ లోపాలను ఎదుటి వారిలోనే వెదక్కూడదు మోహన్! మనం నడిచే దారి మంచిదా కాదా అనే విచక్షణ, ఆలోచనా కూడా వుండాలి. అరుణ్‌ని పొగుడుతున్నాను అనే భావం రానీకుండా విను. అరుణ్‌కి నువ్వు కోల్పోయానన్నుకున్న తండ్రిప్రేమ వుంది. అమ్మ ఆదరణ వుంది. హోదా, ఐశ్వర్యం వున్నాయి. అయినా అతడి దృష్టి ఆర్మీలో చేరాలని ఎందుకు అటుమళ్ళిందో చెప్పు. దేశ సేవాభావం. అన్నిటినీ విడిచిపెట్టి తను మంచిదనుకున్న, నచ్చిన ఆదర్శాన్ని ఎంచుకున్నాడు. అతడి జీవితం నష్టపోలేదే! చాలా హాపీగా సాగిపోతోంది. నీకు వున్న అవకాశాలు అతడికి లేవా? మీరిద్దరూ ఒక రక్తం పంచుకున్నవారు కాదా? అసలు ట్విన్స్ అయినందుకు అతడి అంశా నీలో వుండాల్సింది. ఎందుకో నువ్వు మాత్రం వ్యతిరేకంగా మారిపోయావు.

రేఖ గురించి నీకు తెలియదు. ఛాందసుల కుటుంబంలో పుట్టి, తండ్రి, అన్నల హద్దుల్లో పెరిగింది. ఆమెకు కుటుంబ భారం బాధ్యతను అప్పగించారు. అయినా ఒద్దికగా వారు చెప్పినట్టు నడుచుకుంది. తన ఇష్టా అయిష్టాలకు విలువ ఇవ్వని తండ్రి కారణంగానే నిన్ను పెళ్ళి చేసుకుంది. ఆ తర్వాత జరిగిన సంఘటనల కారణంగా, అరుణ్‌కి భార్య అయింది. అరుణ్ తన జీవితంలో ప్రవేశించేందుకు, మీ అమ్మగారు కారణం. ఆ విధంగా తన జీవితాన్ని చక్కగా మంచి మలుపు తిప్పుకుని అటు వైపు నడిచింది. అందమైన మలుపుగా మార్చుకుంది. అసలు రేఖ ఒకరు చెప్పినట్టు అనుసరించడమే, తప్ప, నాకిది కావాలని కోరుకునే మనస్తత్వం ఆమెకు లేదు. అనుసరించడమే తప్ప, ఎదురుతిరిగే తత్వం కాదు. వాళ్ళది పూర్ ఫ్యామ్లీ. నువ్వు రేఖను మనస్ఫూర్తిగా ఇష్టపడటం ఆమె జీవితాన్ని నాశనం చేయడమే అని నువ్వు ఆలోచించలేదో, రేఖమీది ఇష్టం, నిన్ను ఆలోచించనీయలేదో రేఖ నాన్నగార్ని నీ దారికి తెచ్చుకుని, కుటుంబానికి సాయం చేస్తాననే సాకుతో పెళ్ళికి వప్పించావు. కానీ చివరకి మిగిలింది నీకు శూన్యమే మోహన్! దీనికోసం ఎంత ఆరాటపడ్డావు. ఎంతమందితో పోరాడేవూ... చివరికి అలిసిపోయి ఈ స్థితికి వచ్చావు" అది రేణూ.

మోహన్ మీద రేణూ మాటలు బాగా పనిచేశాయ్.

'రేణూ చెప్పింది కరక్ట్! ఇంతచేసి నాకు మిగుల్చుకున్నది శూన్యం అంటోంది. కాదు... రేణూకి తెలియదు. జీవితంలోకి పెద్ద తప్పిదం రేఖను ఆహ్వానించడం. కాని ఆమె దక్కలేదు. ఆమె దక్కలేదన్న నిరాశ నుంచి కసి, ద్వేషం, నన్ను పిచ్చివాణ్ణి చేశాయ్. దాంతో అందరి మనసులకూ గాయం

చేశాను. అనారోగ్యం లొంగదీసుకుని పీల్చి పిప్పిచేసే సమయంలో అనుకోకుండా రేణూ ఆదుకుంది. నన్ను లాలించింది. నా తప్పును వివరించింది. మంచి మనిషిగా మార్చింది. అప్పట్నించీ, నా మనసులో మెల్లగా చోటు చేసుకుంది. రేఖను చూసినప్పుడు కలిగిన కాంక్ష, రేణూని చూస్తే కలగదు. 'క్రూరమైన సింహం సర్కస్‌లో రింగ్ మాస్టర్‌కి లొంగిపోయినట్టు నా మనసును స్వాధీనం చేసుకుని సహనం అనే కొరడాతో దారికి తీసుకువస్తోంది. అయితే ఆ కమ్చీ శరీరాన్ని తాకదు దూరం నుంచే భయపెడుతుంది. రేణూ! నేను నీకు వశం అయిపోయాను. నువ్వు చెప్పినట్టు చేస్తాను. నాకు ఈ చెరనుంచి విముక్తి కలిగించు. చెర అంటే నీ సామీప్యం కాదు సుమా! ఈ అనారోగ్యం. జీవితం పట్ల నిరాశ. చేజారిపోయిన బ్రతుకు మీద తీపి, రేణూ! నాలాంటి నిర్భాగ్యుడికి, చివరి దశలోనే



తప్పు తెలుస్తుంది ఎందుకు? ముందుగానే మేలుకొలిపే వ్యక్తి తారసపడలేదు. అందుకే కదూ? ' అతడి మనోవేదన నుంచి కన్నీటిరూపంగా జాలువారింది.

రేణూ చలించిపోయింది. అతణ్ణి బలంగా తనలో అయిక్యంచేసుకోవాలని అనుకుంది. అయితే అది చాలా ప్రమాదకరమైన లాలింపు. 'నేనేమైనా అయిపోతాను. మోహన్‌ని దక్కించుకుంటాను. ఇది నిజం...' అనుకుంది.

ఆ క్షణంలో డాక్టర్ మధుకర్ రాకపోతే ఏంజరిగేదో...! "మిస్టర్ మోహన్ మీకో గుడ్ న్యూస్..." అన్నాడు అక్కడే కుర్చీలో కూర్చుంటూ.

"నాకు గుడ్ న్యూస్ ఏముంటుంది డాక్టర్? యు ఆర్ టేకింగ్ డిసెషన్ ఫెర్‌మి. దటీజ్ మెర్సీ కిల్లింగ్! యామై కరక్ట్? "

"వ్వాటార్‌యు టాకింగ్ మిస్టర్ మోహన్! యు ఆర్ రాంగ్..." కొంతసేపు మధుకర్ నోటంట మాటరాలేదు. మోహన్ మానసిక పరిస్థితి ఇంతదారుణంగా ఆలోచిస్తుందని అతను అనుకోలేదు. చప్పున తేరుకున్నాడు. నవ్వుతూ, ఆందోళనను చెరిపివేసి, "మోహన్, మన హాస్పటల్లో స్పెషల్ రూమ్ ఎలాట్ చేసి, హోమ్ థియేటర్ అరేంజ్ చేశారు. నీకు నచ్చిన పిక్చర్స్ చూడచ్చు కొంతసేపు మన కలతలు, అనారోగ్యాలూ మరచిపోవచ్చు ఇదీ నా ఆశ" అన్నాడు.

"ఎస్ డాక్టర్. ఎస్! కొంతసేపు మాత్రమే మరచిపోవచ్చు శాశ్వితంగా మరచిపోవాలంటే, మనుషులే లేకుండా పోవాలి కదూ డాక్టర్? "

"వ్వాట్ మోహన్! దిసీజ్ టూ బాడ్. నీ కోసం మేము ఎన్నో చేయాలని అనుకుంటున్నాం. ఇంత నిరాశ పనికిరాదు" నిరుత్సాహంగా అన్నాడు డా॥ మధుకర్. "మీ డాక్టర్స్ కొద్దిక్షణాల్లో మరణించే వ్యక్తికి కూడా ఇలాగే చెబుతారు తప్ప. నీకివే చివరి రోజులు అనిమాత్రం చెప్పరు. ఎందుకు దాచడం? మీరు కూడా ఫారిన్ కంట్రీస్‌లో డాక్టర్ చెప్పినట్టు, పేషెంట్ పొజిషన్ ఏమిటో వివరంగా చెప్పితీరాలి. ఇలా మభ్య పెట్టడం మంచిదా? "

"నువ్వు ఒక్క విషయం మరచిపోవద్దు మోహన్! నువ్విప్పుడు మానసిక బలాన్ని కోల్పోకూడదు. మనం ప్రస్తుతం ప్రయోగాల్లో వున్నాం. చేసేవన్నీ వృధా, మనం నిస్సహాయులం, ఈరోజు వుండి, రేపు పోయేవాళ్ళమే. అనుకుంటే ఏపనీ చేయక్కర్లేదు. భవిష్యత్ గురించి ఆలోచించక్కర్లేదు. ఈ చదువులు, ప్రయత్నాలు, ఏమీ అవసరంలేదు. అడవుల్లో మునిపుంగవుల్లా కందమూలాలు, ఆకూ అలములూ తింటూ కోరి మృత్యువును ఆహ్వానిస్తే సరిపోతుంది కదూ? " ఆవేశంగా చెప్పాడు డాక్టర్ మధుకర్. ఎన్నడూలేని మార్పు మధుకర్‌లో చూసిన రేణూ, స్థాణువులా అలాగే వింటూండిపోయింది.

మోహన్‌కి తన పొరబాటు తెలిసివచ్చింది. 'నేను అలా అనకుండా వుండాల్సింది. పేషెంట్స్‌కి ధైర్యమై జీవితాశ కలిగించి ప్రయత్నలోపం లేకుండా నిస్వార్ధంగా వ్యాధులతో పోరాడే డాక్టర్‌ని నిందించాను. ఆయనకు కోపం తెప్పించాను' అనుకున్నాడు.

"డాక్టర్... అయామ్ వెరీ సారీ! విచక్షణా జ్ఞానం నశించి, ఏదో మాట్లాడేను. ఇప్పుడే హోమ్ థియేటర్ చూద్దాం పదండి" అన్నాడు.

కానీ డా॥మధుకర్ ఏమీ మాట్లాడలేదు. రేణూ వైపు తిరిగి "రేణూ! ఖాళీ అయినపుడు నారూమ్‌లోకి ఓసారి వచ్చివెళ్ళు..." అంటూ చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత తన తొందరపాటుకి మోహన్ చాలా బాధపడ్డాడు. "నా అవివేకంతో డాక్టర్ మనసుకి గాయం చేశాను. నా వలన ఎవరికీ వుపయోగం ఎటూలేదు. సరికదా, నేనో సమస్యగా తయారయ్యాను కదూ, రేణూ...? " అన్నాడు.

రేణూ ఏమీ బదులుచెప్పలేదు. నిజానికి ఆమె ఎవరినీ తప్పుపట్టాలని అనుకోలేదు. మృత్యుముఖానికి చేరువలో నైరాశ్యంతో ఎదురుచూసే మోహన్, ప్రాణాంతక వ్యాధి నుంచి ఏ ఒక్కర్నినా బయటపడవేయాలనే పట్టుదలతో శ్రమించే డాక్టర్ మధుకర్ మరో వైపు మహాసంగ్రామంలో పోరాడుతున్నారు. సందర్భాన్నిబట్టి, మోహన్‌లో నిరాశా నిస్పృహ సహజం అయినట్టు, ప్రోత్సాహం, సహకారం, ఆశా, డా॥ మధుకర్‌కీ అవసరమే.

అందుకే ఏ ఒక్కరినీ సమర్థించనూ లేదు. సంభాషణ పొడిగించనూ లేదు. నేను ఎక్కువ మాట్లాడటం అనవసరం. మెల్లగా ఎవరికి వారే, సర్దుకుంటారు అనుకుంది. మౌనంగా వుండిపోయింది.

రెండురోజుల తర్వాత మధుకర్ రూమ్‌లోకి వెళ్ళింది. "చెప్పండి డాక్టర్. ఎందుకు పిలిచారు? " "రేణూ! నీతో ఒక విషయం చెప్పాలని చాలా రోజులుగా అనుకుంటున్నాను. కానీ నువ్వు సీరియస్‌గా తీసుకుంటావో, అసహ్యించుకుంటావో, నన్ను నమ్ముతావో లేదోనని ఎప్పటికప్పుడు వాయిదా వేస్తూ వచ్చాను. కానీ నాలో ఘర్షణ తట్టుకోలేక, ఏదో ఒకటి తేల్చుకోవడం మంచిదిగా తోచి, ధైర్యం చేశాను. ఇప్పుడు నేను డాక్టర్‌ని కాను. నువ్వు మాతో కోఆపరేట్ చేసే మోహన్ తరపు మనిషివీ కాదు. నువ్వు స్త్రీవి. నేను పురుషుణ్ణి. నా ఫ్యామ్లీ లైఫ్ గురించి నీకోసారి చెప్పాను. రేణూ! నేను కోరుకున్నది జరగలేదు. అనుకున్న పెన్నిధి లభించలేదు. ఏదో ఒకలా రాజీ పడిపోయి, బ్రతికేసేను తప్పితే తృప్తి అనేది లేదు. అసలు విచిత్రం, నా భార్యతో జీవితం సరిపెట్టుకున్నదీ, తప్పనిసరి అయినదీను. పెద్దవాళ్లకోసం పెళ్ళి చేసుకున్నాం. యాంత్రికంగా కాలం గడిపేశాం అనే తప్ప ఏదో పోగొట్టుకున్నాననే భావన రాలేదు.

ఇప్పుడు నిన్ను చూసేక నేను పోగొట్టుకున్నది, చేజారిపోయిందీ ఏమిటో అర్థమవుతూంది రేణూ. ఒకప్పుడు ఈ జీవితం, ఈ హాస్పిటల్‌కే అంకితం అనుకున్నాను. నా భార్య మరణం అందుకు సహకరించింది అనుకున్నాను కానీ ఒంటరివాణ్ణి అయిపోయానని అనిపించలేదు. ఎన్నో ఏళ్ల తర్వాత నిన్ను చూశాక నాలో మమకారం, తపన, అణగారిపోయిన కోరికా, నన్ను పిచ్చి వాణ్ణి చేస్తున్నాయి రేణూ! ఈ మాట నీతో చెప్పాలని పిల్చాను" రేణూకి అతి దగ్గరగా నిలబడి, చెప్పాడు డాక్టర్ మధుకర్.

రేణూ స్థంభించిపోయింది. 'నేను ఏం వింటున్నాను? ఒక పురుషుడిలో తలెత్తిన వాంఛ ఎలాంటిదో వింటున్నాను. సహజమైనదే కావచ్చు మరి నాలో ఎటువంటి స్పందనా కలగలేదు. మధుకర్ మాటవిని, పట్టించుకోకుండా, 'నాలో ఎలాంటి కదలికా' లేదని చెప్పనా? ఆలోచించుకోడానికి టైమ్ ఇవ్వమని చెప్పనా? ఇప్పుడు స్త్రీ, పురుష సంబంధం గురించి తర్కించుకని, నాకు కావలసింది ఏమిటని, తర్కించుకోనా? అన్నిటికీ నేను అతీతురాల్ని అని చెప్పనా? అసలు బదులు చెప్పాల్సిన అవసరం వుందా? ఆలోచనల్లో పడిపోయింది రేణూ.

అది గమనించి "రేణూ! నీకు ఎప్పుడూ ఏమీ అనిపించలేదా? ఎవరినీ నువ్వు కోరుకోవా? ఇంతకుముందు కోరుకునీ భంగపడ్డావా నేను అడిగినంత మాత్రాన నీలో కొత్తగా ఏ భావాలు పుట్టుకురావు. సహజసిద్ధంగా నీ మనసూ, శరీరమూ స్పందనకు గురికావాలి. నేను అనుకుంటాను. మగవాడి కోరిక ఉధృతకెరటం అయితే, స్త్రీలో ప్రేమ మెల్లగా, అంకురించే, మొలకెత్తేచేసే ప్రక్రియ అని! కొందరి మనసు చెదరని తటాకం అని! అయితే ఎవరో ఎప్పుడో ఆ తటాకాన్ని కదలించకమానరు. అదే ప్రకృతి కదా రేణూ! చెప్పు. నువ్వేమనుకుంటున్నావ్? " రేణూ చేతిని ఆవేశంతో స్పృజిస్తూ అన్నాడు డా॥ మధుకర్.

రేణూలో ప్రకంపనలు ప్రారంభమయ్యాయి. అయినా చలించక తన చేతిని వెనక్కి లాక్కుని, నాలుగు అడుగులు వెనక్కి నడిచింది. "డాక్టర్! నేను ఎప్పుడూ ఊహించలేదు. మీరిలా అడుగుతారని. మీరు చాలా చాలా గొప్పవారనుకున్నాను. సర్వసంగ పరిత్యాగులని భావించాను. మనం స్త్రీ, పురుషులుగా మాట్లాడుకుందాం అన్నారు. మీరు డాక్టరని, నేను మోహన్‌తో బాటు మీ రీసెర్చికి తోడుగా వచ్చాననీ మరచిపొమ్మన్నారు. మరచిపోతే ఎలా డాక్టర్ మధూ? మరచిపోలేమని మీలో తలెత్తిన వాంఛ చెప్పడం లేదా? మన ప్రయోగాల మూలమే ఇది! మీరు మరచిపోయారు. అవును గుర్తుకు తెచ్చుకోండి.

ఎయిడ్స్ వ్యాధి ఒకరి నుంచి మరొకరికి వ్యాపించడానికి కారణం స్త్రీ, పురుష వాంఛా, సంగమాలని గుర్తు రాలేదా డాక్టర్? ఆ వాంఛని, రోగికి రానీకుండా చేయాలనే కదా రాత్రీ, పగలూ మనం మోహన్ మీద ప్రయోగాలకు సిద్ధపడ్డాం. అంటే జంకు లేకుండా చెప్పాలంటే మోహన్‌లో పురుషత్వాన్ని చంపేయాలి. మరో స్త్రీలో, స్త్రీత్వన్ని చంపేయాలి. వాళ్లని నిర్వీర్యం చేయాలి. అలా చేసినప్పుడే వాంఛా వుండదు. వాంఛ కలగనప్పుడు, హెచ్.ఐ.వి. ఎటాక్ అయ్యే ఆస్కారమూ వుండదు. డాక్టర్ నేను మీ అంత గొప్ప దాన్ని కాదు. కానీ డాక్టర్ సింగ్‌ని ఒక విషయం అడగాలని అనుకుంటున్నాను. ఇప్పటికే మీ అందరికీ మనిషిలో వాంఛ కలిగించేవి, కలిగించనివి డ్రగ్స్ తెలిసి వుండాలి. అటువంటప్పుడు ఇప్పుడు మన రీసెర్చి ఎందుకు? ఇంతకుమించిన సులువైన ఉపాయం నాకు స్ఫూర్తించింది. అదే మిటో డాక్టర్ సింగ్‌తో చెబుతాను. మీక్కాదు. ఎందుకంటే ఇప్పుడు మీతో ఏం చెప్పినా ఓ.కే అంటారు" అంది స్పష్టంగా వివరిస్తూ రేణూ.

"రేణూ! నా కోరికను పక్కదారి పట్టించాలని చూస్తున్నావు. ఇది మన ఇద్దరికీ సంబంధించినది మాత్రమే! మోహన్‌కీ, నీకూ మధ్య కాదు, మనిద్దరం ఒకటవడానికి ఏ ఆటంకాలూ లేవుకదా రేణూ! చెప్పు, ప్లీజ్"

'ఇంతకుముందు మధుకర్ తన భార్య గురించి చెప్పింది అబద్ధమేమో!' అనిపించింది రేణూకి.

'ఎంతో ఉన్నత భావాలూ, త్యాగ బుద్ధీగలవాడని అనుకున్నాను. అవేమీ నిజం కాకపోవచ్చు. ఈరోజు మధుకర్‌లో మరో మనిషి కనిపిస్తున్నాడు' అనుకుంది రేణూ.

రేణూ ఆలోచనల్లో మునిగిపోవడం చూసి, మధుకర్ దూరంగా వెళ్ళిపోయాడు.

మధుకర్‌ని ఒక టెస్ట్ చేద్దాం! అతడి స్వరూపం బయటపడుతుంది. మనసులో అనుకున్న రేణూ "డాక్టర్! మీరు మీ మనసులో వున్నది చెప్పారు. అదేమీ తప్పు కాదు. మీరు మరొకర్ని పెళ్ళి చేసుకుని మీరనుకున్న తృప్తిని దక్కించుకోండి. నేను మీరు అనుకున్నట్టు పవిత్రంగాలేను. అయినా మీరు నన్ను ఎలా విశ్వశించారు? నేను ఈ హాస్పిటల్లో మోహన్ రూమ్‌లో, రెండు సంవత్సరాలుగా వుంటున్నాను. మోహన్ అసలే విలాస పురుషుడు. రసికుడు. ఎందరో అమ్మాయిలను అవలీలగా తన దారికి తెచ్చుకున్నవాడు. నవ మన్మధుడు. నన్ను పవిత్రంగా వుండనిచ్చాడంటే మీరు నమ్ముతారా?" అంది.

"ఏమిటీ రేణూ! మోహన్ నిన్ను... నిన్ను... ఏం చేశాడు? మాతో ఎందుకు చెప్పలేదు? అంటే... నువ్వు... కూడా...? అర్థోక్తిగా, కంగారుగా అన్నాడు మధుకర్.

"అవునండీ మధు! మీరు పురుషుడు అయినట్టుగా, నేనూ స్త్రీని కదా? మోహన్ చిన్నపిల్లవాడిలా ఏడుస్తుంటే ఓదార్పుగా దగ్గరకి తీసుకుని, స్త్రీ సహజమైన జాలి, కరుణాంతో అతడి బాధలకు కరిగిపోయి,

నేను అతడికి సరండరైపోయాను. ఈ విషయం తెలియక మీరు నన్ను కోరుకుంటున్నారు" అంది , రేణూ.

"ఇది నిజమా? సరదాగా అంటున్నావా? " సీరియస్‌గానే అడిగాడు మధు.

"మీరు మీ మనసువిప్పి, నిజంగా నిజం చెప్పినప్పుడు, నేను అబద్ధం చెప్పగలనా? నిజం అండీ..." అంది రేణూ.

"అంటే... నువ్వు... నువ్వు...? " సందేహంగా అన్నాడు మధు.

"ఆ... సందేహం ఏముందీ? బ్లడ్ టెస్ట్ చేయండి. హెచ్. ఐ. వి. కనిపిస్తుంది" తాపీగా చెప్పింది రేణూ.

"సక్సెస్! గ్రాండ్ సక్సెస్. ఇంతవరకూ నేను నిన్ను పరీక్షించాను. ఎందుకంటే చాలాసార్లు నువ్వు, మోహన్ చాలా సన్నిహితంగా వుండటం చూసేను. డాక్టర్ సింగ్‌తో నా అనుమానం వెల్లడించాను. ఆయన 'కావచ్చు దటీజ్ నేచురల్' అన్నారు. అయినా నీ నోటినుంచే వినాలని ఈరోజు నీమీద నాకు ఇంట్రస్ట్ వున్నట్టూ, నిన్ను కోరుకున్నట్టూ చెప్పాను. పాపం! నువ్వేమో బయట పడిపోయావు. నీకు వచ్చిన ఆలోచన నాకు రాక పోలేదు. అది ఇప్పుడు చెప్పను. డాక్టర్ సింగ్‌కే చెబుతాను. నాట్రాప్‌లో పడి ప్రాబ్లమ్ సాల్వ్ చేసినందుకు థాంక్స్ రేణూ!" అన్నాడు విజయగర్వంతో డా॥ మధుకర్!

ఇప్పుడు తెల్లబోవడం రేణూ వంతయింది. 'ఏమిటీ, డా॥ మధుకర్ నన్నే పరీక్షించాలని ఈ సీన్ క్రియేట్ చేశాడా? నామీద అనుమానం, వచ్చిందా? నేరుగా అడిగితే చెప్పననో, అడగటానికి ధైర్యం చాలకో, ఈ రకంగా ప్లాన్ చేశాడా? రేణూ ఇప్పుడు మళ్ళీ ఆలోచనల్లో పడింది. మధుకర్ మాటలు ఎందుకో నమ్మబుద్ధి కాలేదు. 'ఒకవేళ డాక్టర్ సింగ్ కూడా ఇదే మాట అడిగితే మోహన్‌ని లైక్ చేస్తున్నావా అంటే ఏం చెప్పాలి? స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకే చోట వుంటే వారిమధ్య శారీరక సంబంధం వుండి తీరుతుందా? అలా వుండదని నేను నిరూపిస్తాను' అనుకుంది.

"డాక్టర్ మధూ! మీరు నేరుగా అడిగినా నేను దాచకుండా చెప్పేదాన్ని. మీరిలా సినిమాట్రిక్ ప్లే చేయక్కర్లేదు. మీదంతా అనుమానం. అపోహ. నేను మోహన్‌పట్ల ఆకర్షితురాల్ని అయ్యే అవకాశం లేదు. నేనంత బలహీనురాల్ని కాదు. మరోమాట డాక్టర్. మీరు నా గురించి అడిగారు చూడండి... అది కూడా చెబుతున్నాను వినండి. మీపట్ల కూడా నాలో ఎటువంటి భావనా లేదు. దయచేసి మళ్ళీ ఎన్నడూ ఈ ప్రసక్తి తీసుకురావద్దు. సిన్సియర్‌గా చెబుతున్నాను. నాకు ఒక్కటే ఆలోచన. ఎయిడ్స్ వ్యాధి పీడితులకు విముక్తి కలిగించడం అంతే!" దృఢంగా చెప్పింది రేణూ.

మధుకర్, రేణు మాటలు విన్నాక, ఎందుకు ఆమె ముందు బయటపడిపోయానా అనుకున్నాడు. మధుకర్ ఇక ఏం చెప్పినా రేణు నమ్మదు. అయినా ఇంత కాలం నిగ్రహంగా వుండి ఇప్పుడీ ఆలోచన ఎందుకు చేశానా అనుకున్నాడు. రేణు ఆ రూమ్ విడిచి ఎప్పుడు వెళ్ళిందీ అతను చూడలేదు. డాక్టర్ సింగ్ ఎప్పుడు వచ్చాడో తెలియనూ లేదు. "మధూ సారీ! రేణు వెళ్ళేముందు నీతో చెప్పిన మాటలు నేను వినాల్సి వచ్చింది. మీరిద్దరూ ఏదో విషయంలో ఘర్షణ పడుతున్నారనుకున్నాను. అర్థంకాక కొద్దిసేపు మీ మాటలు విన్నాను. నాతో నిజం చెబుతావా? రేణూని నువ్వు లైక్ చేస్తున్నావా? ఆమెను కోరుకుంటున్నావా? అది తప్పుకాదు. అసహజమూ కాదు. అయితే రేణుని ఇలా పరీక్షించడం కాక, లెటర్ రాసి, అభిప్రాయం అడగవల్సింది." అన్నాడు. అసలే తొందరపడ్డానని ఫీలవుతున్న మధుకర్‌ని, డా॥ సింగ్ మాటలు మరింత బాధించాయి. మాట్లాడక తలవంచుకుని వుండిపోయాడు.

అక్కడితో ఆ గొడవ సమసిపోయింది. రేణు ఎప్పటిలా మామూలుగానే మాట్లాడు తోంది. ఓ రోజు డాక్టర్ సింగ్‌ని అడిగింది.

"డాక్టర్! మోహన్ ఈ హాస్పిటల్లో ఎక్కువ కాలం వుండాల్సి రావడంతో సినిక్‌గా తయారయ్యాడు. ఎట్లైనా తీసుకువెడితే, కొంత నయమేమో? "

"నువ్వు చెప్పింది కరెక్టే. కాని అతడి పరి స్థితి ఎప్పుడు ఎలా వుంటుందో చెప్పలేం. తీరా ఏదైనా ఇబ్బంది కలిగితే, ఏంచేయగ లవే? నేను, మధుకర్ కూడా మీ వెంట రావాల్సి వుంటుందేమో!" అన్నాడు నవ్వుతూ.

"అంటే నావుద్దేశం మరో ఊరికి వెళ్ళాలని కాదు. ఈ ఊళ్ళోనే, ఏ గార్డెన్‌కో హాస్పిటల్ దరిదాపుల్లోనే వుండాలని" అంది రేణూ.

"అయితే సరే! నీకూ అనుభవం వుంది కనుక, జాగ్రత్తగా వుండు. ఏ తేడా కనిపిం చినా వెంటనే హాస్పిటల్‌కి తీసుకువచ్చెయ్" అన్నాడు డాక్టర్ సింగ్.

"మోహన్! మనం అలా బయటకు వెడదాం వస్తావా? నాకూ బోర్‌గా అనిపి స్తోంది. డాక్టర్ పర్మిషన్ తీసుకున్నాను" అంది రేణూ మోహన్‌తో.

మోహన్‌లో సంతోషం పొంగి వచ్చింది. కానీ అంతలోనే కృంగిపోయి, "నేను బయ టకు వస్తే పట్టుమని పది అడుగులు వేయ గలనా? నీకు లేనిపోని ఇబ్బంది కలుగు తుంది" అన్నాడు నిరుత్సాహంగా.

"ఆ జాగ్రత్తలన్నీ నేను తీసుకుంటానోయ్. మనం ఇద్దరమే కాకుండా మీ మదర్, రేఖా, పిల్లలూ, మీ పేరెంట్స్‌ని కూడా రమ్మంటే అందరమూ సరదాగా గడపవచ్చు వాళ్ళనీ రమ్మని చెప్పనా? " ఆత్రంగా అడిగింది రేణూ.

కాసేపు ఆలోచించిన మోహన్, "వద్దు రేణూ! మనిద్దరమే వెడదాం..." అన్నాడు.

"సరే అలాగే కానీ" అంది రేణూ.

"మందులు, ఇంజక్షన్స్ యమర్జన్సీ ఎక్విప్ మెంట్స్ తీసుకుని, రెడీ అయింది రేణు. బయలుదేరే ముందు డా॥ సింగ్‌తో మరో సారి చెప్పింది.

"రేణూ! నేనో, మధుకరో వస్తే బెటరా అని, ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"వద్దు డాక్టర్. ఏం ఫర్వాలేదు. మోహ న్‌తో మన ఫ్యామ్లీ మెంబర్స్‌ని తీసుకువెడ దామా అంటేనే అంగీకరించలేదు. తనో పేషెంట్‌ననే విషయాన్ని మరచిపోనీండి ఆ కాస్సేపైనా" అంది రేణూ.

"ఓ.కే! టేక్ కేర్..." అన్నాడు డాక్టర్ సింగ్, అంగీకరిస్తూ.

ఆరుబయటకు వచ్చి, పదిమందినీ చూశాక మోహన్‌కి చాలా సంతోషంగా అని పించింది. పసిపిల్లవాడిలా కేరింతలు కొట్టాడు. 'కారు నేనే డ్రైవ్ చేస్తాను' అన్నాడు. సినిమా పాటేదో హమ్ చేశాడు.

అతడి ఆనందం చూశాక. రేణుకి కూడా, ఇలా చేయడం మంచిదే అనిపించింది.

"హాస్పటల్ నుంచి బయటకు వచ్చి ఎంతకాలమయిందో గుర్తుందా రేణూ? " అన్నాడు.

"లేదు..." అంది రేణూ... తనకు తెలి సినా కూడా!

"కనీసం ఆరునెలలు అయి వుంటుంది" అన్నాడు మోహన్.

"కాదు. ఇంకా ఎక్కువే!" అంది రేణూ.

"అయితే నువ్వు రోజులు లెక్కపెడుతు న్నావా? "

"రోజులు లెక్కపెట్టడం కాదు. గడిచిపో యిన రోజులెన్నో చెబుతున్నాను." ఆహ్లాదక రంగా నవ్వాడు మోహన్, రేణూ మాటలకు.

ఎందుకైనా మంచిదని, సాధ్యమైనంత తొందరగా వెనక్కి తీసుకువచ్చింది రేణూ.

మరో నెలరోజుల తర్వాత మోహన్ అడి గాడు.

"రేణూ! ఈ రోజు ఎట్లైనా వెడదామా? "

"ఈరోజు కాదు. డాక్టర్ గారితో చెప్పాలి కదా! అడుగుతాలే..." అంది రేణు.

"నీ ఇష్టం రేణూ! చెప్పానుగా. నీకూ అత డితో అనుభవం వుంది. తగిన జాగ్రత్తలు తీసుకుని, వెళ్ళచ్చుననుకుంటే అలాగే వెళ్ళు" అన్నాడు డా॥ సింగ్.

"మోహన్! నిన్నోమాట అడుగుతాను. చెబుతావా? "

"అడుగు. నాకు తెలిస్తే చెబుతాను."

"మనిషికి, పెళ్ళి, పిల్లలూ అనే బంధాలు అవసరమా? "

"అవసరం కంటే అందులో ఆనందం కోరుకుని పెళ్ళి చేసుకుంటారేమో!"

"పోనీ అలాగే అనుకో! భార్యా, భర్తలుగా, ముప్పై సంవత్సరాల జీవితం గడిపేక, ఇద్ద రిలో ఒకరు మరణిస్తే, రెండోవాళ్ళు మళ్ళీ పెళ్లి చేసుకోవాలనుకోవడంలో అర్థం ఏమిటీ? "

"తోడు కోసం. కష్ట, సుఖాలు పంచుకో వడం కోసం"

"దానికి అంతేమిటి? గ్యారంటీ ఏముంది? అప్పుడూ ఒకరు మరణిస్తే, రెండోవాళ్ళు ఒంటరిగా మిగలాల్సిందే!"

"అలా అని రోజూ మృత్యుభయంతో జీవించలేం కదా? జీవితం మీద ఆశ, రేపు గురించి ఆలోచించనీయదు. ఆ వచ్చేరోజు ఆశాజనకంగానే కనిపిస్తుంది కూడా!"

"తర్కానికి పోతే అలా సాగుతూనే వుంటుంది. ఐనా, ఒకరి కోసం కాక, మన కోసం జీవితం అని ఎందుకు అనుకోకూ డదు? "

"అనుకోవచ్చు. అది స్వార్థం. ఇంకొకరి కోసం అనుకుంటే అదో తృప్తి!" అన్నాడు మోహన్.

"మోహన్! డా॥ మధుకర్‌కి మనమంటే జలస్. నీకు తెలుసా!"

మోహన్ రేణు మాటను విని, కొద్దిక్ష ణాలు ఆలోచించాడు. ఆ తర్వాత పట్టలే నంత నవ్వు వచ్చింది అతడికి.

"ఎందుకు నవ్వు వస్తోంది మోహన్? " అడిగింది రేణు.

"నవ్వురాక ఏమి వస్తుంది? మనల్ని, అందులో నన్ను చూసి అసూయపడేవాళ్ళు న్నారంటే ఫన్నీగానే అనిపిస్తుంది" అన్నాడు మోహన్.

"నేను సీరియస్‌గానే చెబుతున్నాను. మనిద్దరిమధ్యా ఏదో అనుబంధం వుందను కుంటున్నాడు. ఆ అనుబంధం ఎయిడ్స్ అని అతడి అనుమానం" అంది రేణు.

"బహుశా జూనియర్ డాక్టర్‌కి ఎంత మంది పేషెంట్స్ వుంటే అంత ఆనందం కాబోలు".

"ఛ. అలా అనుకోవడం ఎందుకులే పాపం! వున్న పేషెంట్స్‌ని తగ్గించాలని చూస్తున్నాడేమో అనుకుందాం."

"ఇంతకీ మనమీద నిఘా వేస్తున్నాడా ఏం? మనం జాగ్రత్తగా వుండాలి" అన్నాడు మోహన్. జరిగినదంతా చెప్పింది రేణు.

"అంటే రేణూ! మధుకర్ నిన్ను కోరుకుం టున్నాడన్నమాట. నువ్వేమన్నావ్? "

"ఏమంటానో తెలియదా మోహన్? " అంది తప్ప, తనెలా అతణ్ణి ఆటపట్టించిందీ, చెప్పలేదు. "అది సరే! నువ్వు నా గురించి ఏమనుకుంటున్నావో చెప్పు" అడిగింది రేణు.

"నువ్వు ఎవరికీ అంతుపట్టని మనిషివి" అన్నాడు మోహన్.

"అంతుపట్టకపోవడం కాదోయ్! నేనేమీ స్వయంవరానికి రాలేదు. మ్యారేజ్ బ్యూరో కోసం వెదకలేదు. నా లక్ష్యం వేరు." అంది రేణు.

"అయ్‌నో రేణూ..." అన్నాడు. మోహన్.

"మోహన్! ఈ రెండు నెలలుగా నీలో ఏదో ఉత్సాహం కనబడుతోంది. అయామ్ సో హ్యాపీ" చెప్పింది రేణూ.

"అది నీ కారణంగానే. చాలా కాలం తర్వాత బయట ప్రపంచంలోకి తీసుకెళ్ళి నాకు సంతోషం కలిగించావు" అన్నాడు మోహన్.

"దానికేముందీ? నీకు ఏది ఆనందం కలి

గిస్తే అది చేద్దాం" అంది రేణు.

అలా మోహన్ చాలా సార్లు బయటకు వెళ్ళడం, వెళ్ళినా ఎటువంటి ప్రాబ్లమ్ లేకపోవడం గమనించాక, డా॥ సింగ్ మనసులో ఒక ఆలోచన వచ్చింది. దాన్ని అమలు చేయాలనుకున్నాడు. వెంటనే చాలా వరకూ మోహన్ కోసం వాడే డ్రగ్స్ ఆపుచేశాడు. మోహన్‌ని, హాస్పటల్లోనే వుంచి, 'నేనొక స్పెసిమన్‌ని. 'పేషంట్‌ని' అనే భావన నుంచి అతణ్ణి బయటపడవేయాలని అనుకున్నాడు. డా॥ సింగ్ ఆలోచన ఫలించింది. ఒకరకంగా ఈ అయిడియాకి రేణు సూచనలే కారణం! ఒకోసారి అనుభవాలే మంచి మందులా పని చేస్తాయి. ప్రొఫెషనల్ కాని రేణూ సహకారం, ఆలోచనా విధానం చికిత్సను మించి, మంచి రిజల్ట్ చూపిస్తోంది. దీనికి కారణం అంకితభావం, పట్టుదలా కారణాలు.

పేషెంట్‌కి మానసికానందం, జీవించాలనే ఆశను పెంచుతుంది. అందుకు సహకరించే వ్యక్తులు తక్కువమంది వుంటారు. అలాంటి సేవా భావం, సహకారం లభించడం రోగికి పునర్జన్మను ప్రసాదించినట్టే! నిత్యజీవితంలో ఎందరో మనుష్యులను చూస్తుంటాం. వారి ప్రవర్తన, జీవన విధానం పరిశీలించి చూడ గల సహనం ఎందరికి వుంటుంది? వారిలో మార్పు తీసుకురావాలనే తపన ఎవరికి కలుగుతుంది? నిజానికి పేషెంట్ తనకు వచ్చిన డిసీజ్ కంటే, చుట్టూ వుండే వారి ప్రవర్తన కారణంగా, నిరాశకు లోనవడం, భయపడటం, అందరికీ దూరంగా వుండాలనుకోవడం జరుగుతుంది. అందుకే మందులు కూడా సరిగా వేసుకోడు. నేనేమై పోతే ఎవరికి కావాలి' అనే దైన్యస్థితిలో వుండిపోయి, కృంగిపోతాడు. పేషెంట్‌తో డాక్టర్స్ మొట్టమొదటి చెప్పేమాట అదే! 'మీరు సహకరిస్తే మీ జీవిత కాలాన్ని పెంచుకోగలరు. లేదంటే ఎన్ని మందులు వాడినా, ఎందరు డాక్టర్లు ట్రీట్‌మెంట్ చేసినా రిజల్ట్ పూర్‌గా వుంటుందని ఇది చాలా నిజం! అయితే పేషెంట్ తనంత తాను ధైర్యాన్ని తెచ్చుకోగలవారు తక్కువ. ఎక్కువమందిని, ఎదుటివారి ప్రేమ, వాత్సల్యం కొండంత ధైర్యాన్ని కలిగిస్తుంది.

రేణూ, డాక్టర్ సింగ్‌ల పర్యవేక్షణలో మోహన్‌కి, ఆ ధైర్యం క్రమంగా ఏర్పడింది. 'తప్పు చేశాను. అనుభవించాల్సిందే...' అనే నిరాశ నుంచి, 'ఆ తప్పును మరచిపోయేలా చేస్తున్న రేణు సాహచర్యంగా గొప్పది అనే అనుభూతికి లోనవుతున్నాడు. అందుకే అతనిలో మార్పు కనిపించటం మొదలైంది. ఈ మార్పుకు చాలా వరకూ కారణమైన రేణును మనసలోనే అభినందించాడు డాక్టర్ సింగ్.

ఈ విషయాలను అరుణ్‌కి, మంగళాదేవికీ చెప్పినప్పుడు, వారి ఆనందానికి అంతేలేదు. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, రేఖ స్నేహితురాలు అయిన రేణూ, మోహన్ కోసం ఎంత తపన పడింది? మొదట్లో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలతో, జీవితంపట్ల ఏమాత్రమూ ఆలోచనాలేని రేణులో ఏ మూలనో దాగివున్న సేవాభావం, కరుణా, వాత్సల్యం, మోహన్ దయనీయ స్థితిని గ్రహించినప్పుడు బయటకు వచ్చిందంటే అదంతా మోహన్ అదృష్టం అనే చెప్పాలి. 'కన్నతల్లిగా, రక్తం పంచుకు పుట్టిన సోదరుడిగా, మేము చేయలేనిది ఎవరో పరాయి మనిషి సహకరించిన కారణంగా, మోహన్ మామూలుగా మారుతున్నాడూ అంటే అదంతా రేణూ ఔదార్యమే' అని, ఆమెను మెచ్చుకున్నారు.

★ ★ ★

కాలగమనంలో మోహన్ చనిపోయాడు. కానీ రేణూ మానవసేవ కొనసాగుతూనే వుంది. అంతేకాదు. తాను కళ్ళారా చూసిన మోహన్ మానసిక వేదన ఆమె మనసు కలిచివేయడంతో ఎయిడ్స్ నిరోధక ప్రచారంలో కూడా ఆమె పాల్గొంటూ వుంటుంది. మోహన్ లాంటి యువకులు లేదా యువతులు ఎంతమందో...

♣

# మినీ కథలు

## వాహన యోగం

ఆ రోజు ఆదివారం కావడంతో బాగా పొద్దెక్కాక లేచి వారఫలం కోసం వార్తాపత్రి కని తిరగేస్తున్నాను.

"ఏమండోయ్, దేని కోసం దాన్నలా చీల్చి చెండాడుతున్నారు. ఇంట్లో సరుకులన్నీ నిండుకున్నాయి. మీరెళ్ళి పట్టుకురాందే పొయ్యిలోంచి పిల్లి కూడా కదల్దు" అని



మూడు గుర్రాల బీడీల సంచిని నా భుజం మీద పడేసింది శ్రీమతి.

"ఈ వారం వారఫల మెలావుందోనని" నసుగుతూ లేచాను.

"వెనకటి కెవడో ఆయవారం బాపడు, తన అరచేతిలో జెర్రిగొడ్డుల్లాంటి రేఖలను చూసుకుంటూ తెగ మురిసిపోయే వాడట. మీరూ ఆ బాపతే. ఈ వారం మీకు వాహన యోగంట. ఇక మీ వాహనాన్ని అధిరోహించండి" అంది శ్రీమతి.

సైకిల్ తీసి బయల్దేరాను. సైకిల్ తొక్కుతుంటే సప్తస్వరాలు వీనులచిల్లు చేస్తుండగా, రద్దీ రోడ్డు మీద కూడ బెల్లు ప్రమేయం లేకుండానే అంతా తప్పుకొని చోటిస్తున్నారు.

నా సైకిల్ కి తెల్లవాడి దొరతనంలాంటి ఘనచరిత్ర వుంది. మా మావగారి తండ్రి గారు విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమంలో పాల్గొని, ఊరంతా తిరిగి సేకరించిన విదేశీ వస్తువుల్ని తన ఇంటి ముందు కుప్పలాపోసి తగలెట్టారట. అందులో లండన్ నుంచి వచ్చిన ఈ సైకిల్ కూడా వుంది. అన్నీ కాలి బూడిదవగా, సీటు ఒక్కటే కాలి మిగిలివున్న ఈ సైకిల్ ని, బాగా చీకటి పడ్డాక మా మావ గారి తల్లిగారు మూడో కంటికి తెలీకుండా తీసుకెళ్ళి అటకెక్కించారట. ఉద్యమం చల్లారగానే, మా మావగారు దాన్ని దించి, అగ్నిలో పునీతమైంది కాబట్టి ఇది స్వదేశీ వస్తువు క్రిందే లెఖ్ఖని వాడటం మొదలెట్టార్ట. వారి పుత్రికా రత్నాన్ని కట్టుకున్నందుకుగాను నాకు కట్నంగా దీన్ని అంటకట్టారు.

ఇన్నాళ్ళయినా శబ్ద కంపరాలు తప్ప, మరే కంపరాలు సృష్టించని ఈ సైకిల్ ని వారస

త్వంగా నా కొడుకు కూడా తోల్తున్నాడు.

వారానికి సరిపడా సరుకులతో ఇంటికి చేరుకున్నాను. వైజాగ్‌లో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తున్న నా తమ్ముడు అప్పటికే వచ్చి వున్నాడు. వాడు తెచ్చుకున్న మోటార్ సైకిల్ పాడవడంతో, దాన్ని బాగుచేయించి అందాక వాడుకోమని వంద కాగితాన్ని నా మొహాన పడేసి; వచ్చే నెలలో వస్తానని చెప్పి వెళ్లిపోయాడు.

కాస్త రిలాక్సయ్యాక ఆ బండిని షెడ్‌కి ఈడ్చుకెళ్ళి దగ్గరుండి బాగుచేయించుకు వచ్చేసరికి నా తలప్రాణం తోకకి వచ్చినట్లయింది. ఇంటికొచ్చేసరికి శ్రీమతి బయటే వేచివుంది.

"చూశావా. వారఫల మహత్యం. వాహన యోగం అని వుంటే వాహనం వచ్చింది కదా. ఇప్పుడేమంటావ్? " అని కళ్ళెగరేశాను గొప్పగా.

నామాట పూర్తవనే లేదు. వాడు వచ్చి "అన్నయ్యా, నేను అర్జంటుగా శ్రీకాకుళం వెళ్ళాలి. ఇప్పుడు బస్సుల్లేవట. ఇది కండిషన్‌లోనే ఉంది కదా" అంటూ నా చేతిలోని బండి తీసుకొని బయల్దేరాడు తమ్ముడు.

"కించిత్ భోగం భవిష్యామి" అన్నట్టు పట్టిన వాహన యోగం చాలుగాని నీరస రోగం పట్టుకోకుండా ఇంత తిండి తిందురు గాని దయ చేయండి" అంది శ్రీమతి లోపలకి నడుస్తూ.

"కాదమ్మా. కించిత్ వాహన యోగం భూతామి" అన్నాడు కొడుకు వాడి బాబాయ్‌ని సాగనంపుతూ.

వచ్చే వారం వారఫలంలోనైనా బాగా కలసిరావాలని సాయిని ప్రార్థిస్తూ శ్రీమతి వెంటపడ్డాను, ఎప్పటిలాగే.

**– జయంతి కావేరిమణి**

---

# టీజింగ్

**లాం**గ్‌బెల్ కావడంతో తరగతి గదుల్లో నుండి బిలబిల మంటూ బయటికొచ్చారు పిల్లలు. అప్పటికే వచ్చి సిద్ధంగా వున్న వేన్‌లలో ఎక్కుతున్నారు కొందరు. రిక్షాలవైపు పరుగులు పెడ్తున్నారు మరికొందరు. ఆ చుట్టుపక్కలవాళ్ళైతే నడక సాగిస్తున్నారు. పిల్లలందరూ వెళ్ళారని నిర్ధారణ చేసుకొని వెనుకగా బయల్దేరాం మేము.

సరోజ, శాంతకుమారి, స్టెల్లా, నేను మేం నలుగురం రోజూ స్కూలు నుండి కలిసే వెళ్తాం కబుర్లు చెప్పుకుంటూ. ఆరోజు పేడే కావడంతో బరువెక్కిన పర్సుల్ని జాగ్రత్తగా పట్టుకొని, మర్నాడు ఆదివారం ప్రోగ్రాం గురించి చర్చించు కుంటూ నడుస్తున్నాం"

"చాన్నాళ్ళైంది కదే మనం సినిమాచూసి. ఏదన్నా మంచి మూవీకెళ్దాం" అంది సరోజ.

"మంచి మూవీ... జోకులెయ్యకమ్మా. అసలీమధ్య వచ్చే సినిమాలకి 'మంచి' అనే విశేషణం తగల్చడానికి వీలవుతోందంటావా!" అంటూ ఏదో చర్చ ప్రారంభించే దానిలా అంది శాంతకుమారి.

ఇదేదో సీరియస్ మేటర్‌లా మారే ప్రమాదాన్ని పసిగట్టి "డియర్ గర్ల్స్. రేపు ఆదివారం. సాయంత్రం మనం ఎగ్జిబిషన్‌కి వెళ్తున్నాం. నోమోర్ ఆర్గ్యుమెంట్సు దట్సాల్!" అన్నాను నేను.

అందరూ ఆ మాటకు తమ అంగీకారాన్ని తెల్పారు.

ముందుగా స్టెల్లా విడిపోతుంది మాతో. సరోజ, శాంతకుమారిలు ఉండేది ఒకే వీధిలో. తర్వాతి వంతు వాళ్ళది. మా ఇల్లు మరికాస్తదూరం. వాళ్ళు విడిపోయాక నేనొక్కదానినే కావడంతో త్వర త్వరగా నడవడం మొదలుపెట్టాను. కొంచెం దూరం నడిచేసరికి ఏదో అనుమానం వచ్చి వెనక్కి తిరిగాను. ఒకతను ఎవరో సైకిల్‌ని నడిపించుకుంటూ నా వెనకే వస్తున్నాడు. నేను వెనుతిరిగేసరికి గబగబా అడుగులు వేస్తూ రాబోయాడు. "మైగాడ్" అనుకుంటూ ఒకసారి చుట్టూ

చూశాను. ఎవరూ కన్పడలేదు అతనూ, నేను తప్ప. అప్పటికే చీకట్లు ముసురు కుంటు న్నాయి శీతాకాలం కావడాన!

నడక వేగం పెంచాను. ఏదో జరుగుతుం దని కాదు, అతడేదైనా చెయ్యబోతే అనవసర మైన 'సీన్' క్రియేటవుతుందే... అన్నది నా భయం. అలాంటివి జరగడం నా కిష్టం వుండదు. నడుస్తూనే మరలా ఒకసారి వెనక్కి చూశాను. అతడూ వేగంగా వస్తు న్నాడు. అంటే అతడు నన్ను ఫాలో చేస్తున్నా డన్న విషయం నిర్ధారణ అయింది. మరింత వేగంగా నడవడం మొదలుపెట్టాను.

"మరీ ఇంతదూరం అయిపోయిందేమిటి



ఇల్లు... ఈరోజు" అనుకున్నాను. చేతిలో ఉన్న పుస్తకాలు, టిఫిన్‌బాక్సు మరీ భారంగా అన్పిస్తున్నాయి. ఎలా నడిచానో నాకే తెలి యదు.. ఇంటిముందుకు వచ్చిపడ్డాను. వీధిలో ఎవ్వరూ కన్పడ్డంలేదు. 'ఛ, ఈ టీ.వీ. ఛానెళ్ళు మనుషుల్ని సోమరుల్ని చెయ్యడమే కాదు, వీధిముఖం కూడా చూడ నియ్యడంలేదు అనుకుంటూ గుమ్మంలో అడు గుపెట్టేసరికి తాళంకప్ప వ్రేలాడుతోంది. ఇంకా ఇంటికిరాని మా పతిదేవుణ్ణి ఓ దులుపు దులిపాను మనసులోనే. వీధి మలు పులోనే ఆగిపోయినట్టున్నాడు అతను, వెనుతి రిగి చూస్తే కన్పడలేదు. "హమ్మయ్య" అను

కొని తాళంతీయడం కోసమని తాళంచెవి కోసం పర్సు తీయబోయాను. అంతే! ఒక్కసా రిగా గుండెలు గుభేలుమన్నాయి. పుస్తకాలు తప్ప... చేతిలో పర్సులేదు. నెల్లాళ్ళ కష్టం. పదీ... పరకానా...మూడువేలు. అందులోనే వున్నాయి. వెంటనే వెళ్ళి వెతికితే దొరుకుతుం దేమో... మనసులో ఆశ. గబగబా బయల్దే రాను రోడ్డుమీద చూసుకుంటూ.

వీధి మలుపు తిరిగానో లేదో... సైకిలుతో అతగాడు. ఆందోళనలో అతని విషయం మర్చిపోయాను. ఒక్క సారిగా కోపం పెల్లు బికింది. అయినా తమాయించుకొని దారిలో వెతుకుతూ నడుస్తున్నాను. అతను సైకిల్ స్టాండ్ వేసి నాదగ్గరగా వస్తున్నాడు ఏదో అంటూ. కోపంలో నాకేమీ విన్పించలేదు.

"ఏంటయ్యా.. ఇందాకటినుంచి చూస్తు న్నాను. ఏంటి నన్ను ఫాలో చేస్తున్నావ్. పైగా ఏదో వాగుతున్నావ్. ఒక్కసారి నలు గుర్నీ పిలిచానంటే ఒళ్ళు హూనం చేసి వదిలిపెడ్తారు జాగ్రత్త." అంటున్న నా కళ్ళ ముందు నాపర్సు కనిపించింది ముందుకు చాచిన అతని చేతిలో!

ఒక్కసారిగా అవాక్కయ్యాను. "మేడం ఇందాక మీరు వస్తుంటే జారిపడినట్టుంది.

మీలో ఎవరిదో, తెలియక మీ వెనకే వచ్చాను మిమ్మల్ని అడుగుదామని. మిమ్మల్ని 'టీజింగ్' చెయ్యడానికి కాదు మేడం" అంటూ నా చేతిలో పెట్టాడు పర్సుని.

తేరుకొని 'థాంక్స్' చెప్పేలోపునే పిలుపుకి అందనంత దూరం వెళ్ళిపోయాడు సైకిల్ పై.

– సువర్చలాజ్యోతి

---

## వేషం

తిరుమలలో ఏడుకొండలవాడి కళ్యాణమూ, దివ్యదర్శనమూ సంతృప్తికరంగా ముగించుకుని తిరుపతికి దిగి వచ్చాము. అది చిరకాల వాంఛ. అప్పటికి తీరినందుకు ఆనందంగా వుంది నాకు.

సామాన్లు సత్రంలో పడేసి తిరుచానూరు వెళ్లి పద్మావతీదేవి దర్శనం చేసుకున్నాము. సాయంత్రం గోవిందరాజస్వామి గుడికి బయలుదేరాము.... ఆ స్వామి బ్రహ్మోత్సవాలు ముగిసి రెండు రోజులు కూడా కాలేదేమో పచ్చటి తోరణాలతో నిండిన పందిళ్లూ, ప్రత్యేక అలంకరణలతో కళకళలాడుతోంది ప్రాంగణమంతా.

గుళ్లోకని పూజ సామాగ్రి కొంటుంటే చీర కొంగు పట్టి లాగుతూ అంది మా నాలుగేళ్ల పాప, "మమ్మీ, అదిగో గాంధీ తాత బొమ్మ' అంటూ.

యథాలాపంగా చూశాను అటువైపు. రోడ్డు మధ్య తెల్లగా మెరిసిపోతోంది గాంధీజీ బొమ్మ.

అంతలోనే ఆరేళ్ల నానీ అరిచాడు- "అది బొమ్మ కాదు, మనిషి!"

"కాదు, బొమ్మే" అంది పాప.

"కాదు, మనిషే" అన్నాడు నానీ.

పిల్లలిద్దరూ వాదించుకుంటూంటే ఈసారి పరిశీలనగా చూశాను నేను. నానీయే కరెక్ట్.



గాంధీజీ వేషం వేసుకున్న మనిషి అది!

ఒళ్ళంతా అల్యూమినియం పెయింట్ పూసుకుని కళ్లజోడుతో, జోడులేని కాళ్లతో, ఓ చేతిలో కర్ర, మరో చేతిలో పుస్తకంతో బొమ్మలా నిశ్చలంగా నిలుచున్నాడు! పుస్తకం వున్న చేయి ముందుకు చాచివుంది. పట్టి చూస్తే కాని తెలుసుకోవడం కష్టం- మనిషి అని. గాంధీ తాత వంటి పర్సనాలిటీతో పెర్ఫెక్ట్‌గా ఆ వేషానికి సరిపోయాడతను.

మొదట బొమ్మ అనుకుని భ్రమపడినా, ఆ తరువాత మనిషి అని గుర్తించిన వారు

కొందరు పుస్తకం పైన పైసలు వుంచుతున్నారు.

ఆ దృశ్యం శ్రీవారికి చూపించాను. మొదట ఆయనా నమ్మలేదు, అది మనిషంటే. ఆ తరువాత అమితంగా విస్తుపోయారు.

"గాంధీ అంటే సోనియాగాంధీ అనుకుంటే ఈ తరంలో... మహాత్ముడిమీద నిర్లజ్జగా, నిస్సంకోచంగా బురదచల్లే ప్రయత్నాలు జరుగుతూన్న ఈ రోజుల్లో- జాతిపితమీద అభిమానంతో, ఒళ్ళంతా పెయింట్ పూసుకుని ఆయన వేషంతో మండువేసవిలో రోజంతా ఇలా నడిబజార్లో నిలుచుని ఆయన తలపులకు వూపిరిపోసే ఆ వ్యక్తి ఎంతైనా అభినందనీయుడు!" అన్నారు ప్రశంసిస్తూ.

"మనమూ పైసలు వేద్దాం డాడీ!" అన్నారు పిల్లలు.

"పైసలు కాదు రూపాయలు వేసినా తక్కువే!" అన్నారాయన జేబులోంచి పది రూపాయలనోటు తీస్తూ. ఆయనతో పాటు పిల్లలు కూడా వుత్సాహంగా కదిలారు అతనికి డబ్బులు ఇవ్వడానికి.

అదిగో, అప్పుడే జరిగింది ఆ సంఘటన!

ఎవరో ఇద్దరు చిన్నారులు ఆడుతూ పరుగెత్తుకొచ్చి చూసుకోకుండా 'గాంధీతాత'ను గుద్దేసారు. అతను తూలి, పడబోయి నిలదొక్కుకున్నాడు. ఆ తరువాత ఆగ్రహంతో ఆ పిల్లల్ని తరిమి చేతికర్రతో చెరొకటీ వాయించాడు. పిల్లలు తెల్లబోయి దూరంగా పారిపోయారు. ఆ తరువాత మళ్ళీ యథాస్థానానికి వచ్చి నిలుచున్నాడతను.

ఆ దృశ్యం కంటపడ్డ మావారు హఠాత్తుగా ఆగిపోయారు. చేతిలోని నోటును తిరిగి జేబులో పెట్టేసుకున్నారు. "పదండి, వెళ్ళిపోదాం" అని ఆయన వెనుదిరగడంతో పిల్లలు తెల్లబోయి చూశారు.

ఆయన ప్రవర్తన నాకూ వింతగొలిపింది. "ఏం జరిగిందీ? " అన్నాను విస్తుపోతూ.

ముఖం గంభీరంగా పెట్టి, "అతని నిజస్వరూపం బయటపడింది" అన్నారు.

అయోమయంగా చూశాను. అప్పుడు ఇలా వివరించారు... "ఓ మహానుభావుడి వేషం వేయగానే సరిపోదు, ఆయన లక్షణాలను కూడా ప్రదర్శించాలి. వేసిన వేషం పొట్టకూటికోసమే అయినాసరే. శాంతి, సహనం, దయ, అహింసలకు మారురూపం గాంధీజీ. అటువంటి మహాత్ముడి వేషం ధరించిన వ్యక్తి-ఆ కాసేపైనా ఆ సులక్షణాలలో కొన్నయినా ప్రదర్శించాలి. మహాత్ముడి వేషం కట్టిన వ్యక్తి నుంచి ఓర్పు, సహనం, దయ, క్షమ ఎదురు చూడడం దురాశకాదు. గాంధీజీ వేషంలోని ఆ వ్యక్తి చిన్నపిల్లలు చూసుకోకుండా వచ్చి మీద పడ్డంతనే పసివాళ్ళనైనా ఆలోచించకుండా ఆగ్రహించుకుని కర్రతో తరిమికొట్టడం గర్హనీయం! తన వేషధారణకు అన్యాయం చేసాడు..."

ఆయన చెప్పింది వాస్తవమేననిపించింది నాకు. కేవలం వేషధారణే కాదు, అందుకు సంబంధించిన తత్వం కూడా ప్రతిబింబించిననాడే ఏవేషమైనా రక్తి కడుతుంది, దానికి ప్రాణం పోస్తుంది. లేకుంటే అది రసాభాస కాకతప్పదు... చిన్నగా నిట్టూర్చి గుడివైపు అడుగులు వేసాను.

**– తిరుమలశ్రీ**

---

## పనసపండు-చెంపదెబ్బ

కంచరపాలెం బస్‌స్టాండ్ నుండి దుమ్ము రేపుకుంటూ బయలుదేరిన ఎర్రబస్ మెయిన్ రోడ్డెక్కి, గుంతల్లో పడినపుడల్లా పడవలాగ ఊగిసలాడుతూ పోతోంది. బస్‌తో పాటు బస్‌పైన వేసిన సామగ్రి, లోపల రేక్‌లో పెట్టిన ట్రంక్ పెట్టెలు, గోనెమూటలుతో పాటు చిన్న పందిలాగ ఉన్న పనసపండు కూడ ఊగుతోంది. బస్ ఎటు ఒరిగితే అటు

రుబ్బురోలు పాత్రంలాగ దొల్లుతోంది. స్పీడ్ పెరగడంతో బస్ గుంతల్లో పడినపుడు పండు ఎగిరి పడడం మొదలెట్టింది. అలా ఎగిరి, ఎగిరి, ఎగిరి పిడుగులాగ ఓ పేసింజర్ నెత్తిమీద ధనేల్‌మని పడింది. ఆ దెబ్బకు పేసింజర్ అమ్మో అని దిక్కులు పిక్కటిల్లేట్టు పొలికేక పెట్టాడు. ఆ కేకకు ప్రయాణీకులతో బాటు డ్రైవర్ కూడ అదిరిపడి క్రీచ్‌మని సడన్‌బ్రేక్ వేసి బస్‌ని ఆపేడు. చూస్తే దిమ్మ రపోయిన పేసింజర్, కొంచెం తొక్కఊడిన పనసపండు... విషయం అర్థమైంది అందరికీ. ఆ షాక్ నుంచి ఒక్కనిముషంలో తేరుకొన్నాడు పేసింజర్. ఉగ్రనరసింహ మూర్తి అయ్యాడు. అసలే ఆరు అడుగుల



మనిషి, పెద్ద పెద్ద మీసాలతో, నిప్పుల్లాంటి ఎర్రటి కళ్ళతో భయంకరంగా కనిపిస్తు న్నాడు. బూతులు లంకించుకొన్నాడు.

"ఎవడ్రా లం... ఈ దిక్కుమాలిన పండుని అక్కడ పెట్టింది, వాడి రక్తం కళ్ళ చూస్తాను, పేగులు లాగేస్తాను, కళ్ళు పొడి చేస్తాను" చిందులు తొక్కుతున్నాడు.

ఎవ్వరూ నోరెత్తలేదు.

"చెప్పండి లేకపోతే ఈ పండుని బయ టకు విసిరేస్తాను" పనసపండుని రెండుచే తులతో ఎత్తాడు బయటపారేయడానికి.

"గిరాటెయ్యకండయ్యా పండుని" అన్నాడు కండక్టర్ మెల్లగా.

"నీకెందుకుబే, ఈ పండు ఏమయినా నీదా"? అడిగాడు నరసింహమూర్తి.

"అవునయ్యా నాదే"

"నీదా" ఆశ్చర్యంగా అడిగాడు నరసింహ మూర్తి.

"అవునుసార్, సత్యం" కండక్టర్ విన యంగా చేతులు కట్టుకొని అన్నాడు.

"బుద్ధుందా? రాస్కెల్, ముదనష్టపు పనసపండుని రేక్‌లో పెడతావా కండక్టరు అయ్యుండి" అంటూ కండక్టర్ గూబ అది రేట్లు సాచి లెంపకాయకొట్టేడు. ఆ దెబ్బకు కండక్టర్ అంతదూరం వెళ్ళి ఓ ఆడమ నిషి ఒళ్ళో పడ్డాడు. ఆ మనిషి కెవ్వుమని కేకపెట్టింది.

ఒక్క తోపుతోసింది కండక్టర్‌ని. ఆ తోపుకు అంతదూరం వెళ్ళి పడ్డాడు అతను.

అదే సమయానికి, బస్‌కి అడ్డంగా జీప్‌ను ఆపి విజిలెన్స్ స్క్వాడ్ బస్‌లోనికి వచ్చేరు, చెకింగ్‌చేయడానికి. వస్తూనే ఈ దృశ్యం కంటబడింది వాళ్ళకి-

"ఎంత గుండెధైర్యం కొడతావా మా స్టేఫ్‌ని" నరసింహమూర్తి కాలర్ పట్టుకొ న్నాడు ఒక ఆఫీసర్.

"కొడతానా! పాతేస్తాను వాడిని" ఆఫీసర్ పట్టు విడిపించుకుంటూ అన్నాడు ఉగ్రనరసింహమూర్తి.

"ప్రభుత్వ ఉద్యోగిపై చేయిచేసుకొంటే ఏమవుతుందో తెలుసా? " "ఏమయితే అవనీ ఐ డోంట్ కేర్" అన్నాడు నరసింహం.

"అసలెందుకు కొట్టావయ్యా" ఇంకో అధికారి ప్రశ్నించాడు.

"నెత్తిమీద పనసపండు పడితే ముద్దెట్టుకుంటారా కొట్టక" ఎదురు ప్రశ్నవేశాడు.

"పనసపండు నెత్తిమీద పడటమేంటి" ఆశ్చర్యపోవడం ఆఫీసర్లవంతయింది. ఒక పేసింజర్ కలిపించుకొని చెప్పాడు, జరిగిన విషయం.

"పండు నీదేనా" అడిగాడు ఆఫీసర్.

"నాది కాదు సార్" అన్నాడు కండక్టర్ మూలుగుతూ.

"మరి ఎందుకు పండు నీదని చెప్పావు"

"బంగారంలాంటి పండుని బయటకు విసిరేస్తుంటే, ఇంట్లోవాళ్ళు తింటారని అట్లా చెప్పానుసార్. ఇంత రభస అవుతుందనుకోలేదు" దీనంగా చెప్పాడు.

"అరే పండు నీదికాదా, అయితే జీపులో పెట్టించు దాన్ని" ఆఫీసర్ ఆర్డర్ వేశాడు. డ్రైవర్ పనసపండుని ఆఫీసర్ల జీపులో పెట్టి వచ్చాడు. చెకింగ్ చేసి ఆఫీసర్లు వెళ్ళిపోయారు. రెండు స్టేజీల తరువాత నరసింహమూర్తి బస్ దిగి పోయాడు.

"ఆఫీసర్లు అదృష్టవంతులు. పండు వాళ్ళకి, చెంపదెబ్బ ఏమో కండక్టర్‌కి, ఇంతకి ఆ పండు ఎవరిదో" అన్నాడు ఓ పేజింజర్.

"ఆ పండు నాదే" అన్నాడు వెనకనుంచి ఓ ఆసామి.

"మరి ఇందాకట్నించి, నోరెత్తవేంటయ్యా, ఇంత గలాభా జరుగుతోంది" అడిగారు అతన్ని.

"చెబితే నా పేగులు లాగేసేవాడు, ఆ నరసింహమూర్తి. చూసారుకదా కండక్టర్ చెంప ఎలా ఉబ్బిందో, పండు కావలిస్తే ఇంకోటి కొనుక్కోవచ్చు" అన్నాడు తాపీగా.

– వి.బి.కె. శ్యామలరావు

---

## చెప్పులోని రాయి

గీత బీ.ఎ. ఫస్టియిర్ చదువుతోంది. స్నేహితులతో కలిసి సినిమా చూసి వస్తోంది. తనింటికి వెళ్ళాలంటే బస్సు కోసం కొంచెం దూరం నడవాలి. సినిమా హాలులో తాము చెప్పుకున్న కబుర్లు, చేసిన అల్లరి, అందర్నీ ఎలా కామెంట్ చేసి నవ్వుకుందీ గుర్తొచ్చి నెమ్మదిగానే నవ్వుకుంటూ నడవసాగింది. ఇంతలో ఒకతను తనను ఫాలో అవుతున్నాడని గ్రహించింది. ఆ నవ్వు తన గురించే అనుకున్నాడేమో, అనుకొని నడక వేగం పెంచింది. తను స్వతహాగా ధైర్యవంతురాలే అయినా ఇలాంటి సీను ఎన్నడూ ఎదుర్కోని కారణంగా కాస్త జంకింది. ఎలాంటి వాడోనని ముఖంలో ఏ భావం కన్పించనీయకుండా చుట్టూ చూస్తున్నట్టు చూసేసరికి దాదాపుగా ప్రక్కనే నడుస్తున్నాడు వాడు. మనిషి చూడటానికి అందంగా అమాయకంగా ఉన్నాడు. చేతిలో ఏవో పుస్తకాలు వున్నాయి. మొహం చూస్తే అలా వెంటబడే రోమియో ముఖంలా లేదు కాని "వెధవబుద్ధి ఎలాంటిదో ఎవరికి తెలుసు" అనుకుంది నడక మరింత వేగం పెంచుతూ. కానీ అతడు కూడా నడక వేగం పెంచుతున్నాడు. దాంతో భయం వేసి బుర్ర పలు రకాలుగా పోసాగింది. కాలేజీలో అక్కడా అక్కడ విన్న సంఘటనలు గుర్తుకొచ్చి భయం ఎక్కువ కాసాగింది. "పోనీ! ఈ వెధవనే ముందుకు పోనీ, నెమ్మదిగా వెళ్లొచ్చు వీడి పీడ పోయాక" అనుకుని మెల్లగా నడవసాగింది. కాని వాడు దీనిని గమనించి తన

నడక వేగం తగ్గించే వాడు. సమానంగాను కాస్త వెనగ్గాను నడవటం మొదలుపెట్టాడు. దాంతో హడలిపోయింది గీత. వాడిని ఏమైనా అందామా అంటే తను ఒక్కర్తే ఉంది. గుంపుగా వుంటే వుండే ధైర్యం లేది ప్పుడు. ఒకవేళ ఇప్పుడేమైనా అంటే ఊర్కుని తర్వాత పగతీర్చుకుంటాడేమోనని భయం. వెనక్కిగాని పక్కకిగాని తిరిగి వాడి వంక చూడకపోయినా వాడు తననే గమనిస్తూ చూస్తున్నట్లు గమనించింది.

ఇంతలో పుండు మీద కారంలా చెప్పులో రాయి ఒకటి చిన్నది దూరింది. గీత వేసు కున్నవి బెల్టు వున్న ఎత్తు చెప్పులు. దాంతో చేరి కూర్చుంది. "లాభం లేదు! ఈ రాయి తీస్తేగాని నడవలేను" అనుకుని వంగింది. వంగుతూ వాడేం చేస్తున్నాడోనని వాడి ముఖం చూసేసరికి వాడి ముఖంలో కించిత్ భయం కన్పించినట్లయింది. తాను చెప్పు విప్పి రాయితీసిపారేసింది. తిరిగి వేసుకుం దామని తల ఎత్తేసరికి బాగా అంత దూరాన పరుగులాంటి నడకతో వాడు వెళ్ళిపోవటం చూసి బిత్తరపోయింది. కారణం ఏమై వుంటుందా అని చుట్టూ చూసింది, ఎక్కడా పోలీసులాంటి శాల్తీలు కూడా కన్పించలేదు. మళ్ళీ అంతలో టక్కున అందుకు కారణం తన చేతిలో వున్న చెప్పు అని తెల్సుకుని



"ఖర్మ! ఇవాళ ఏం అవుతుందోగాని, వీడు ఏమీ చేయకుండా ఎలా తప్పించుకోవాలో అని నేను చూస్తుంటే ఈ రాయి ఒకటి అడుగులు గబగబా వేయకుండా ప్రాణం తీయడానికి" అనుకుంది. అయినా వాడి వెకిలి చూపులకి భయపడనట్లుగా వాడు ఫాలో అవుతున్నట్లు తాను గమనించనట్లుగా వుండేందుకని మేకపోతు గాంభీర్యం ప్రద ర్శిస్తూ ఏమీ పట్టనట్లు మధ్యలో కాలు కాస్త నెమ్మదిగా విదిలించింది, రాయి క్రింద పడి పోతుందేమోనని ఆశతో. కాని అది క్రింద పడలేదు సరికదా ఇంకా కీలకమైన స్థానంలో పొంగిపోయింది. "అమ్మయ్య! చెప్పులో రాయి దూరిన మాట ఎలా వున్నా అది వాడిని కొట్టటానికి తీస్తున్నాననుకొని పారిపో యినట్లున్నాడు వెధవ! పోనీలే పీడాపో యింది" అని సంతోషంగా చెప్పులేసుకొని గబగబా నడవడం మొదలుపెట్టింది గీత. ఈ విషయం తన ఫ్రెండ్స్‌కి చెప్తే తన భయాన్ని ఆట పట్టించి నవ్వుతారేమోనని ఆలోచిస్తూ నడుస్తూనే చిన్నగా నవ్వుకుంది. అంతలోనే వులిక్కిపడి వెనకా ముందూ చూసింది- ఎవ్వరూ లేరు. అబ్బ! చెప్పులోని రాయి రక్షించింది తనని అనుకొంది.

– వై.కె.మూర్తి

✦

# 'మేఘన' పై సమీక్షలు

సెప్టెంబర్ చతురలో ప్రచురించిన కోలపల్లి ఈశ్వర్ నవల 'మేఘన'పై పాఠకులు రాసిన లేఖల నుండి ఎంపికచేసిన సమీక్షలు.

## బతుకు పుస్తకం

*(మొదటి బహుమతి 100/- పొందిన సమీక్ష)*

లక్షల కట్నం పోసినా ఆడపిల్ల పెళ్లి ఓ లాటరీగా పరిణమించిన ఈ రోజుల్లో - విధివశాత్తు పిన్న వయసులోనే వైధవ్యం పాలైన స్త్రీకి మళ్లీ పెళ్లి చేయడమనేది మాటలు కాదు! సంఘసంస్కర్తల పుణ్యమా అంటూ విధవా వివాహాలు ప్రాచుర్యంలోకి వచ్చినా, ఆ అభాగినులను మనస్ఫూర్తిగా తమ జీవితాలలోకి ఆహ్వానించేవారు ఎంతమంది? ! ద్వితీయ వివాహమంటూ జరిగినా ఆ నూతన జీవితం సాఫీగా సాగిపోనుందన్న భరోసా లేదు. మొదటి వివాహం ద్వారా ఆ స్త్రీకి సంతానం వుంటే సమస్య మరింత జటిలం కాక మానదు.

బతుకు బాటలో పూలు, ముళ్లు కూడా పరచుకుని వుండడం సహజం. ముళ్లకు వెరచి వెనుకడుగు వేయడం అవివేకమే అవుతుంది.

యంగ్ విడో మేఘన, భర్తను కోల్పోయి మళ్లీ చేసుకున్న రాజేశ్వరి, మొదటి వివాహంతోనే శాడిస్ట్ భర్త పాలబడ్డ అల్ట్రామాడర్న్ యువతి రేణుశ్రీల జీవితాల పుటలే - 'మేఘన' నవల.

భర్త మధురస్మృతుల నుండి ఇంకా బయట పడని మేఘన, రాజేశ్వరి అనుభవం చూశాక మళ్లీ పెళ్లి చేసుకోవడానికి వెనుకాడుతుంది. సమాజంలో మంచి




చెడులు సహజీవనం చేస్తాయన్న సత్యం ఎరిగినదే అయినా - కోదండం వంటి రాక్షసుణ్ణి, రేణుశ్రీ భర్తలాంటి శాడిస్టును

చూశాక, ధీరజ్‌కుమార్ వంటి వుత్తముడు తారసపడ్డా, మేఘన అనుమానపు దృక్కులతో చూడడం అసహజం కాదు...

మేఘన ద్వితీయ వివాహానికి విముఖత చూపడానికి కారణం - భర్త యొక్క స్మృతులను మరచిపోలేకపోవడంకంటె, రాబోయే వ్యక్తిని గూర్చిన భయాలే ఎక్కువగా కనిపిస్తుంది. ఏది ఏమైనా మేఘన తన భయాలను అధిగమించి చివరికి ధీరజ్‌కుమార్ చేతిని అందుకోవడం, ఆమె జీవితం సుఖాంతం కావడమూ ముదావహం. అందుకు కారణభూతమైన ప్రశాంతి పాత్ర అత్యున్నతంగా వుంది.

నిత్యజీవితంలో తారసపడే పాత్రలతో - ఏ ముచ్చటా తీరకుండానే భర్తల్ని కోల్పోయిన అభాగినుల బతుకులకు, భయాలకూ... పురుషాహంకారాలకూ అద్దంపడుతూ వాటి పరిష్కారాలకు చర్చలనూ బాగానే నడిపింది మేఘన నవల.

– పి.ఎస్.రామలక్ష్మి
సికింద్రాబాద్-03

## (అ)ద్వితీయం...

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

వివాహం మనిషి జీవితంలో ముఖ్యమైన ఘట్టం. స్త్రీ, పురుషులిరువురు మూడు ముళ్ళ బంధంతో ఒక్కటై సంసార జీవితాన్ని ఆనందంగా గడుపుతారు. భార్యాభర్తల్లో ఎవరో ఒకరు ముందుగా మరణించటం అనేది తప్పదు. అది ఎవరి చేతుల్లోనూ లేదు. భార్య చనిపోతే భర్త పిల్లల కోసం కానీ, మరే ఇతర కారణాలవల్ల కానీ రెండవ పెళ్ళి చేసుకోవటం అనాదిగా వస్తున్నది. సమాజం కూడా స్త్రీకి ఆమెకది మొదటి వివాహమైనా ఆమోదముద్ర వేస్తుంది. తన భర్త మొదటి వివాహం సంతానాన్ని పెంచిపెద్దచేసి అతనితోపాటు అన్ని బాధ్యతల్ని పంచుకుంటుంది. కానీ అదే స్వాతంత్ర్యం ఒక స్త్రీకి లేదు. దురదృష్టవశాత్తూ భర్త మరణిస్తే, స్త్రీ పునర్వివాహం చేసుకోవటం చాలా అరుదు. అందులోనూ సంతానవతి అయితే అసలు ఆలోచనేలేదు. మిగిలిన బతుకంతా మోడులా ఒంటరిగా పిల్లల బాధ్యతని స్వీకరించి ఒక సమిధగా మారాలి. ఎందుకీ తారతమ్యం? అన్న అంశాన్ని సుదీర్ఘంగా చర్చించిన నవల మేఘన.

నవల ఇతివృత్తం ఆలోచింపచేసేట్లుగా వుంది. సున్నితమైన, కఠినమైన సమస్య మేఘనది. ధీరజ్‌ని స్వీకరించాలా లేక రాజేశ్వరి జీవితంలాగే లేనిపోని సమస్యల్ని కొని తెచ్చుకోవటం అవుతుందేమో అది మథనపడటం సహజమే. కోదండం లాంటి వాళ్ళు పెళ్ళి చేసుకున్నా కేవలం సంఘంలో ఒక పేరు కోసం గొప్ప కోసం మాత్రమే. ఏదో తాము ఉద్ధరించినట్లు అనుకుంటారు. అలా అని ధీరజ్ లాంటి ఉత్తములు లేక పోలేదు. అందరికీ అలాంటి అదృష్టం వుండదు.

ఎంతమంది సంఘ సంస్కర్తలు వచ్చినా మనుషుల మనస్తత్వంలో మార్పు రానంత వరకు ఏ మంచి జరగదు. ఏ మార్పు రాదు. కనీసం కొంతమందైనా ఆశావహదృక్పథంతో ఆలోచించి ఒక స్త్రీకి మళ్ళీ జీవితాన్ని అందిస్తే అది నిజంగా అద్వితీయమే అవుతుంది.

– యన్.ఇందిర
సికింద్రాబాద్-15

## ఎవరో ఒకరు! ఎపుడో అపుడు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మీరు ఈ నెల 'చతుర'లో ప్రచురించిన

'కోలపల్లి ఈశ్వర్'గారి "మేఘన" రచన మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకొంది. రచనలోని కథ, కథనం రెండూ కొత్తగా ఉన్నాయి. ముఖ్యంగా రేణుశ్రీ పాత్ర ద్వారా తెలియపర్చిన సంగతులు ఎంతగానో నచ్చాయి. ఈ పాత్ర ద్వారా ప్రస్తుత సమాజంలో ఒక స్త్రీకి నైతిక విలువలు, ఎంత అవసరమో తెలియపర్చారు. అదే విధంగా రాజేశ్వరి. కోదండం పాత్రలు కూడా ఎంతో ఆసక్తిగా ఉన్నాయి. ఆదర్శం, సేవాభావం వంటి సూక్తులు ఆవేశంగా తీసుకుని తర్వాత వాటిని కించపర్చటం వల్ల ఎంతటి అనర్థాలకు దారితీస్తుందో కోదండం దంపతుల పాత్రలలో వ్యక్తపర్చారు. దీపిక, ప్రశాంతి పాత్రల ద్వారా జీవితంలో కుంగిపోయి ఉన్న మేఘన లాంటి వారికి ఏ విధంగానైనా అంటే ఓదార్పు మాటలతోనైనా సరే వారిని ఆదుకోవాలని సూచించడం ఎంతో బావుంది. సుగుణమ్మ, నర్సింహారావు దంపతులు పాతతరం వారిలా కాకుండా ఆధునిక భావాలతో మేఘనకు చేయూతనందించడం ఎంతో బావుంది.

ధీరజ్‌కుమార్ పాత్ర ద్వారా ఆధునిక సమాజంలో ఒక వ్యక్తికి ఉండాల్సిన సుగుణాలను సూచించారు. మంచి వ్యక్తిత్వానికి ప్రతీకగా నిల్పారు. ఇంత మంచి వ్యక్తిని గూడా ఇరుగుపొరుగు అంటే కోదండం, రేణుశ్రీ భర్తల పరిశీలనలో అనుమానించడం, ఆచితూచి అడుగేయడం మేఘన అన్ని విధాలా శ్రేయస్కరమే అన్పించింది. ఆధునిక భావాలున్న మరో పాత, కావ్య ద్వారా, ఆమె వివాహ విషయాల ద్వారా గాని మంచి భావాల్ని వ్యక్తం చేసి వుంటే ఇంకా బావుండేది. రేణుశ్రీ, వంశీ పాత్రల ద్వారా యువత టీనేజ్‌లో ఆకర్షణ, మోజు, విలాసం వంటి దుర్వ్యసనాలకు పాల్పడితే భవిష్యత్తులో ఎదురయ్యే ఘోర ప్రమాదాలను ఎదుర్కొనటానికి మానసిక స్థైర్యం ఉండదని తెలియజెప్పడం బావుంది.

*– మందడి వెంకటేశ్వరరావు*
చందర్లపాడు

## ఏకకాలంలో కనువిప్పు

*(నాల్గవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఎంచుకున్న అంశం పట్ల మంచి అవగాహనతో, కథానాయక, నాయికలకు అనవసర భేషజాలు, "హీరో-హీరోయినిజం"లను ఆపాదించకుండా, సగటు మధ్య తరగతి పాత్రలతో "మేఘన" నవలను సాదాసీదాగా, అర్థవంతంగా నడిపించగలిగారు- రచయిత కోలపల్లి ఈశ్వర్.

పురుష బాధిత, పురుష ద్వేష స్త్రీలెందరికో ఈ నవల ఏకకాలంలో కనువిప్పు కలిగించే గైడ్‌లా ఉపకరిస్తుందనటంలో అతిశయోక్తి లేదు.

విధివంచిత స్త్రీలకు ప్రతినిధిగా మేఘన, 'ఫ్రెష్ పెళ్లి' బాధిత శ్రీలత, రెండో మనువుకు బలైన రాజేశ్వరిలాంటి వారి జీవన వైచిత్రాలను వినీ, చూసీ... ధీరజ్‌కుమార్‌ను పెళ్లాడే ప్రక్రియలో ముందు జాగ్రత్తగా పంతంగా ఉండటం సమంజసంగానే గోచరిస్తుంది. పోతే... ఉత్తముడైన భర్త రఘుతో ఆరు నెలలే అయినా పూర్తి తృప్తికర సంసార జీవనం సాగించిన మేఘన, మరీ శృతిమించి 'భర్తలు' అనే వారిపై అనుమాన, భయాలు పెంచుకోవడం ఆలోచింపజేస్తుంది.

యిదిలా ఉంటే, అత్యాధునికతకు, అతి తెలివికి పోయి పెళ్లిని 'లైట్'గా తీసేస్కుని, టీనేజీల్లో బాయ్‌ఫ్రెండ్‌లూ గట్రా మెయింటెయిన్ చేసుకోవడం భవిష్యత్ ప్రమాదాలకు మూలం కావొచ్చని రచయిత సోదాహరణంగా... నర్మగర్భంగా హెచ్చరించిన వైనం బాగుంది.

భార్య చనిపోయి లేదా విడాకులు పొంది... రెండో పెళ్లి, మూడో పెళ్ళిళ్ల

చేసుకొనే 'భర్తల' బాధలకన్నా, "స్త్రీవాద" కోణంలో... తను రెండో పెళ్లామయ్యే ఆడ వారికే వర్ణణాతీత బాధలన్నది నిర్వివాదాంశం. మొత్తానికి విషయాన్ని విడమర్చి.. గందరగోళం కాకుండా సూటిగా చెప్పారు రచయిత.

"స్త్రీ" అనుకూల రచనగా కన్పిస్తూనే... "మంచివాళ్లున్నారు సుమా?" అంటూ ఆశ కల్పిస్తూ, ఆత్మవిశ్వాసం ఇస్తూ, కథ సుఖాంతంతో "పురుష పుంగవులనూ"... ఆకట్టుకొన్న నవల.

– ఎమ్. రమేష్ యాదవ్

కరంజి - 504312

## పెళ్లి చిరునామా

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

స్త్రీకి పునర్వివాహం అవసరమా కాదా అని వాదించే రోజులు పోయాయి. స్త్రీ పునర్వివాహం చేసుకునే తరుణంలో - వివాహానంతరం ఏర్పడే సమస్యలను స్పష్టం చేయడానికి మేఘన నవలా రచయిత ప్రయత్నించారు. స్త్రీ పునర్వివాహం అందరిచేత ఆమోదించబడినా, మగవాడి చెడునడతవల్ల, సంకుచిత మనస్తత్వంవల్ల స్త్రీ జీవితం అస్తవ్యస్తం కావడమేకాక విషాదాంతంకూడ కావచ్చని చెప్పడం చాలా భయపెట్టేదిగా ఉంది. ఆదర్శవంతునిగా కనపడాలని భర్తృవిహీనురాలయిన రాజేశ్వరిని వివాహమాడిన కోదండం తరువాత్తరువాత తనకేదో నష్టం కలిగినట్టు భావించడం, శాడిస్టుగా మారి రాజేశ్వరిని హింసించి కడకు మరో స్త్రీని చేపట్టి రాజేశ్వరి మరణానికి కారణభూతుడవడం - కోదండం ఒక సగటు మనిషిగా కనిపించినా - రాజేశ్వరి ధైర్యంగా నిలబడి వీగిపోకుండా, ఆత్మహత్య చేసుకోకుండా ఉంటే అభాగ్యులకు దారి చూపినవారయ్యేవారు.

ఈ నవలలో రేణుశ్రీ - ఏమంత ఉపయుక్తమైన పాత్రకాదు. ఈ పాత్ర లేకపోయినా నవల నడచిపోతుంది. రేణుశ్రీని వేరుగా చూస్తే 'షాదీకా పహలే'... 'కుచ్ కుచ్ హోతాహై' అనే మనస్తత్వమున్నవారికి మాత్రం ఒక చక్కని హెచ్చరిక. తన వివాహం - కాపురం - చెడిపోవడంలో రేణుశ్రీ బాధ్యత ఏమీలేదన్నట్టు చూపించడం బాధకలిగించింది. ఆమె బాధపడటంలో అర్థం కనిపించదు. రాజేశ్వరి చనిపోకుండా ఉంటే, కోదండానికి శిక్షపడి ఉంటే, అర్థంకనిపించేది. ఎంతటి నేరం చేసినవారైనా శిక్షనుంచి తప్పించుకోగలరని చెప్పడం కోసమైతే ఓ. కే. అనాలిమరి. ఏదైనా రాజేశ్వరి కోసం ఒక కన్నీటి బిందువు రాల్చక తప్పదెవరికైనా. స్త్రీల జీవితాన్నీ, వివాహ వైరుధ్యాన్ని భిన్నకోణంలో వివరించిందీ నవల.

– జయంతి వెంకటరమణ

పెందుర్తి-531 173

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78